# రక్తాక్షరాలు

జ్యూలియస్ ఫ్యూజిక్

▽

అనువాదం :

అనిశెట్టి



'అభ్యుదయ' కార్యాలయం

: విజయవాడ :

# ఒక మాట

నేను రావెన్స్‌బ్రిక్ కారాగారంలో వున్నప్పుడు, నా భర్త జ్యూలియస్ ఫ్యూజిక్‌కు 1943 ఆగస్టు '25 వ తేదీన బెర్లిన్‌లోని ఒక నాజీకోర్టు మరణదండన విధించిందని ఒక తోటి ఖైదీ ద్వారా తెలుసుకున్నాను.

అతని కీ దుర్గతి ఎలా సంభవించిందా? అని నన్ను వేధించిన ప్రశ్నలతో కారాగారం ఘోషించింది - కాని సమాధానం లభించ లేదు.

1945 మే నెలలో హిట్లర్ జర్మనీ పతనమైన తర్వాత, ఫాసిస్టుల క్రూరహింసలతో ప్రాణాలు కోల్పోక మిగిలిన ఖైదీలంతా విడుదలై బయటికి వచ్చారు. అందులో నేనూ ఉన్నాను.

ఫాసిస్టులనుండి విముక్తిపొందిన నా మాతృదేశానికి తిరిగి వచ్చాను. విడుదలైన వేలకొలది ఖైదీ లంతా జర్మన్లు జైళ్ళలో త్రోసి యమయాతనలు పెట్టిన వారి వారి భర్తలు, భార్యలు, బిడ్డలు, తండ్రులు, తల్లులకోసం దేశమంతా గాలించినట్లే, నేనుకూడా నా భర్త కోసం వెతికాను.

అప్పుడు తెలిసింది : అతనికి శిక్షపడిన పధ్నాలుగో రోజున, సెప్టెంబరు 8 వ తేదీన బెర్లిన్‌లో అతన్ని ఉరితీశారు.

అంతేగాదు, ప్రేగ్‌లో పాంక్రాస్ ఖైదులో వున్నప్పుడు అతను తన అనుభవాలన్నిటినీ చిన్న చిన్న రచనలలో చిత్రించాడు.

ఎ. కోలిన్‌స్కీ అనే ఒక జెక్ గార్డ్, పేపరూ పెన్సిలూ తెచ్చి యిచ్చి, వ్రాసిన పిదప ఆ చీటీ లన్నిటినీ రహస్యంగా బైటికి చేర్చేవాడు. అతన్ని కలుసుకుని, ఫ్యూజిక్ వ్రాసిన రచనలన్నీ సేకరించాను. అంతవరకూ అనేకమంది విశ్వాసనీయుల దగ్గర అవన్నీ భద్రంగా దాగివున్నాయి. ఈ రచన జ్యూలియస్ ఫ్యూజిక్ జీవితానికి కట్టకడపటి అధ్యాయం. దీన్ని పాఠకలోకానికి అందజేస్తున్నాను.

అగస్తినా ఫ్యూజిక్.

3743

## ప్రవేశిక

శరీరాన్ని నిటారుగా సాగదీసి 'ఎటెన్షన్' లో కూచుని, అరి చేతులతో మోకాళ్ళను పట్టుకుని, ఇంతకుముందు పెచెక్ బ్యాంకు వున్న భవనంలో, ఒక గదిలో, మురికిపట్టిన ఎదుటిగోడకు చూపులు బిగించి — ఇది ఆలోచించుకోడానికి తగిన పరిస్థితిమాత్రంకాదు! కాని ఆలోచనల్నికూడా 'అటెన్షన్' లో కూచోబెట్టగలశక్తి ఎవరికుంది?

ఎప్పుడో, ఎవరోగాని, ఈపెచెక్ భవనానికి 'సినిమా' అని పేరుపెట్టారు. జర్మన్లు దీన్ని 'గృహనిర్బంధం' అన్నారు. కాని, 'సినిమా' అనేది అద్భుతమైనపేరు. ఈవిశాలమైనహాలులో ఆరువరుసలుగా అమర్చిన బెంచీలమీద, ప్రశ్నలతో వేధించే జర్మన్ల చిత్రహింసకు గురి అవుతూ కూచున్నఖైదీలు! విచారణ, చిత్రహింస, చావుకోసం ఎదురు చూస్తున్న ఖైదీలు, ఎదురుగావున్న పెద్దగోడకు చూపులప్పగించి, ఎన్నడూ ఎవ్వరూ ఫిల్ముతీయనంతగా తమ జీవితంలోని వివిధదృశ్యాలను దర్శిస్తున్నారు. ఒకరి సంపూర్ణజీవితం, మరొకరి జీవితంలో క్షణమాత్రం జరిగిన ఏదో విశేషం, ఒకరితల్లి, భార్య, బిడ్డలదృశ్యాలు, ధ్వంసమైన ఒకరి సంసారం, భగ్నమైన మరొకరిబ్రతుకు — అన్నీ ఆగోడ మీద సినిమాలోలాగ నడుస్తున్నాయి. అసమానధైర్యసాహసాలు ప్రదర్శించిన కామ్రేడ్సు జీవితాలు, నీచంగా ద్రోహం చేసినవారివీ — అన్నీ. నాదగ్గర నాజీ — వ్యతిరేక కరపత్రం తీసుకున్న కామ్రేడ్, మళ్ళీ ఇప్పుడు జరుగుతున్న రక్తపాతం, నాపట్ల భక్తిగౌరవాలతో నా చేయి పట్టుకున్న కామ్రేడ్—అందరిజీవితాలూ కన్పిస్తున్నాయి. భయం

కరమైన సంఘటనలు, ధైర్యసాహసాలతో నిండిన నిశ్చయాలు, ద్వేషం, ప్రేమ, భయం, ఆశ — ఇవన్నీ ఈఖిలింలనిండా వున్నాయి.

మానవజీవితానికే పెడముఖంపెట్టి మాలో ప్రతిఒక్కడూ రోజూ తన కళ్లముందే తను మరణిస్తున్నాడు. కాని, కొందరుమాత్రమే పునర్జన్మ పొందగల్గుతున్నారు.

ఇలాగ కొన్నివందలసార్లు నాజీవితచిత్రాన్ని చూసుకున్నాను. వేలకొలది విశేషాలు కన్పిస్తున్నాయి. ఇప్పుడు: వాటన్నిటినీ అక్షరాలలో పొందుపరచటానికి ప్రయత్నిస్తాను. ఈలోపలే నాజీల ఉరి వుచ్చులు నాకంఠానికి బిగుసుకుంటే బైటవున్న కోట్లకొలది ప్రజలు దీనికి చరమాంకంవ్రాసి 'సుఖాంతం' చేస్తారు. ఆ విశ్వాసం నాకుంది.

ప్రేగ్‌లో. పాంక్రాస్‌లో.
నాజీఖైదులో.
1943 వసంతకాలంలో
వ్రాసినవాక్యాలు.

జ్యూలియస్ ఫ్యూజిక్

# I

## ఇరవైనాలుగు గంటలు

ఏప్రిల్ 24, 1942.

ఇంకా ఐదునిమిషాలు, గడియారం పదిగంటలు మోగుతుంది. ఈ వసంతసాయంత్రం ఎంత హాయిగా సౌందర్యమయంగావుంది!

జెలెనిక్స్ కుటుంబంవున్న భవనం - మళ్లీ పదింటికి కర్ఫ్యూ వుత్తరువుప్రకారం మూసేస్తారేమోననే ఆదుర్దాతో, త్వరితంగా నడుస్తున్నాను - కుంటుకుంటూపోయే వృద్ధుడిలాగ నటిస్తూ. నా 'అనుచరుడు' మిరెక్ ఎదురుచూస్తుంటాడు. ఈసారి మేము మాట్లాడుకోవలసిన ముఖ్యవిషయాలేమీలేవు. కాని, అనుకొన్నప్రకారం కలుసుకోకపోతే అనవసరంగా ఆందోళనకలుగుతుంది; అందులోనూ పాపం, నన్నాదరించే దంపతులకు వ్యథ కలిగించడం నాకిష్టంలేదు.

ఒక కప్పు టీతో నన్నాహ్వానించారు. మిరెక్ సరే, ఉన్నాడు - ఫ్రీడ్ దంపతులుకూడా - ఇంతమంది వుంటే ఏ ప్రమాదమైనా కలగవచ్చు.

"కామ్రేడ్స్! మనమంతా కలుసుకోవడం నాకిష్టమే. కాని, ఇలాగ అందరూ ఒకేసారికాదు, అందరం ఒక్కసారిగా ఒక్కచోటే కూడితే ఇక చెప్పనక్కర లేదుగదా - నమ్మకంగా జైలుకో, మరణానికో దారితీస్తుంది. మనం రహస్యనిబంధనల్ని అనుసరించైనా పని చెయ్యాలి, లేకపోతే పూర్తిగా మానెయ్యాలి. ఇలాగైతే అసలు మన ప్రాణాలకే ముప్పువస్తుంది. తెలిసిందా?"

"ఇప్పుడు గ్రహించాం"

"నాకోసమేమైనా తెచ్చారా?"

"మనం మే దినోత్సవానికి ప్రకటిస్తున్న "రెడ్‌రైట్స్" ప్రతి ఒకటి తెచ్చాం"

"బాగుంది. నువ్వేం తెచ్చావ్ మిర్కో"

"విశేషా లేమీలేవు. పనంతా సక్రమంగానే నడుస్తోంది..."

"సరే ఐతే మే ఒకటి తర్వాత కలుసుకుంటాం. నేను కబురు పంపిస్తాను. అంతవరకూ — శెలవు"

"ఇంకోకప్పు టీ పుచ్చుకోరూ?"

"మిసెస్ జెలెనిక్! నాకు టీ వద్దమ్మా, యిక్కడ చాలామంది వున్నాం."

"ఒకకప్పు త్రాగుదురూ!"

అప్పుడే చేసిన టీలోంచి ఆవిరి పైకి సాగుతోంది.

ఎవరో తలుపు తట్టుతున్నారు.

ఇంతరాత్రివేళ? ఎవరబ్బా!

ఆ వచ్చినవాళ్ళెవరోగాని ఓపికపట్టలేక తలుపులు బాదటం మొదలెట్టారు.

"తెరవండి! పోలీసు లొచ్చారు"

వెంటనే, కిటికీలోంచి పారిపోనా?

నా దగ్గర పిస్టల్ వుంది. వాళ్ళు ముందుకురాకుండా ఎదుర్కొంటాను. ప్చ! ప్రయోజనంలేదు. అవకాశం మించిపోయింది. గెస్టాపో సైనికులు కిటికీలదగ్గర నిలబడి గదిలోకి తుపాకులు గురిపెట్టారు. సి. ఐ. డీ. లు తలుపులు బార్లాత్రోసేసి, వంటగదిలోంచి ముందుకు తోసుకొస్తున్నారు. వాళ్ళు వచ్చిన ద్వారంతలుపు వెనకాలే నిలబడ్డాను. నన్ను చూడలేదు. వాళ్ళ తొమ్మిదితుపాకుల్నీ, నిరాయుధులైన ఇద్దరు స్త్రీలు, ముగ్గురు మగవాళ్ళమీదికి బారుచేశారు. నేనిప్పుడు తుపాకీకాల్చితే నాకంటెముందే, నా సహచరు లైదుగురినీ బలి చేస్తారు. నన్ను నేను కాల్చుకుని ఆత్మహత్యజేసుకుంటే? ఎలాగూ కాల్చితీరుతారు, ఐదుగురూ పడిపోతారు.

ఇప్పుడు నేను కాల్చకపోతే? ఆరునెలలో, ఏడాదో ఖైదులో మగ్గుతారు. అప్పుడు విప్లవమే వాళ్ళకు విముక్తి కలిగిస్తుంది, స్వేచ్ఛగా బైటికివస్తారు. మిరెక్, నేనూ మాత్రం బ్రతికి బయటపడటం అసాధ్యం. మమ్మల్ని చిత్రహింసచేసి వధిస్తారు. నేను ఒకమాటకూడా బైటికి

పొక్కను. కాని, మిరెక్? స్పెయిన్ అంతర్యుద్ధంలో పోరాడినవాడు, రెండేళ్ళు ఫ్రాన్సులో కాన్సెన్ట్రేషన్ కాంపులో మగ్గినవాడు, యుద్ధ కాలంలోనే ఫ్రాన్సునుంచి ప్రేగ్‌కు నానాయాతనలూపడి రహస్యంగా వచ్చినవాడు — ఊహు! అతను చచ్చినా రహస్యాలు చెప్పడు. బైట పడటమా, లేదా? నిర్ణయించుకోవడానికి గడువు రెండు సెకండ్లో, మూడో! ఇంతే.

నేను తుపాకి పేల్చితే? ఎవరినీ రక్షించలేను, సరిగదా – నన్ను నేను చిత్రహింసనుంచి కాపాడుకుంటాను. కాని, వాళ్ళయిదుగురి ప్రాణాలూ బలితీసుకున్నట్లే, అంతేనా? అవును. ఐతే ఇక బైటికి వస్తాను. తలుపుమూలనుండి బైటికి వచ్చేశాను.

"అదీ! మరొకడు!"

నా ముఖానికి గట్టిగా దెబ్బ తగిలింది. దీనితో ప్రాణంపోయినా ఆశ్చర్యం లేదు.

"చేతులు పైకెత్తు!"

ఇంకొక దెబ్బ. ఇంకొకటి.

అబ్బ! ఎంత ఘోరంగా వుంటుందనుకున్నానో, అలాగే వుంది.

గదినిండా విరిగిన కుర్చీలు, బల్లలు, ముక్కలుముక్కలైపోయిన సామానులు.

ఇంకా కొడుతున్నారు. తంతున్నారు.

"నడవండి"

పోలీసు లారీలో కీడ్చుకుపోతున్నారు. ప్రతి నిమిషం పిస్టల్స్ నామీదికే గురిపెట్టి, కారులోకెక్కి నామీద మండిపడుతున్నారు.

"ఎవరు నువ్వు?"

"ప్రొఫెసర్ హొరాక్"

"అబద్ధం"

భుజాలెగురవేసి ఊరుకొన్నాను.

"కదలకుండా కూచుంటావా, కాల్చమంటావా!"

"సరే! కాల్చండి!"

వాళ్ళు పట్టుకుని మెలిపెడుతున్నారు.

వీధిలో ఏదో కారు వెళుతోంది. తెల్లని గుడ్డతో అలంకరించి నట్లుంది. పెళ్లి సంరంభమా – రాత్రివేళ ? నాకు జ్వరంకాయటం లేదుగద !

పెచెక్ భవనం గెస్టాపో కేంద్రస్థానం. నేను ప్రాణాలతో ఈ ఆఫీసులో ప్రవేశిస్తానని ఎప్పుడూ ఊహించలేదు. నాలుగో అంతస్థువరకూ ఎక్కమని త్రోసుకుంటూనేవచ్చారు. ఓహో ! ఇదా, సెక్షన్ 2 ఎ అంటే ! కమ్యూనిస్టు వ్యతిరేక పరిశోధకశాఖ. తెలుసుకోవాలని నాకు ఆతురతగావుంది.

అరెస్టయినవారిని విచారించటానికి ఒక డిపార్టుమెంట్. దానికి అధికారిగావున్న ఒక పొడుగాటి ఆఫీసరు భద్రంగా ఒక రివాల్వరు జేబులోపెట్టుకొని, నన్నుతని ఆఫీసులోనికి తీసుకుపోతున్నాడు. నా సిగరెట్టును వెలిగించిపెడుతున్నాడు.

"ఎవరు నీవు ?"

"ప్రొఫెసర్ హొరాక్"

"అబద్ధమాడుతున్నావ్"

అతని రిస్ట్వాచి పదకొండు చూపుతోంది.

"అతన్ని సోదాచెయ్యండి"

నాబట్టలు విప్పేసి, సోదాచేస్తున్నారు.

"ఐడెంటిటీకార్డు * వుంది."

"పేరేమిటి ?"

"ప్రొఫెసర్ హొరాక్."

"చెక్ చేసి నిజమోకాదో చూడండి."

వాళ్ళు టెలిఫోన్లో మాట్లాడి వేరే డిపార్టుమెంట్నుంచి కనుక్కుంటున్నారు.

"ఇది రిజిష్టర్ కాలేదు. దొంగకార్డు."

"ఇది ఎవరిచ్చారు నీకు?"

"పోలీస్ హెడ్క్వార్టర్సు" అన్నాను.

---

* ఒక పౌరునిపేరు, వృత్తి మొదలైన వివరాలను తెలియజేసే కార్డు. జర్మన్ ఆక్రమితప్రాంతా లన్నిటిలోనూ నాజీలు ఈ పద్ధతి ప్రవేశపెట్టారు.

మొట్టమొదటిదెబ్బ ... దారుణంగా ... క్రరతో ... ఒకటీ, రెండు, మూడు...లెక్కపెట్టనా?

వొద్దు, వొద్దు; అనవసరం. ఈ లెక్కలన్నీ వినేవాడెవడు?

"నీపేరు? చెప్పు. చిరునామా? చెప్పు. ఎవరితో నీ కాంటాక్టు? చెప్పు. వాళ్ళ చిరునామాలు? చెప్పు చెప్పు, చెప్పవేం, లేకపోతే, ఇదిగో హింసిస్తాం"

కాని, ఒకమనిషి ఎన్నిదెబ్బలని తట్టుకోగలడు?

అర్ధరాత్రయిందని రేడియో గొణుగుతోంది. బైట హోటళ్ళు మూసేస్తూవుంటారు. అతిథులు ఇంటిమొహం పట్టుతారు. వీడ్కోలు పుచ్చుకోను మనస్కరించని ప్రేయసీప్రియులు ద్వారాలవద్ద ఆందోళన పడుతూ నిలబడివుంటారు. సంతోషంతో నవ్వుతూ పోలీస్ఆఫీసరు గదిలోకి వచ్చాడు.

"అంతా సక్రమంగానేవుంది, సంపాదకమహాశయా!"

ఎవరు బైటపెట్టారు? జెలినిక్స్ దంపతులా? ఫ్రీడ్ దంపతులు కాదుకద! అసలు వాళ్ళు నాపేరే ఎరగరే!

"తెలిసిందా? మే మంతాకనిపెట్టాం. చెప్పు, న్యాయంగాచెప్పు. వాళ్ళప్రత్యేక నిఘంటువులో 'న్యాయంగా – చెప్పడ' మంటే ద్రోహానికి ఒప్పుకోవడమన్నమాట.

మీన్యాయం నాకక్కరలేదు.

"అతన్ని బాగా కట్టేసి ఇంకా కొంచెం రుచి చూపించండి"

ఒంటిగంట. బాడుగకార్లు ఎక్కడివక్కడ నిలిచిపోతున్నాయి. వీధులు నిర్జనంగా వున్నాయి.ఆప్యాయంగా కూచుని చివరివరకూ విన్న శ్రోతలకు రేడియో అభివందనాలర్పిస్తోంది.

"ఇంకా కేంద్రకమిటీ సభ్యులెవరు? మీ రేడియో ప్రసార యంత్రా లెక్కడున్నాయి? మీ ప్రెస్ ఎక్కడుంది చెప్పు! చెప్పు! మాట్లాడవేం?"

మళ్ళీ ఇప్పుడు దెబ్బలు లెక్కపెట్టగలను. నాకు తెలిసే బాధ అంతా ఒకటే. ఆవేశంతో పెదవులు కొరుక్కుంటే కలిగేబాధ.

"అతని బూట్లు తీసెయ్యండి"

నిజమే, ఇంకా నాపాదాలు మొద్దుబారేటట్టు కొట్టలేరు. తెలుస్తోనేవుంది. ఐదు, ఆరు ఏడు - ప్రతిసారీ ఆగ్రదెబ్బ నరాళాని కంటుతోంది. దుర్భరంగావుంది.

రెండుగంటలు. ప్రెగ్ నగరం నిద్రలోమునిగింది. ఎక్కడో ఒకచోట ఒక పసిబిడ్డ కలలో పలవరిస్తుంది. ఒక భర్త ప్రేమతో భార్య వీపుచరుస్తాడు.

"చెప్పు! చెప్పు!"

పగిలి రక్తంకారుతున్న చిగుళ్ళమీదుగా నా నాలుక పాకుతోంది. ఎన్ని పళ్ళు ఊడిపోయాయో లెక్కపెట్టడానికి ప్రయత్నిస్తోంది. లెక్క నిలవడంలేదు. పన్నెండు, పదిహేను, పదిహేడు? తప్పు. అది నన్నుగురించి "విచారణ!" సాగించే కమిసార్ల సంఖ్య. వాళ్లే కొట్టికొట్టి అయాసపడుతున్నారు. కాని, మృత్యువు రాదేం!

మూడుగంటలు. సూర్యోదయం ఊరిబైటనుంచి లోపలికి ప్రవేశిస్తోంది. డ్రైవర్లు కూరగాయలు మార్కెటుకు చేరవేస్తున్నారు. వీధులూడ్చేవాళ్లు పనికి బయలుదేరుతున్నారు. బహుశా, మరొక సూర్యోదయాన్నిగూడా చూడగలనేమో!

నాభార్యని ప్రవేశపెట్టారు.

"అతనెవరో తెలుసా నీకు?"

నాకు నోటిచుట్టూ కారుతున్న రక్తాన్ని ఆమె చూడకుండా వుండేటందుకు నాలుకతో తుడుచుకుంటున్నాను...నా తెలివితక్కువ కాకపోతే, నా ముఖంలో ప్రతి అంగుళంలోనుంచీ, ప్రతి వేలిచిగురు లోనుంచీ రక్తం కారుతుంటె చూడకుండా ఎలా దాచడం?

"అతన్నెరుగుదువా?"

"ఊహు! ఎరగను."

ఆమె మనస్సులో సంక్షోభాన్ని ఆఖరుకు చూపుల్లోగూడా వ్యక్తంచెయ్యకుండా జవాబుచెప్పింది. ఎంత ఔన్నత్యం! నన్నెప్పుడూ గుర్తుపట్టనంటూ ఆమె యిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టింది. ఇంతకూ నాపేరు బైటపెట్టినవాళ్ళెవరు?

ఆమెను తీసుకుపోయారు. సంతోషం వెలిబుచ్చే చూపులతో

నేను వీడ్కోలిచ్చాను. బహుశా ఆ చూపుల్లో సంతోషం లేదేమో, నా కెలా తెలుస్తుంది?

నాలుగుగంటలు. తెల్లవారుతుందా, లేదా? చీకటి పులుముకున్న కిటికీలు నాసందేహం తీర్చలేవు. మృత్యువెంత నెమ్మదిగా సమీపిస్తుందో, నేను దాని కెదురువెళ్ళనా? ఎలాగ?

ఎవరినో బలంగా దెబ్బకొట్టాను, ఆవూపుతో నేలమీద పడిపోయాను. తంతున్నారు. అబ్బ! బూట్లతో తొక్కుతున్నారు. అంతే, ఇక మృత్యువు త్వరగావస్తుంది. ఒక నల్లటి ఆఫీసరు బాగా గుబురుగా పెరిగిన నాగడ్డం పట్టుకుని, బలవంతంగా పైకెత్తి, తనచేతిలోకి వూడి వచ్చిన వెంట్రుకలుచూపుతూ భయంకరంగా నవ్వుతున్నాడు. ఇదంతా చిత్రంగావుంది, నా దేహం బాధపడేదశకూడా దాటిపోయింది.

ఐదు గంటలు, ఆరు, ఏడు – పది, ఇక ఇప్పుడు మధ్యాహ్నం. కార్మికులు కర్మాగారాల్లో వుంటారు. పిల్లలు స్కూళ్ళలో చదువుతుంటారు. షాపుల్లో ప్రజలు కొంటూ, అమ్ముతూవుంటారు. గృహస్థులు భోజనాల మీదుంటారు. బహుశా ఈ నిమిషంలో మా అమ్మ నన్నుగురించే తలపోస్తూవుంటుందేమో; బహుశా మా కామ్రేడ్స్ నే నరెస్టయినట్టు తెలుసుకుని, జాగ్రతపడుతున్నారేమో ... నేను చెప్పేస్తే ఏం...ఊహు, ఎన్నటికీ...నన్ను నమ్మండి...నిజంగా...ఎన్నటికీ చెప్పను. ఎలాగైనా, మరణం మరికొన్ని క్షణాల్లోనేవుంది. అంతా ఒక దుస్వప్నం! జ్వరంలో వచ్చే భయంకరమైన దుస్వప్నం. వొళ్ళంతా దెబ్బలతో నలిగిపోయింది, మళ్ళీ నామీద చన్నీళ్ళుపోసి స్పృహ తెప్పించారు. మళ్ళీ చిత్రహింస; కేకలు.

"చెప్పు చెప్పు చెప్పు"

కాని, మృత్యువురాదు.

అమ్మా! నాన్న! ఈదెబ్బలన్నిటికీ తట్టుకునే బలం నాకెందుకిచ్చారు?

సాయంత్రం, ఐదుగంటలు. ఈపాటికి వాళ్ళంతా దెబ్బలు కొట్టి కొట్టి పూర్తిగా అలిసిపోయారు. మెల్లగా, అప్పుడప్పుడూ అలవాటు

చొప్పున కొడుతున్నట్టుంది. హఠాత్తుగా దూరంనుంచి, అనంతమైన దూరంనుంచి ఒక కంఠం నెమ్మదిగా విన్పించింది; వీపున చరిచినట్లుంది.

"ఇక చాల్లే"

తర్వాత కొంతసేపటికి ఒక బల్లదగ్గర కూచున్నాను. తెలివి తప్పిన నాకళ్ళకు ఆబల్ల, కిందికి వాలిపోతున్నట్టూ మళ్ళీ పైకిలేచి వస్తున్నట్టూ కన్పిస్తోంది. ఎవరో లోపలికివచ్చి మంచినీళ్ళిచ్చారు. ఎవరోగాని సిగరెట్ ఒకటిచ్చారు! దాన్ని నావేళ్ళు పైకెత్తలేకపోయాయి! నాకాళ్ళకు బూట్లుతగిలించాలని ప్రయత్నిస్తున్నారు. అసాధ్యమంటున్నారు. తర్వాత పోలీసులువచ్చి సగందూరం ఈడ్చుతూ, సగం పైకెత్తుతూ కిందికితీసుకుపోయి కారులోతోశారు. వెళ్ళిపోతున్నప్పుడు, ఎవరో పిస్టల్ తీసి నాకేసి గురిపెట్టివుంచారు! ఈస్థితిలో! నాకు నవ్వొచ్చింది. వీధిలో తెల్లటిగుడ్డతో, వివిధ వర్ణాలపూలగుత్తులతో, అలంకరించిన కారును దాటవేశాము. పెండ్లికోసం ఏర్పాటుచేసిన కారేమో లేక అదంతా వొట్టి కలయేనేమో! స్వప్నమో, జ్వరమో, లేక నేను చనిపోతున్నానో – అదే మృత్యువేమో! కాని చనిపోవడం కష్టం, ఇది సులభం – బహుశా ఇది సులభం. ఏదీ కష్టంకాదేమో. ఏముంది. సులభమే! ఒక నిశ్వాసంతో ఇదంతా ఊడ్చుకుపోతుంది!

అంతా వెళిపోయారా? ఊహు, ఇంకా లేదు. మళ్ళీ లేచి నిలబడుతున్నాను. నాకే ఆశ్చర్యంగావుంది. ఎవరూ పట్టుకోకుండానే నిలబడగలిగాను. నా ముఖం ముందే మకిలపట్టి పచ్చగావున్న గోడ, దానిమీద చిందింది...ఏమిటి? రక్తం. ఎవరిది...ఆ...అలాగేవుంది... వేలెత్తి గోడమీద గీరుతున్నాను...అవును ఇంకా చెమ్మగానేవుంది... ఇది నా రక్తం!

ఎవరో గభాలున నా తలమీద గట్టిగా కొట్టారు. చేతులు పైకెత్తి, గుంజీలు తియ్యమంటున్నారు. కిందకి – పైకి – కిందికి – మూడో సారికి కిందపడిపోయాను.

ఒక పొడుగాటి యస్. యస్. సైనికుడు నా పక్కనే నిలబడి లేవమని తంతున్నాడు. తంతేమాత్రం ఏం ప్రయోజనం. మరెవరో వచ్చి నా మొహం కడిగారు. బల్లదగ్గర కూచోపెట్టారు. ఒక స్త్రీ

నా కేదో మందిచ్చి, ఎక్కడ గాయా లెక్కువగా తగిలాయో అడుగు తున్నది. బాధ అంతా హృదయంలోనేవున్నదని సమాధానం చెపు తున్నాను.

"నీకు హృదయంలేదు" అన్నాడు ఆపొడుగుపాటి నాజీ హంతకుడు.

"అలాగేం? నాకు హృదయంవుంది!" అన్నాను. నాలో గర్వం పొంగివచ్చింది, నా ఆత్మగౌరవాన్ని రక్షించుకోగలిగానుగదా అని.

మళ్లీ' అంతా కళ్ళముందే అదృశ్యమైపోయింది - ఆ రక్తం చిందిన గోడ, మందిచ్చిన స్త్రీ, పొడుగాటి నాజీ.

స్పృహ వచ్చేటప్పటికే, నేనున్న ఖైదుగదీ, గదితలుపూ కన్పిం చాయి. లావుగావున్న ఒక యస్. యస్. సైనికుడు నన్ను గదిలోపలికి లాక్కుపోయి దెబ్బలతో చిరిగిన చొక్కా లాగి పారేసి, చిరిచాప మీద పడుకోబెట్టాడు. వొంటినిండా వున్న వాపుల్ని వొత్తిచూచి, కాపుకాయమని పరిచారకుల్ని ఆజ్ఞాపించాడు.

"అసలుచూడు ! " అని సంతృప్తిగా నాగాయాలన్నీ పక్క వాడికి చూపిస్తూ "కొడితే ఇట్లా కొట్టాలి...చూశావా !" అన్నాడు.

మళ్లీ ఎక్కడో దూరంనుంచి, అనంతమైన దూరంనుంచి, వీపు చరిచినట్టు నెమ్మదిగా ఒక కంఠం విన్పిస్తోంది.

"తెల్లవారేదాకా బ్రతకడు."

ఇంకా ఐదునిమిషాల్లో గడియారం పదిగంటలు మోగుతుంది. ఈ వసంతసాయంత్రం ఎంత వెచ్చగా, శోభామయంగా వుంది!

# II

## మృత్యువు

సూర్యుని వెచ్చని కాంతులు, చుక్కల వెలుగుల దారులు
మనకు మారమాతాయేంటే, మన కదృశ్యమాతాయేంటే...

ఇద్దరు మనుష్యులు, చేతులు వెనక్కు కట్టుకొని, భక్తిపూర్వకంగా వినమ్రులై తెల్లటి గోడలతో సమాధిలాగ భయంకరంగా వున్న ఈగదిలో చుట్టూపచార్లు చేస్తున్నారు. ఎన్నడూ పాడిఎరగని ఆకంఠాల్లోనుంచి ఇప్పుడు మరణసంగీతం మూల్గులాగ పైకుబుకుతోంది.

అలజడిపడు అంతరాత్మ
ఆనందంతో స్వర్గం, ఆరోహించేవేళను...

ఎవరో చనిపోయారు. ఎవరో? ఆశవాన్ని శవపేటికనూ, శిరస్సుపక్క అటూ ఇటూ వెలిగించే కొవ్వొత్తుల్నీ చూద్దామని మెల్లగా నా తలపక్కకు తిప్పటానికి ప్రయత్నిస్తున్నాను.

రాత్రెన్నడు రానిచోట
పగటి కాంతి నిరంతరం ప్రసరించే పుణ్యవాటి...

నెమ్మదిగా అతికష్టంమీాద రెప్పలు పైకెత్తి కళ్లుతిప్పి అటువేపు చూశాను. ఎవరూ లేరు. ఎవ్వరూ కన్పించటంలేదు. వాళ్లిద్దరూ తప్ప—నేను తప్ప. మనిషి చనిపోతే ఆత్మశాంతికోసం పాడుకునే ఈ గీతా లిప్పుడెందుకు పాడుతున్నట్టు?

అనంత దివ్యప్రభలతో
జీసస్ వెలిసినచోటను, జీసస్ వెలుగొందుచోట...

ఇప్పుడు అంత్యక్రియలు జరుగుతున్నట్టుంది. ఔను, అలాగే అనిపిస్తోంది. కాని ఎవరిని పూడ్చిపెడుతున్నట్టు? ఇక్కడెవరున్నారో మళ్లీ ఒకసారి చూడాలి – వాళ్లిద్దరూ, నేనూ. నేను! ఇదినాకా? ఈ

శోక సంగీతం నాకోసమా ? ఏమండోయ్! వినండి, వినండి! ఏదో పొరపాటు జరిగినట్టుంది. నేను చనిపోలేదు. ఇంకా బ్రతికేవున్నాను. మీవంక చూస్తోనే వున్నాను. మీతో మాట్లాడుతోనే వున్నాను. కన్పించటంలేదూ ? ఆగండాగండి. నన్నప్పుడే సమాధిచెయ్యకండి.

ఒక మిత్రుడు, ఆప్తుడు

తుది వీడ్కోలందించిన, అందించిన ఆ క్షణాన...

వాళ్లకు విన్పించదు. చెవుడా ? నేనుబిగ్గరగా మాట్లాడటం లేదూ ? నేను నిజంగానే చనిపోయానేమో, నాఅదృశ్యవాణి వాళ్లకి విన్పించదేమో ? నా ఎట్టెదుట నా అంత్యక్రియలే జరుగుతుంటే, నిస్స హాయంగా బోర్లాపడుకుని చూస్తూవుండవలసినదేనా ? ఎంత దుర్గతి!

భక్తిప్రపూరిత నేత్రాల్

పవిత్ర స్వర్గానికెత్తి ప్రార్థించును...

ఇప్పుడు జ్ఞాపకంవస్తోంది. ఎవరోగాని నన్ను పైకిలేవనెత్తాలని యాతనపడ్డారు. గాయాలు శుభ్రం చెయ్యాలనికూడా ప్రయత్నించారు. ఆ తర్వాత శవాలపై పరిచే నల్లటిగుడ్డవేసి దానిమీద నన్ను పడు కోబెట్టి, వరండాలనిండా బూట్లచప్పుడు చేసుకుంటూ గదిలోకి మోసు కొచ్చారు. అప్పుడు...... అంతే మరింకేమీ జ్ఞాపకంలేదు.

అనంత దివ్యప్రభతో జీసస్ వెలుగొందుచోట...

ఊహూ-ఇందులో అర్థంలేదు, నేనింకా బ్రతికేవున్నాను. ఎక్కడో గాని బాధ, తీరనిదాహం వున్నట్టు, నన్ను వేధిస్తున్నట్టు అనిపిస్తోంది. చనిపోయినవాళ్లకు దాహం వెయ్యదుగద ! నాచెయ్యి కదిలించాలని శక్తినంతా కేంద్రీకరించి ప్రయత్నిస్తున్నాను, ఎక్కడినుంచో చిత్రంగా, అసహజంగా నాకంఠం విన్పిస్తోంది.

"దాహం!"

ఇంతసేపూ నాచుట్టూ గుండ్రంగా తిరుగుతున్న ఇద్దరూ అక స్మాత్తుగా ఆగిపోయారు, నామీదికివంగి చూస్తున్నారు, ఒకడు నీళ్ల ముంత పైకెత్తి పెదవులకందించాడు.

"చూడమ్మా ! ఏదో ఒకటి కొంచెంతినమ్మా ! రెండు రోజుల నుంచీ నీళ్లుతప్ప మరేదీ ముట్టలేదుగద !"

ఏమిటో అంటున్నాడు? అప్పుడే రెండు రోజులైందా? ఏంవారం?

"సోమవారం"

సోమవారం. శుక్రవారంనాడు నన్ను రెస్టుచేశారు, అబ్బ! శిరస్సు ఎంత భారంగావుంది. నీరుఅంత శీతలంగావుందేం? నిద్ర, నిద్రపోదాం. ఒక బొట్టునీరు జారిపడి నిశ్చలకాసారాన్ని విహ్వాలితం చేసింది. ఆ కొండలమధ్య విశాలమైన మైదానంలోవున్న నిశ్చలకాసారం... రోక్లక్ పర్వత ప్రాంతంలోని ఫారెస్టర్ ఇంటిదగ్గర... సన్నగా చెట్ల కొమ్మల్లోనుంచి నిరంతరం కారుతూండే జలధార... నిద్రపోవడం ఎంతహాయిగా వుంటుంది! ...... మళ్లీ మంగళవారం సాయంత్రానికి గాని మెలకువరాలేదు. ఎక్కడిదో ఒక కుక్క పొంచిచూస్తో నామీదికి వంగుతోంది, తోడేలులాంటి కుక్క, చక్కని తెలివైన కళ్లు చూపుతూ ప్రశ్నిస్తోంది:

"ఎక్కడున్నావ్ ఇంతకుముందు?"

ఓహో! కాదు. ఇది కుక్కకాదు. ఈగొంతు మరెవరిదో, ఎవరో నాపక్కనే నిలబడ్డారు. ఎత్తుగా నాజీ సైనికుల బూట్లు కన్పిస్తున్నాయి. పక్కనే మరొక జతబూట్లు. అటు ఇంకొకజత. ఆపైకి చూడలేను. తల ఎత్తడానికి ప్రయత్నిస్తే కళ్లు తిరుగుతున్నాయి. హు! ఎవరైతేనేం నిద్రపోదాం.

బుధవారం.

మొన్నటివరకూ మరణగీతాలు పాడిన నాసహచరులిద్దరూ మూకుళ్లలో తిండి తింటున్నారు. ఇప్పుడు నేనువాళ్లను పోల్చుకోగలను. అందులో ఒకరు రెండోవ్యక్తికంటె చిన్నవాడు. వాళ్ళలో సన్యాసులెవరూలేరు. ఇది చావుబ్రతుకుల విచారణతో గానంచేసే సన్యాసాశ్రమంకాదు. ఖైదు. రెండు కొయ్యముక్కలు పొడుగ్గా నేలమీద అమర్చబడ్డాయి. ఆరెండిటికీ చివర, అమ్మో! తలుపులు!...

తాళంచెవి గర్రున తిరిగి తలుపు తెరుచుకుంటోంది. ఇద్దరూ ఎగిరిపడి ఎటెన్షన్‌లో నిలబడుతున్నారు. నాజీ యూనిఫారంలు వేసుకున్న ఇద్దరు సైనికులు ప్రవేశించి,నాగాయాలకు కట్లుకట్టమని వాళ్ళను

ఆజ్ఞాపిస్తున్నారు. నేనుతొడుక్కున్న దుస్తుల్లో ప్రతికాలర్‌లో, ప్రతి మడతలో ఎంత దుర్భరమైన బాధ ఇమిడివుందో! నన్ను స్ట్రెచరు మీద పడుకోబెట్టి, మెట్లుదించి, వరండానిండా మోతపెడుతూ తీసుకు పోతున్నారు... ఉహూఁ...ఇంతకుముందు నేను స్పృహతప్పి పడి పోతే నన్ను ఈతోవనే మోసుకొచ్చి ఆగదిలో పడేశారన్నమాట. ఇది ఎక్కడికి దారి తీస్తోంది. ఈ మార్గం ఏనరకంలోకి ?

కారునీడలాగ, శత్రువులాగ కన్పించే పోలీస్ ఖైదు – పాంక్రాస్ భవనం, నన్ను నేలమీద పడుకోబెట్టారు. ఒకజర్మన్ ఆఫీసరు ఉగ్రుడై ప్రశ్నలు కురిపిస్తోంటే, ఒక జెక్ వ్యక్తి స్నేహం నటిస్తూ వాటిని అనువదించి చెపుతున్నాడు.

"నీకామె తెలుసా ?"

నాచేతితో నాగడ్డాన్నే ఎత్తుకున్నాను. నాస్ట్రెచర్ కెదురుగా విశాలవదనంతో ఒక అమ్మాయి నిలబడివుంది. ఆమె సగర్వంగా, నిటారుగా (నిర్లక్ష్యంగా కాదు) ఉదాత్తంగా తలపైకెత్తి నిలబడివుంది. ఆమెకండ్లు మాత్రం నావంకచూడటంకోసం, అభివందనా లర్పించడం కోసం కిందికి చూస్తున్నాయి.

"ఆమె ఎవరో నాకు తెలియదు"

ఆమెని ఒకే ఒకసారి పెచెక్‌భవనంలోనే చూసినట్లు జ్ఞాపకం. ఇది రెండవసారి. మళ్లీ మూడోసారి కలుసుకుని ఆమె ఉదాత్తతని అభినందిస్తూ కరస్పర్శ చెయ్యగలిగితే బాగుండును. ఆమె ఆర్నాస్ట్ లొరెంజ్‌భార్య. 1942 లో యుద్ధచట్టం ప్రయోగించిన తొలి రోజుల్లోనే ఆమెని ఉరితీశారు... మళ్లీ మరొకరు.

"ఐతే ఈమెని తప్పకుండా ఎరిగుంటావు."

అనిష్కా ! అరె ! అనిష్కా జిరాస్కోవా ! ఇక్కడికి నువ్వెట్లా వచ్చావ్ ? నేను నీ పేరుచెప్పలేదే, నీకూ నాకూ సంబంధమేలేదే. నువ్వెవరో నాకు తెలియదు. గ్రహించావా ? నీకూ నాకూ సంబంధం లేదు.

"ఆమెఎవరో నేనెరగను."

"మతి దగ్గరుంచుకొని మాట్లాడవోయ్ ?"

"నే నెరగను"

"జూలో! ఇంక ప్రయోజనం లేదు"

అంటోంది అనిష్కా. నా భార్య. ఉద్రేకాన్నాపుకోలేక వేళ్ల మధ్యను చేతిగుడ్డ మెలిపెడుతోంది; ఇక ప్రయోజనం లేదు, వాళ్లు నన్ను గుర్తుపట్టి చెప్పేశారు.

"ఎవరు" అన్నాను.

"నోర్ముయ్!" నామీదికి వంగి, నాదగ్గరికి జాలిగా చెయిచాచిన అనిష్కాని, సమాధానం చెప్పనీయకుండా, మూర్ఖంగా పక్కకు నెట్టేశారు. నా అనిష్కా!

మరి వాళ్ల ప్రశ్నలు నాకు వినబడటంలేదు. ఎక్కడో దూరాన్నుంచి నన్ను నేనే చూసుకుంటున్నట్లూ, ఏవంతైనా బాధలేకుండా, ఇద్దరునాజీలు నన్ను మోసుకుపోతున్నట్లూ అనిపిస్తోంది. స్ట్రెచర్‌ను నిర్లక్ష్యంగా అటూ ఇటూ ఊపుతూ, కోలాహలంగా నవ్వుతూ—ఉరి పోసుకోడం నీకిష్టమేనా—అని నన్ను వెక్కిరిస్తున్నారు.

గురువారం.

మళ్లీ చుట్టుపక్కలవున్న వస్తువులు క్రమక్రమంగా దృష్టిగోచరమౌతున్నాయి: నాగదిలోవున్న యువకుని పేరు కరెక్. రెండవ వ్యక్తిని "అయ్యా" అని పిలుస్తాను. వాళ్లను గురించివేవో నాతో చెప్పుకుంటున్నారు గాని, నాకంతా గందరగోళంగావుంది. వాళ్లగొంతుల్లో బాంబు సద్దోవుండి, ఏసమిమీద దుఃఖంతో బద్దలౌతుందో ననిపిస్తుంది. వాళ్లిద్దరూ పసిపిల్లల్లాగు బెంచిమీద కూర్చున్నారు. ఎక్కడో గణ గణ గణ గంట వినపడుతోంది. ఏమైనా తగిలబడుతున్నాయేమో! ప్రతిరోజూ నన్ను పరీక్షించేందుకు ఒక డాక్టరు, ఒక నాజీ బంట్రోతు వస్తున్నారట. ఏంపరవా లేదు; తప్పకుండా నయమౌతుంది— అని నన్ను నమ్మించజూస్తున్నారు. "తాత" ఎంతో నమ్మకంగా నచ్చజెప్పాలని చూస్తున్నాడు, కరెక్ అతన్ని సమర్థిస్తున్నాడు. ఈ దుర్భర నరక బాధలోవున్న నేను, వాళ్లు అనీ అనకముందే, ఇదిశుద్ధఅబద్ధం అని తేల్చుకుంటున్నాను. పాపం! ఎంతమంచివాళ్లు. వాళ్లమాటలు నమ్మలేనందుకు నాకే విచారంగావుంది.

మధ్యాహ్నం.

తలుపు తెరుచుకుంటోంది. నెమ్మదిగా లోపలికొక కుక్క ప్రవేశిస్తోంది. నా తలవైపు నిలబడి, గావంచ పరీక్షగా చూస్తోంది. మళ్లీ రెండుజతల మిలిటరీబూట్లు కన్పిస్తున్నాయి. ఒకజత ఆ కుక్కవే: పాం క్రాన్ జైలు సూపరింటెండెంటువి; రెండోజత: ఆ నాడునన్ను ప్రశ్న పరంపరలతో వేధించాడే, వాడివి; వాడు నాజీల కమ్యూనిస్టువ్యతిరేక పరిశోధనశాఖకు సర్వాధికారి. కొందరు సివిలియన్ల ప్యాంట్లుగూడ కన్పిస్తున్నాయి. నా చూపులు పైకి పాకుతున్నాయి— ఊఁ, ఆనాడు దాడి చేసిన నాజీదళానికి నాయకత్వం వహించింది వీడే–ఇప్పుడు కుర్చీమీద దర్జాగాకూచుని ప్రశ్నించటం మొదలెట్టాడు.

"ఇక నీఆటలు సాగవు. వాళ్లెవరో, కాపాడుకో, మాట్లాడు!"

ఒక సిగరెట్టివ్వబోతున్నాడు. వొద్దు నాకక్కర్లేదు. నేను సహించలేను

"అయితే బాక్సాస్ కుటుంబంతో ఎంతకాలమున్నావ్?"

బాక్సాస్ కుటుంబంతో! ఇంతకంటె దుర్మార్గంవుందా! వీళ్ళ కెవరు చెప్పారు ?

"ఇప్పుడంతుపట్టింకా, మాకంతా తెలుసు. చెప్పు ! చెప్పు !"

అంతా మీకు తెలిస్తే ఇక నేను చెప్పడమెందుకు ? నా జీవితాన్నింతవరకూ వృథాచెయ్యలేదు. ఇక ఇప్పుడు ఈ తుదిఘడియల్లో నాజీవితశోభను ధ్వంసం చెయ్యదలుచుకోలేదుకూడా.

ఇలాగ విచారణ తతంగం గంటసేపు నడిచింది. ఈసారి అతను కేకలు వెయ్యలేదు. నెమ్మదిగా, ఓపికగా ఒకదాని తర్వాత ఒకటిగా వరుసనే ప్రశ్నలు వేస్తున్నాడు. సమాధానం రాకపోతే, మరో ప్రశ్న, మరొకటి, ఇంకొకటి... అలాగ ! ఇక వాటికి అంతులేదు.

"ఇంకా గ్రహించలా నువ్వు? ఇదే నీకు ఆఖరు, తెలిసిందా? నీసంగతి తేలిపోయింది."

"పోతే నేనేపోతాను–అంతేగదా!"

"కమ్యూనిజం గెలుస్తుందని ఇంకా నీకు నమ్మకమేనా?"

"తప్పకుండా!"

ఇంకానమ్ముతున్నాడా? అని జర్మన్ అధికారి ఆశ్చర్యంగా అడుగుతూంటే, కమిసార్ అనువదించిచెప్పాడు — "రష్యా గెలుస్తుందని ఇంకా అతడినమ్మకం"

"సహజంగానే మరొకవిధంగా జరగడానికి వీల్లేదు"

అబ్బ! అలిసిపోయాను, జవాబులివ్వడంలో మెలకువగా వుండాలని, నా చైతన్యశక్తినంతా కేంద్రీకరించుకుని మాట్లాడాను. ఇప్పుడు క్రమక్రమంగా కొత్త గాయంలోనించి రక్తం ఓడికలుగట్టినట్లు స్పృహ జారిపోతున్నది. వాళ్లు చేతులు చాచారనిపిస్తోంది — నానుదుట వ్రాసివున్న మరణశాసనం చదివారేమో! కొన్ని దేశాల్లో అసలు ఒక వ్యక్తిని హత్యచేసేముందు హంతకుడు ఆవ్యక్తిని ముద్దు పెట్టుకుంటాడట! అలావుంది.

సాయంత్రం

ఇద్దరుమనుష్యులు చేతులుకట్టుకుని నాచుట్టూ తిరుగుతూ పాడుతూ నాఆత్మశాంతికోసం భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు.

> సూర్యుని వెచ్చనికాంతులు, చుక్కల వెలుగులదారులు
> మనకు దూరమౌతోంటే, మన కదృశ్యమౌతోంటే...

అమాయకులారా! ఆపండయ్యా! అది మంచిపాటే. కాని రేపు మే ఒకటి. రేపు మానవులందరికీ అతి శోభావంతమైన ఆనందోత్సవం.

ఇది జ్ఞాపకంవచ్చి నేనుకూడా పాడాలని, సంతోషంతో గానంచెయ్యాలని ప్రయత్నిస్తున్నాను. కాని, నాదుస్థితి చూడలేక కరెక్ తలతిప్పేసుకుంటున్నాడు. "తాత" కళ్లుతుడుచుకుంటున్నాడు. ఐతే నాకేంలెక్క! నేను గానం చేస్తూనేవున్నాను. వాళ్లుకూడా శ్రుతి కలిపారు. సుఖంగా నిద్రపట్టింది.

మే ఒకటి, వుదయం.

జైలు మొదట్లోవున్న టవర్‌లో గడియారం మూడు కొడుతున్నది. నాకు మొట్టమొదటిసారిగా స్పష్టంగా వినపడుతోంది. పూర్తిగా స్పృహవచ్చింది. తెరిచివున్న కిటికీలోనుంచి చల్లనిగాలి

లోపలికి ప్రవహిస్తో, నేలమీద నేను పడుకునివున్న చాపచుట్టూ తిరుగుతో, గిలిగింతలు పెడుతోంది. ప్రత్యణువూ బాధతో మండు తున్నది. ఊపిరిపీల్చటమే కష్టంగావుంది. కిటికీ తెరిచి బైటికిచూస్తే స్పష్టంగా కన్పించినట్టు, మృత్యు వాసన్న మాతోందని తెలుస్తోంది. నేను మరణిస్తున్నాను.

ఒహో మత్యువా! నీవురావడానికి చాలాకాలం పట్టింది. ఒక ప్పుడు నే నాశించానుగదా: నీ సాన్నిధ్యం నాకెన్నోఏండ్లకుగాని కలగ దని; నేను స్వతంత్రుణ్ణిగా జీవిస్తానని; ఎంతోకృషి చేస్తానని; ఎంతో ప్రేమిస్తానని; ఆనందంతో గానంచేస్తూ లోకమంతా తిరుగుతానని. నాకిప్పుడిప్పుడే వయస్సు, మనస్సు పరిపక్వమాతున్నాయి. నాలో అపారమైన శక్తి సంపద లున్నాయి. కాని, ఇప్పుడవన్నీ మటుమాయ మాతున్నాయి.

జీవితాన్ని ప్రేమించినవాణ్ణి, దాని సౌందర్యాన్ని సుస్థిరం చెయ్యడంకోసం ఎంత మహత్తర పోరాటానికైనా సిద్ధపడినవాణ్ణి. మానవులారా !మిమ్మల్ని ప్రేమించాను. మీరు నాపై ప్రేమాదరాలు ప్రదర్శించి నప్పుడు సంతోషంతో ఉప్పొంగిపోయాను. మీరు నన్ను అపార్థంచేసుకుంటే బాధపడ్డాను. మీరే! మీలో ఎవరికైనా నేను అపచారం చేసివుంటే, క్షమించండి! నేనెవరికైనా మేలు చెయ్యగలి గితే, మరిచిపోండి! ఎవరైనా నాపేరు స్మరిస్తే శోకంరాకుండా వుండా లని నాప్రార్థన. ఇది మీఅందరికీ నాఅంతిమ వాఙ్మూలం! అమ్మా నాన్నా, అక్కా చెల్లీ అందరికీ; ప్రేయసీ అగస్తినా నీకుగూడా; కామ్రేడ్స్! మీఅందరికీ; మీకన్నీళ్లే శోకపుధూళిని కడిగెయ్య గలవనుకుంటే ఒకక్షణం దుఃఖించండి. కాని, సంతాపంకూడదు. నాజీవితాన్ని ఆనందంకోసం వినియోగించాను. ఆనందంకోసమే మర ణిస్తున్నాను. అటువంటప్పుడు నాసమాధిపై శోకదేవతను ప్రతిష్ఠిస్తే నేను సహించలేను.

మే దినోత్సవం !

మే దినోత్సవంనాడు ఉదయాన్నే లేచివాడవాడలా జెండాలతో సిద్ధపడేవాళ్ళం. ఈసమయంలోనే మాస్కోవీధుల్లో మే దినోత్సవ

ప్రదర్శనకోసం ప్రజలూ, సైనికులూ బారులుతీర్చి నిలబడతారు. మానవ స్వాతంత్ర్యంకోసం ప్రపంచమంతటా ఈ ఘడియల్లోనే కోట్లకొలది ప్రజాసామాన్యం తుదిసమరం సాగిస్తారు. వేలకొలదీ మరణిస్తారు. అందులో నేనొకణ్ణి. ఈ అంతిమసంగ్రామంలో బలియయ్యే మానవుల్లో నేనూ ఒకణ్ణి కావడం అద్భుతమైన విషయం!

కాని చావులో సౌందర్యం లేదు. గొంతు బిగుసుకుపోతున్నది. ఊపిరాడటంలేదు. గొంతులో గుటగుట మని ఏదో మోత. తోటి ఖైదీలకు నిద్రాభంగమౌతుందేమో! బహుశా, కొంచెం నీళ్లు మింగితే......ముంతలో బొట్టుకూడా మిగల్లేదే. అదె, సరిగ్గా, ఆరడుగుల దూరంలో, గదిమూల మొహం కడుక్కునే తొట్టిలో...ఓ, కావలసినన్ని నీళ్ళు! అక్కడికి పాకిపోయే ఓపిక వుందా?

నెమ్మదిగా, మరీమరీ, నెమ్మదిగా; పొట్టమీద పాకుతున్నాను. వాళ్ళకి నిద్రాభంగం కలిగించకపోవడంలోనే నామరణంలోని మహత్వంతా ఇమిడివున్నట్లు...అబ్బ! తొట్టి దగ్గరికి చేరుకున్నాను. ఇదే కడసారి అన్నట్లు కడుపార తాగుతున్నాను.

ఏమో తెలియదు: మళ్ళీ ఎంతసేపు పట్టిందో, ఎంతసేపటికి చాప మీదికి చేరుకోగలిగానో! మళ్ళీ స్పృహ జారిపోతోంది. నాడి ఆడుతున్నదా? అని మణికట్టుని జాగ్రతగా స్పృశిస్తూ వెతుకుతున్నాను. ఎక్కడా చలనంలేదు. నాగుండె లేచి గొంతులో కొట్లాడుతోంది. వెంటనే కిందికి పడిపోతోంది. దానితో పాటు నేనూ పడిపోతున్నాను. ఇంకా ఇంకా. మధ్యలో కరకు కంఠం విన్పిస్తోంది.

"అయ్యా! అయ్యా! వింటున్నావా? మనవాడు చచ్చిపోతున్నాడు పాపం!"

మరునాడు డాక్టరు వచ్చాడు.

కాని అదంతా నాకు చాలా ఆలశ్యంగా తెలిసింది.

వచ్చాడు. పరీక్షచేసి తలపంకించాడు ఆసుపత్రికి వెళ్ళి నేను చచ్చిపోతాననే నమ్మకంతో అంతకుముందు సాయంత్రం వ్రాసిన రిపోర్టు చించేశాడు. మహాగొప్పడాక్టరువలె నటిస్తూ అన్నాడుగదా:

"అతనికేం గుర్రంలా వున్నాడు!"

# III

## మూ౦ గ్గురు ఖైదీలు

తలుపుకూ కిటికీకిమధ్య ఏడడుగులు. మళ్ళీ కిటికీనుంచి తలుపు వరకూ-ఏడడుగులు. ఇది నాకు కంఠోపాఠమైపోయింది.

ఈ పాంక్రాస్ జైలులో, ఈ గదిలో, పైన్ చెక్కలతో అమర్చిన ఈనేలమీదనే అటూ ఇటూ ఎన్నిసార్లు పచారుచేశానో! మన జాతి భవిష్యత్తును గుప్పిట పెట్టుకున్న నగరవాసుల విధ్వంసకపంథాను స్పష్టంగా గ్రహించకపోవడంవల్లనే - ఇవాళీఖైదులో చిక్కాను. ఇప్పుడు నాజాతిని బలికి సిద్ధంగా శిలువమీద నాటారు; నాగదిముందు ఒక నాజీ పహరా ఇస్తున్నాడు; ఎక్కడో దూరంగా కూచుని రాజకీయ దుష్టబుద్ధులు దేశద్రోహానికి కుట్రపన్నుతున్నారు. మానవులు కళ్ళు తెరవటానికి ఎన్ని శతాబ్దాలు పడుతుందో! మానవజాతి ఎన్ని చెర సాలల్ని ఛేదించుకుంటూ ముందడుగు వెయ్యవలసి వచ్చిందో! ఇంకా ఎన్ని దాటాలో! ఓభగవంతుడా! మానవుని విముక్తి మార్గా నికి అవధిఅనేది వుందా? కాని, చిట్టచివరకి మానవుడు మేల్కొ న్నాడు! ఇప్పటికి మేలుకున్నాడు!

ఏడడుగులు ముందుకు, ఏడడుగులు వెనక్కి! ఒక గోడపక్కనే మడత మంచం, మరొకగోడకు చేరువగా అలమరా, ముంతా మొద లైనవి. అవును, అన్నీ అలాగేవుంటాయి. ఖైదులన్నీ యంత్రాలతో అమర్చారిప్పుడు. ఉష్ణ పరిమాణమూ, పాకీదొడ్డి అన్నీ యంత్రాలతోనే - ఖైదీలుగూడా యాంత్రికపరికరాల్లాగా తయారై నారు. ఒకమీట నొక్కితేచాలు; తాళం చెవి తిరిగి, తలుపుతెరు స్తుంది. లేదా గవాక్షం గదిలోకి తెరుచుకుంటుంది. వెంటనే ఖైదీలు ఏంచేస్తున్నాసరే చివాలున లేచి ఒకరివెనుక ఒకరు పంక్తిగా నిలబడ

తారు. తలుపులు తెరుచుకోవడంతోటే గదిలోవున్న వృద్ధఖైదీ ఒక కేక పెడతాడు.

"ఎటెన్షన్ ! సెల్ 267 ! ముగ్గురుఖైదీలు ! అంతా ఆర్డరులోనే వుంది." మాది 267 నం. గది. అయినా ఇవాళ అంతాఆర్డరులోలేదు. ఇద్దరుమాత్రమే లేచి నిలబడ్డారు. కిటికీ దగ్గర చిరిచాపమీద నిశ్చలంగా పడుకున్నాను-ఒకవారం, రెండు వారాలు, ఒక నెల, ఆరు వారాలుగా ఇలాగే బోర్లపడుకున్నాను. ఇప్పుడే మళ్ళీ కొత్త జన్మ యెత్తుతున్నాను. అప్పుడే నేను తల కదిలించగలను, చెయ్యి పైకెత్తగలను; మోచేతిమీద పైకి లేచాను కొద్దిగా; వెనక్కుతిరిగి పడుకోవాలని ప్రయత్నించానుగూడా. కాని, అప్పటికంటె యిప్పుడు కొంచెం త్వరగానే వ్రాయగలను సుమా!

మాగదిలో కొన్ని మార్పులు జరిగాయి. తలుపుమీద ఖైదీల జాబితాలో రెండే పేర్లున్నాయి. అందరికంటె చిన్నవాడు కరెక్ అదృశ్యమైనాడు. అతనూ; ఈవృద్ధుడూ కలిసి నేను చనిపోయాననుకుని మరణగీతా లాలపించారు. అతని జాలిగుండెమీది ప్రేమ తప్ప మాకు మిగిలిందేమీలే దిప్పుడు. నాకు కలవరింతల్లో, కలల్లోతప్ప అతన్నిగురించి స్ఫురణేలేదు – అదీ ఆచివరి రెండురోజుల్లోనే. అతని కేసునుగురించే పదేపదే వివరాలతోసహా చెప్పుకొచ్చేవాడు – ఆచరిత్ర పూర్తికాకముందే నిద్రవచ్చేది.

అతని పేరు కరెక్ మాలెజ్. హులిజ్ ప్రాంతంలో ఇనుప గనిలో 'కేజ్' దగ్గర మెకానికుగా పని చేసేవాడు. అరెస్టయి రెండేళ్ళయింది. బహుశా ఇప్పుడు విచారణకోసం బెర్లిన్ తీసుకుపోతున్నారేమో! అతనితో ఒకగ్రూప్ - మొత్తాన్ని తీసుకుపోతున్నారు. ఏం శిక్ష వేస్తారో! భార్యా, ఇద్దరు పిల్లలూ...వాళ్ళను ఎంత ప్రేమిస్తాడో చెప్పలేను ! ఎంతగాఢమైన ప్రేమ ! !

నా పక్కమీద కూచుని తిండి తినిపించాలని ప్రయత్నించేవాడు. తినలేను. శనివారంనాడు – అప్పుడే ఇక్కడికొచ్చి ఎనిమిది రోజులైందా? – ఒక కొత్తఎత్తువేసి నేనిక్కడున్నన్నాళ్లూ అసలు ఎంగిలైనా పడలేదని జైలుఅధికారికి రిపోర్టు చేశాడు. అతని అనుమతి

లేనిదే జెక్ డాక్టరు రోగులకు ఆస్పిరిన్‌కూడా ఇవ్వలేదు. వెంటనే ఆ అధికారి నాజీయూనిఫామ్ వేసుకొని, చద్దిపులుసు లోటాపట్టుకుని వచ్చి పక్కనే నిలబడి నేను తాగేదాకా వదిలిపెట్టలేదు. బలవంతంచే తయినాసరే తాగించగలిగానుగదా అని కరెక్ తృప్తిపడ్డాడు. ఆదివారం నాడు తనే స్వయంగా పులుసులోటా నానోట్లో కుమ్మరించాడు.

అంతకంటె ఎక్కువ మాత్రం నాకు మింగుడు పడటంలేదు. చిగుళ్ళు బద్దలుగా పగిలి, మెత్తగా వుడికిన బంగాళాదుంపల్ని కూడా నమలనియ్యడంలేదు; గొంతు బాగా వాచిపోయి గోరుముద్దల్ని కూడా మింగుడు పడనియ్యదు.

“చారుగూడా తాగటంలేదు. వట్టిచారుగూడా వద్దంటు న్నాడు” అని కరెక్ ఆందోళనపడుతూ తల తిప్పుతున్నాడు. తర్వాత నాభోజనాన్ని చెరిసగం పంచుకుని “తాత”, తనూ, తినేవారు.

మిత్రమా! నువ్వు 1942లో పాంకాన్స్ జైల్లో లేవుగదూ? ఐతే అక్కడి చారు రుచి ఎలావుంటుందో నీకు తెలియదు! ఊహ్యేన్నడూ గ్రహించ లేవంటే నమ్ము! ఆ దుస్సహమైన పరిస్థితుల్లో — ఆకలితో కడుపులో పేగులు కేకలు పెట్టేవి; వారాని కొకసారి చేసే స్నానానికి వెళ్ళితే చర్మంతో కప్పిన అస్థిపంజరాలని నిల బెట్టినట్టుండేది; నీకు అతిప్రియమైన మిత్రుడు చేతులతో కాకపోతే చూపులతోనైనా నీ భోజనాన్ని దొంగిలించేవాడు. పూర్తిగా ఎండి పోయిన కూరగాయలు, పొట్టి నీళ్లు కలిపిన రామ్ములక్కాయలూ కూర వండితే– ఎంత అసహ్యం!– అదే పరమాన్నంలాగుండేది. దుర్భర మైన ఆ రోజుల్లోనే వారానికి రెండుసార్లు– గురు, ఆదివారాల్లో– మా మూకుళ్ళలో బంగాళాదుంపముక్కలు, దాంట్లో వాసనకోసం వేసి నట్లు ఒక చెంచా మాంసంపులుసు, పంటికిందికి రెండు మాంసం ముక్కలూ వేసేవారు. ఆరుచి అద్భుతంగా తోచేది. రుచికంటెగూడా, మేమొకప్పుడు మానవజీవితం గడపినవాళ్ళమేనని, నాగరికులమేనని, జ్ఞాపకంవచ్చి, ఆ నాజీనరకంలో బైటి మాజీవితాన్ని మళ్ళీ చవిజూచిన ట్లనిపించి పరవశమయ్యేవాళ్ళం. దాన్నిగురించి మాట్లాడితేనే తన్మ యులమయ్యేవాళ్ళం. ఏక్షణంలో చావు మూడుతుందోనని హడిలి

పోతున్న ఖైదీలకు మానవత్వశిఖరాలను సువ్యక్తంచెయ్యడానికీ మాంసంపులుసు ఎలా ఉపయోగపడుతుందో ఎవరు గ్రహించగలరు?

నేను పులుసుగూడా ముట్టకపోతే పాపం! కరెక్ ఎందుకు భయపడేవాడో నాకు రెండు నెలలతర్వాతగాని అంతుపట్టలేదు. నాకు చావు సమీపిస్తున్నదనడానికి, పులుసుకూడా తాగకపోవడంకంటె వేరే ప్రమాణం అక్కరలేకపోయింది.

మరునాటిరాత్రి రెండు గంటలవేళకి వాళ్ళు టకటకవచ్చి కరెక్‌ను నిద్రలేపారు. అతను ఐదు నిమిషాల్లో తయారుకావాలిట. వాళ్ళ ఆర్డర్ చూస్తే ఏదో వెంటనే తిరిగి రావడానికి బైటికి వెడుతున్నట్టుంది. కాని, జీవితాంతానికి ప్రయాణం ప్రారంభిస్తున్నట్టు, మరొక ఖైదుకో, కాన్సెన్ట్రేషన్ క్యాంపుకో, ఉరికంబాలకో- ఎక్కడికో ఎవరికి తెలుస్తుంది! -సిద్ధమై కడసారిగా వెళ్ళిపోతున్నట్టులేదు. ఈలోపలే అతను నాపక్కదగ్గర మోకాళ్ళమీదవంగి, నా శిరస్సును తన రెండుచేతుల్లోనూ నింపుకుని ముద్దుపెట్టుకున్నాడు. అంతలోనే వరండాలో యూనిఫామ్ వేసుకుని తిరిగే గార్డు, పాంక్రాస్ జైల్లో గౌరవప్రేమలకు స్థానం లేదంటూ మొరటుగా చప్పట్లుకొడుతున్నాడు. కరెక్ చరచర బైటికి వెళిపోయాడు. తాళం పడింది.. మళ్ళీ...గదిలో ఇద్దరమే మిగిలాం.

ఏమోయ్! మనం ఎప్పటికైనా కలుసుకుంటామా మళ్ళీ? ఈసారి మాఇద్దరిలో ఎవరు బయలుదేరుతారో? ఎక్కడికో? మాకోసం ఎవరొస్తారో? యస్. యస్. యూనిఫాం వేసుకున్న సైనికుడే వస్తాడో, యూనిఫాం వేసుకోని చావే వస్తుందో!

ఖైదులో మేమిచ్చుకున్న మొట్టమొదటి వీడ్కోలు సమయంలో వచ్చిన ఆలోచనలింకా నా స్మృతిలో వున్నాయి. ఈ పంక్తులిప్పుడు వ్రాస్తూంటే వాటి ప్రతిధ్వనులింకా నాకు విన్పిస్తున్నాయి. అది జరిగి ఇప్పటికి ఒక సంవత్సరం గడిచింది. ఈ ఆలోచనలే అనేకమంది అలా వెళ్ళిపోతున్నప్పుడు పదే పదే ఇంతకంటె తీవ్రంగా నన్ను బాధించాయి. మా గది తలుపుమీదవున్న రెండు పేర్లు- ఖైదీల జాబితా- మూడైనాయి. కరెక్ వెళిపోగానే మళ్ళీ రెండే. తర్వాత మళ్ళీ మూడు, రెండు, మూడు, రెండు; కొత్తవాళ్లు వచ్చి కలిశారు;

వెళిపోయారు; ఆ గదిలో మొదట్నుంచీవున్న మేమిద్దరమే మిగిలాం చివరికి.

"తాత", నేనూ.

"తాత" వయస్సు అరవయ్యేళ్ళు. అరెస్టయిన టీచర్లందరిలోనూ అతను వృద్ధుడు. పేరు జోసెఫ్ పెషెక్. అతన్ని నాకంటె ఎన్నళ్ళైయ్యెదు రోజులముందే "జర్మన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రపన్నాడ"నే నేరం మోపి అరెస్టు చేశారు. జెక్ దేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత విద్యావిధానాన్ని ఎలా బాగుచెయ్యాలి అంటూ ఒకప్లాను వేశాడనేది అతను చేసిన మహాపరాధం.

"తాత" యింకా...

కాని, ఎంతని వ్రాయను? నిండా ఒక సంవత్సరం ఇద్దరమూ కలిసి ఖైదులో గడిపిన తర్వాత ఒకరిని గురించి ఒకరు వ్రాయడం ఎంత అసంభవ మౌతుంది! ఈ లోపల "తాత" పేరుకు అటుయిటూ కొత్త రోజుల్లోపెట్టిన కోలన్ మార్కులు తొలగిపోయాయి. వయస్సులో వున్న తేడాతోపాటు నిజంగా తాతా మనుమళ్ళలాగే ప్రవర్తిస్తున్నాం. ప్రతినిత్యమూ ఇద్దరం ఉపయోగించే ఊతపదాలు, సంజ్ఞలు మొదలైనవన్నీ అలవాటైపోయి అతి సహజంగా కన్పిస్తున్నాయి. ఇప్పుడు గదిలోవున్న వస్తువుల్లో అతని వేవో, నావేవోకూడా భేదం తెలియడం లేదు.

ప్రతిరాత్రీ విసుగూ విరామం లేకుండా నా పక్కదగ్గర కూచుని, రెండు చేతులతోనూ దూది పుచ్చుకుని గాయాలు తుడుస్తూ క్షణ క్షణం సమీపిస్తున్న భయంకర మృత్యువునే పాడలగొట్టేవాడు. గాయాల్లో చీమూ, మైలా ఎంతో ఓపికతో శుభ్రంచేస్తూ, నా పక్క చుట్టూ కమ్ముకున్న అసహ్యమైన దుర్వాసనకు రవంతైనా బాధపడేవాడుకాదు. నా చొక్కాని జాగ్రత్తగా వుతికేవాడు. చినిగితే అతుకులు వేసేవాడు. మరీ నిష్ప్రయోజనమైపోతే తనదే ఒకటి తెచ్చి తొడిగేవాడు. ఒకనాడు ఉదయం తను రోజూ జైలు ఆవరణలో కసరత్తుచేసే వ్యవధిలో నాకోసం– ప్రాణాలకి తెగించి– ఒక చిన్న మల్లెపువ్వూ, కొద్దిగా గడ్డిపరకలూ సంపాదించి తెచ్చాడు. "విచారణ"

నేపంతో నన్ను అధికారులు బైటికి తీసుకొనిపోయినప్పుడల్లా వెడుతు న్నంతదూరం నావంక జాలిగా చూసేవాడు. మళ్లీ తిరిగి రాగానే నేను కొత్తగా తెచ్చుకున్న గాయాలన్నిటినీ అతి సున్నితంగా దూదితో తుడిచేవాడు. రాత్రి వేళ తీసుకుపోతే నేను వచ్చేవరకూ అలాగే రెప్ప వాల్చకుండా కనిపెట్టుకొని వుండి, నేను వచ్చినతర్వాత పక్కమీద పడుకోబెట్టి దుప్పటి కప్పి అప్పుడు తను నిద్రపోయేవాడు.

మొదటిరోజున ఇద్దరమూ అనుభవించిన యమయాతనలతో ప్రారంభమైన ఈ మైత్రి చివరివరకూ నిరాటంకంగా కొనసాగింది. ఆ తర్వాత క్రమక్రమంగా అతని సేవకు బదులుతీర్చుకుంటూ వచ్చాను.

ఐతే, ఏమోయ్ ఫ్యూజిక్ ! ఒక్కసారికూచుని ఆ చరిత్రంతా వ్రాయగలవా ? మా గదిలో ఆయేడు అనేక అద్భుతాలు జరిగాయి. తాతగూడా తనకుతోచిన పద్ధతిలో, వాటన్నిటిలోనూ పాల్గొన్నాడు. కాని, ఇంకా కథ సమాప్తం కాలేదు – ఇంకా ఆశ ధ్వనిస్తోనేవుంది.

ఈ గదిలో అనేక అద్భుతాలు జరిగాయి. ఒక్కొకసారి తలుపు తెరచి గంటగంటకూ సోదా చేసేవాళ్ళు. ఇందులోవున్న కమ్యూనిస్టు ముద్దాయిని బహుజాగ్రతగా కాపలాకాయాలని వాళ్లకి ఆర్డరుండడమే గాదు, లోపలేం జరుగుతున్నదో చూడాలనే ఆతురతకూడా కొంత కారణమే. ఎప్పుడూ మేం కలలోగూడా అనుకోని మనుష్యులు హఠా త్తుగా చనిపోయేవారు. కాని, చనిపోతారనుకున్న మనుష్యులు బ్రత కటం మాత్రం ఎప్పుడూలేదు. పక్కపక్కనేవున్న వరండాలోంచి పెద్దగా కేకలువేసుకుంటూ గార్డులు మా గదిలో కొచ్చేవాళ్లు. నిశ్శ బ్దంగా నాదుప్పటి ఎత్తి గాయాలెలావున్నాయో చూసేవారు. వాళ్ల వాళ్ల తత్వాలనుబట్టి వెంటనే వెకిలిగా నవ్వటమో స్నేహపూర్వ కంగా పలకరించడమో చేసేవారు. అందులో మేం 'స్మార్టీ' అని పిలిచే ఒకతను అమాయికంగా నవ్వుకుంటూ వీలైనన్నిసార్లు లోపలికొస్తూ "ఆ 'రెడ్ డెవిల్' కేమైనాకావాలా?" అని అడిగేవాడు. వద్దుబాబూ నీకొక నమస్కారం. వద్దు. కొద్దిరోజులతర్వాత ఈ "రెడ్ డెవిల్" క్షవరం చేయించుకోవాలని తెలుసుకునేవాడు స్మార్టీ. వెంటనే మంగ లిని వెంటబెట్టుకొచ్చేవాడు.

మా గదిలో వాళ్లకు మొట్టమొదటిసారిగా పరిచయమైన బైటి ఖైదీ కామ్రేడ్ బోచెక్. సదుద్దేశంతో చేసినా ఈ స్మార్ట్ సహాయం నన్ను క్రూరంగా బాధిస్తోంది. తాత, నాతల తన చేతుల్లో పట్టుకుంటే, బోచెక్ ఒక మొద్దుకత్తితో గడ్డం చెయ్యటం మొదలెడతాడు. మంగలి, పాపం! అతని వేళ్ళు వొణుకుతున్నాయి. అతని కళ్లనిండా నీళ్ళు కమ్ముతున్నాయి. అతనికి, తాను క్షౌరం చేస్తున్నది శవానికిగాని మనిషికి కాదని గట్టిగా నమ్మకం కుదురుతోంది. ఇంకా బ్రతికేవున్నానని ఏదోలాగ సంజ్ఞ చేస్తాను నేను.

"ధైర్యంగా వుండు, మిత్రమా! పెచెక్ భవనంలో చిత్రహింసని భరించగలిగినవాణ్ణి నీ క్షౌరం బాధని సహించలేనా?" కాని, అతి బలహీనస్థితిలో వున్నాం. అందుచేత ఇద్దరం విశ్రాంతి తీసుకోక తప్పదు. అతనూ, నేనూ. రెండు రోజులుగడిచి, మరి ఇద్దరు ఖైదీలతో నాకు పరిచయం కలిగింది. పెచెక్ భవనంలో విచారణచేసే పోలీసు అధికారులకు ఆతృత హెచ్చింది. వాళ్ళు ఎంతగట్టిగా పట్టుబట్టినా జైలు ఉద్యోగి ఒకచీటీమీద "ప్రయాణం చెయ్యలేడు" అని వ్రాసి పంపేవాడు. అందుచేత ఈమారు ఎలావున్నా సరే పంపవలసిందేనని ఆజ్ఞాపించారు. ఇద్దరు ఖైదీలు నన్ను మోసుకుపోవడానికి సిద్ధంగావచ్చి స్ట్రెచర్‌తో గదిముందు నిలబడ్డారు. నాకు బట్టలు తొడిగించటానికి తాత నానా అవస్థలు పడ్డాడు. నన్ను స్ట్రెచర్‌మీద పడుకోబెట్టి ఇద్దరూ మోస్తున్నారు. మా గదుల వరుసలోవున్న ఖైదీలందరికంటె మెత్తనివాడూ, వృద్ధుడూ కామ్రేడ్ స్కారెపా అందులో ఒకడు. రెండవ ఖైదీ...నేను పక్కకి జారిపోబోతుంటే నా చెవిదగ్గరగా నోరు పెట్టి "పట్టు వదలొద్దు" అంటున్నాడు.

ఇంకా రహస్యంగా "అన్నివిధాలా! పట్టువదలొద్దుసుమా!" అంటున్నాడు.

ఈసారి జైలు మొదటిగదిలోనే ఆగిపోలేదు. మనుష్యులతో నిండివున్న ఒక పొడుగాటి హాలులోంచి తీసుకుపోతున్నారు. అది గురువారం, ఖైదీల బంధువులు ఉతికిన బట్టలుతెచ్చి వాళ్లవాళ్ల కిచ్చుకుని మైలబట్టలు పట్టుకుపోతారు. మేం దీనంగా లోపలికిపోతూంటే

వాళ్లంతా ఒకేచూడటం సానుభూతితో. అది నా కంతగా ఇష్టంలేదు. నా ముంజేతివి తలవరకూ ఎత్తి పిడికిలి బిగించాను. బహుశా శాల్యూట్ అని గ్రహిస్తారు. లేకపోతే ఏదోలే అనుకుంటారు. నాకుమాత్రం అంతకంటె సత్తాలేదు, ఒక్కముక్క చెప్పటానికూడా. జైలు ఆవరణలోనే స్ట్రెచర్‌తోసహా నన్ను పోలీసు లారీలో పడుకోబెట్టారు. ఇద్దరు నాజీ సైనికులు రివాల్వర్లమీద చేతులుపెట్టి నా కిరుపక్కలా నిలబడ్డారు. లారీ వెళుతోంది. రోడ్డు అధ్వాన్నంగా వుంది. గుంటల్లోంచి గోతుల్లోంచి చక్రాలెగిరిపడుతున్నాయి. రెండువందల గజాలైనా వెళ్ళలేదు; నాకు స్పృహతప్పిపోయింది. ప్రేగ్ వీథుల్లో ఇలా తిరగటం బలే తమాషాగా వుంది. ముప్ఫైమంది ఖైదీలుపట్టేలారీ ఒకడికోసం పెట్రోలు తగలేస్తోంది. ఇద్దరు సైనికులు ముందూ, ఇద్దరు వెనకాల నిలబడి ఈ మధ్యలో పడివున్న శవం ఎక్కడ పారిపోతుందోనని హడలెత్తుతూ రివాల్వర్లమీద చేతులూ, నామీద రాబందు చూపులూ నిగిడించారు.

స్పృహతప్పి వుండటంవల్ల నన్ను "విచారించడం" అసంభవమయింది. మళ్ళీ పాంక్రాస్‌కు తిరిగిపోయాం. రెండోరోజుకూడా ఇదే తతంగం. పెచెక్ భవనం చేరేందాకా స్పృహ తప్పలేదు ఈసారి. కాని, విచారణ ఎంతోసేపు జరగలేదు. పోస్ కమిసార్ ఫ్రెడరిక్ "కొంచెం అజాగ్రతగా" నా మీద చెయ్యివేశాడు. దానితో నాకు స్పృహ తప్పిపోయింది.

తర్వాత కొన్నాళ్లవరకూ నేనింకా బ్రతికేవున్నానా లేదా అనే సందేహం మాత్రం రాలేదు. నేను ప్రాణంతో వున్నాననే విషయాన్ని పదేపదే నాకు స్ఫురింపజేసింది ఒకటి - జీవితానికి చెలికత్తె అయిన బాధ. ఏదో పొరపాటున నాలో ఇంకా ప్రాణమున్నదని తెలుసుకున్న ఖైదీలంతా నాకు అభివందనాలు పంపారు. ఎలాగ? ఆ కర్కశమైన జైలుగోడలమీద సిగ్నల్స్‌లాగ పదేపదే కొట్టడం ద్వారా, తిండి తెచ్చిపెట్టేటప్పటి ఖైదీల జాలి చూపులద్వారా.

నా భార్యకు మాత్రం ఈ విషయం మనసే తెలియదు. ఆమె కూడా మా జైలు కిందిఅంతస్తులో దూరంగా ఒకగదిలో మగ్గుతోంది.

కొంతకాలం మాత్రం ఆశతో, ఆదుర్దాతో నన్నుగురించి విచారిస్తూ వుంది. ఆ తర్వాత ఒకనాడు తోటి ఖైదీ ఒకామె వెళ్ళి మొదటిసారి నన్ను విచారణకు తీసుకుపోయి హింసపెట్టినప్పుడే ఆ గాయాలతో చివికిపోయి మరణించానని చెప్పింది. వెంటనే ఆమె మతిభ్రమించి మెలికలు తిరుగుతూ కింద పడబోతే స్త్రీ గార్డు ఆమె ముఖంలో పిడికిలితో పొడిచింది. తాను విధిలేక, ఖైదీల పంక్తిలో వెళ్ళి నిలబడింది. ఈవార్తతో గుండెపగిలి, ఏడ్చే బలంకూడా మిగల్చని దుఃఖంతో. కారుణ్యంతో విప్పారుకున్న విశాలనేత్రాలతో, కఠోరంగా ఎదురు నిలబడ్డ గోడలకేసి చూస్తూంటే...ఏమేమి భీభత్సదృశ్యాలు, భగ్న స్వప్నాలు కన్పించాయోగదా! మరునాడు ఇంకొక పుకారు విన్నది: తొలిరోజు చిత్రహింసనే భరించలేక, నేనే ఖైదులో ఉరిపోసుకున్నానని.

ఇన్ని రోజులూ నేను దుస్సహమైన శారీరకబాధతో, స్మృతుల వేదనతో ప్రక్కమీదనే అటూ ఇటూ పొర్లిగిలుతున్నాను. నా ప్రేయసి 'అగస్టీనా'కు అతిప్రియమైన ఒక గీతాన్ని ఆలపిస్తున్నాను. ఇంత ఆవేదనతో పాడుతున్నా ఆమె వినలేదుగదా!

ఇప్పుడామెకు తెలుసు, ఇప్పుడామెకు నా గానం విన్పిస్తుంది. పూర్వంకంటె దూరంగావున్నా నా గానం ఆమెకు అందితీరుతుంది. నాజీ గార్డులంతా నా గది పాడుతోందని తెలుసుకున్నా, ఆపవయ్యా అని తలుపుమీద దెబ్బకొట్టడంలేదు. ఇప్పుడందరికీ అలవాటే!

నా గది గానంచేస్తోంది. నా జీవితమంతా పాడుతూనే గడిపాను. బ్రతుకునంతా బహుస్వల్పకాలంలోకి కుదించుకుని జీవించే ఈ తుది ఘడియల్లో నా గానాన్ని ఎలా ఆపను! పెపెక్ తాలకుగూడా సంగీతమంటే మహావెఱ్ఱి. అతనికి కంఠమూ లేదు, సంగీతపరిజ్ఞానమూ లేదు. ఒక విచిత్రమైన వ్యక్తి. కాని సంగీతమే అతని ప్రేయసి. ఆమెనే అతను అద్భుతమైన భక్తిశ్రద్ధలతో ప్రేమిస్తాడు.

సూర్యోదయం సుందరంగావున్ననాడు, కోర్కెలతో గుండెలు కంపిస్తున్ననాడు మేం పాడుకుంటూవుంటాం. ఒక కామ్రేడ్ చివరి సారిగా సెలవుతీసుకొని మృత్యుగహ్వరంలోకి వెడుతూంటే దుఃఖోపశమనంకోసం పాడుకుంటాం. తూర్పురంగంలో సోవియట్లు జయిస్తున్నా

యని వార్థవస్తే సంతోషంతో గానమారంభిస్తాం. యుగయుగాలుగా తమ సుఖదుఃఖాలను వెలిబుచ్చటానికి మానవజాతి గానంచేస్తోనే వస్తోంది. మానవులున్నంతకాలం సంగీతం వినిపిస్తూనే వుంటుంద!

సూర్యుడు లేకపోతే జీవితం నిష్ప్రయోజనమైనట్లే, సంగీతం లేని జీవితం వృథా! సూర్యకిరణాలే సోకని మాకు సంగీతం ఎంతైనా కావాలి. సెల్ 267 ఉత్తరముఖంగా వుంది. అందుచేత సూర్యుడైనా వేసవిలో సాయంత్రంవేళమాత్రం కొన్నినిమిషాలు మాకేసి చూస్తాడు. ఆ కొద్దినిమిషాలకోసం కనిపెట్టుకొని నిలబడే తాత, సూర్యకాంతి తగలగానే అప్పుడే పోతుందే అనే విచారంతో బిక్కమొహం పెడతాడు...అంతకంటె విచారంగావుండే క్షణాలు అరుదు.

సూర్యుడు! లోకంపైకి తన కాంతిని ఎంత దాతృత్వంతో ప్రసరింపజేస్తాడో! మానవుల కళ్లముందే తన ప్రాణకాంతితో ఎన్ని అద్భుతాలు సృష్టిస్తాడో! కాని, మానవులకు సూర్యరశ్మికూడా కరువైపోయిందిగదా!

ఒకనాటికి మనందరికోసం సూర్యకాంతి ప్రసరిస్తుంది! అతని వెచ్చని కాంతికౌగిలిలో మనమంతా సుఖంగా ఓలలాడుతాం. ఇది గ్రహిస్తే ఎంతధైర్యం ఉప్పొంగుతుంది! కాని ఒక చిన్న ప్రశ్న వేసుకుంటున్నాను. సూర్యకాంతి ఎప్పటికయినా మామీద ప్రసరిస్తుందా?

మాగది ఉత్తరముఖంగా వుంది. ఎప్పుడో ఒకప్పుడు, అదృష్టం పడితే మాకు సూర్యాస్తమయసౌందర్యం కన్పిస్తుంది. ఒహ్హో! తాతా! మరొకసారి సూర్యోదయాన్ని దర్శించగలిగితేనా?

# IV

# నంబరు 400

పునర్జన్మ అనేది నిజంగా ఒక అద్భుతమైన సంఘటన, దాన్ని వర్ణించలేను. గాఢనిద్రలో మునిగి లేచినవాడికి, ప్రపంచమంతా శోభామయంగా కన్పిస్తుంది. అంతకంటె చిత్రహింసకులోనై అంతిమక్షణాలు రుచిచూసి, మళ్లీ పునర్జన్మపొందిన రోజున, ఎప్పటికంటె సుఖంగా నిద్రనుంచి లేచినట్టు, ప్రపంచమంతా సౌందర్యంతో వెలిగిపోతున్నట్లుంటుంది. ఈ జీవితనాటకరంగం అంతా నాకు తెలిసిందే అనుకున్నావు గదూ! కాని ఈ పునర్జన్మ తన ప్రాణకాంతిని బహుముఖంగా ప్రసరింపజేసి రంగస్థలాన్ని స్పష్టంగా విశదంచేస్తుంది. ఈ జీవితంలో నే నెరగని విశేషం ఏమీ లేదనుకున్నావుగదూ! కాని, ఈ సంఘటన ఒకేసారి నీ కంటిఎదుట ఒక దూరదర్శనీ, ఒక సూక్ష్మదర్శనీ తెరచి జీవితవైవిధ్యాన్ని ప్రదర్శిస్తున్నది. పునర్జన్మ ఎత్తాను. వసంతాగమంతో, జడపదార్థాలన్నీ ఒకానొక అద్భుతమైన ప్రాణోద్వేగంతో వికసించినట్లు: అలావుంది నా పునర్జన్మ.

ఇక్కడకూడ. ఈ ఆనందమంతా ఒకక్షణంకూడ నిలువదని గ్రహించిన తర్వాతకూడ. పాంక్రాస్ జైలు కూపంలో మునిగిపోతూ కూడ.

మళ్లీ ఏదోరోజున నన్ను బాహ్యప్రపంచంలోకి ఈడ్చుకుపోతారు. స్ట్రెచర్ లేకుండానే "విచారణకు" పిలుస్తారు. ఇప్పుడదంతా అసంభవంలాగ కన్పించినా అక్కడికి స్వయంగా నడిచివెళ్లగలగడం సాధ్యమే. వరండాలోనూ, మెట్లప్రక్కనా ఇనప చువ్వలుంటాయి. వాటిని ఊతంగా పట్టుకుంటూ కదలవచ్చు. నడవలేవు, పాకుతావు. తోటి ఖైదీలు చేతులు ఆసరాఇస్తూ కదిలే ఖైదులాగావున్న పోలీసులారీలో ఎక్కిస్తారు. అందులో పది, పన్నెండుమందితో నిశ్చలంగా కూలబడ

తావు. ఏవో కొత్తముఖాలు చిరునవ్వులతో అభివందనాలర్పిస్తాయి. నీవు మళ్లీ నవ్వుతావు. ఎవరో చెవిలో ఏదోరహస్యం ఊదుతారు; ఎవరో నీకు తెలియదు. ఎవరిదో చెయ్యిపట్టుకుని సంజ్ఞాపూర్వకంగా నొక్కుతావు, ఎవరిచెయ్యో నీకేంతెలుసు! వెళ్లి వెళ్లి పోలీస్‌లారీ పెచెక్ భవనంలో ప్రవేశిస్తుంది. తోటికామ్రేడ్స్ కిందికి దించుతారు. మీరంతా విశాలమైన ఒక గదిలోకి వెడతారు. ఐదుపంక్తులుగా అమర్చిన బెంచీలు. నిరలంకారంగావున్న గోడలు. అక్కడ చిత్తరువుల్లాగా ఎటెన్షన్‌లో కూచుంటారు. అరిచేతులు మోకాళ్లకు అతికించి; ఎదుట గోడకేసి నిశ్చలంగా చూస్తారు... అదీ, మిత్రమా, "సినిమా" అనిపిలవబడే నీ కొత్తజీవితంలో ఒకదృశ్యం.

## మే దినోత్సవం

ఇవాళ మే, ఒకటి, 1943. ఈ వ్యవధిలో నాకు రాయడానికి కొంతఅవకాశం చిక్కింది. ఎంతఅదృష్టం! మళ్లీ ఒకక్షణంసేపు కమ్యూనిస్టు సంపాదకుణ్ణయి, నవజగత్తునిర్మించే ఈ మహత్తర పోరాటశక్తిని చిత్రించగలగడం- నిజంగా ఎంత అదృష్టం!

ఉత్సాహంతో ఊగేజండాలు, ఊరేగింపులు- ఇలాంటివేవీ లేవుసుమా! పాఠకులు ఉద్రేకంతో ఆలకించే ప్రదర్శనలు, ఉత్సవాలను గురించి చెప్పలేను! గత సంవత్సరాల్లో ఈనాడు ప్రేగ్ నగరవీధుల్లో వేలాదిప్రజలు జరిపిన ప్రదర్శనలను గురించిరాయను- ఈ పర్వదినం నాడు మాస్కో రెడ్‌స్క్వేర్‌లో మహాజనసముద్రం క్రిక్కిరిసి ప్రవహిస్తుంటే నేను చూసినదృశ్యాలు వర్ణించను. ఇక్కడ వేలు, వందలు కాదుగదా, ఉన్నవారు బహు కొద్దిమంది. అందుకని మేంజరిపే మే దినోత్సవ ప్రాముఖ్యం తగ్గబోదు. ఇది పరీక్షాసమయం. భయంకరమైన బాధాగ్నికి లోనౌతున్న ఈ ప్రాణశక్తి బూడిదగా కాలిపోక, ఉక్కులాగ దృఢపడుతున్న దీ పరీక్షా సమయాన. "బెంచీలు"తవ్వి పోరాటానికి సన్నద్ధమైన తర్వాత జరిగే పరీక్షఇది. పోరాటానికి ఆయుధాలు ధరించిన తర్వాత జరిగేపరీక్ష.

అనేక స్వల్పసంఘటనలద్వారా ఈ పరీక్ష జరుగుతోంది. జీవి

తంలో ఎన్నడూ యుద్ధాగ్నికీలలు తాకని వ్యక్తి ఈ విశేషాలు చదువుతూ దీని ప్రాముఖ్యాన్ని గ్రహించడం కష్టసాధ్యం. నమ్మండి– ఇక్కడ ప్రాణశక్తి ఉద్భవిస్తోంది.

పక్కగదిలోనుంచి సుప్రభాతం తెలియజేస్తూ బిథోవెన్ సంగీతంలోనుంచి రెండుచరణాలు మోగిస్తున్నారు. ఇంతకుముందు కంటె బలంగా ఆనందం వ్యాపించే విధంగాకొడితే, మా మధ్యనిలబడిన గోడ మాకాశబ్దాలన్నిటినీ అందిస్తోంది.

ఉన్న బట్టల్లోనే ఉత్తమమైన వాటిని ధరించాము. అన్ని గదుల్లోనూ అంతే.

ఉదయం భోజనాలవేళ ఎంతో సంతోషంగావుంది. తెరచి వున్న గదుల ముందుగా పరిచారకులు పాలులేనికాఫీ, నీళ్ళు, రొట్టెసప్లై చేస్తూ తిరుగుతున్నారు. క్రామేడు స్కారెఫా రోజూ రెండు రొట్టెలు యిచ్చేవాడు. ఇవాళ మే దినాభివందనాలు తెలియజెయ్యడానికేమో మూడుయిచ్చి వెళ్లాడు. అభిమానంవున్న మనిషి; ఏదో ఒకరూపంగా తన గౌరవప్రేమలను ప్రదర్శించ కుతూహలపడే మనిషి. రొట్టెలు అందుకుంటున్నప్పుడు, వాటికింద మా వేళ్లు కలిశాయి. క్షేమపూర్వకంగా అదుముకున్నాయి. మాట్లాడటానికి వీలులేదు– మా చూపుల్ని సైతం కాపలా కాస్తున్నారు. ఎంత మూగవాళ్లమైనా, వేళ్లతోనే మాట్లాడుకోగలం.

మాగది కిటికీకింద స్త్రీఖైదీలు కసరత్తు చెయ్యడానికి బైటికి వచ్చారు. నేను టేబిల్ మీదఎక్కి ఇనుప కమ్మీల్లోంచి చూస్తున్నాను. బహుశా, నన్నుచూడవచ్చు. చూశారు. పిడికిళ్లుపైకెత్తి అభివందనం చేశారు. మళ్లీ. కిందఆవరణఅంతా ఇవాళ నిజంగా జీవంతో తొణికిసలాడుతోంది– మరెప్పుడూ ఇలాలేదు. కాపాలాకాచే గార్డుచూడడు– బహుశా చూడటం ఇష్టంలేదేమో! అదికూడా మేదినోత్సవ ప్రదర్శనంలో ఒక భాగమే!

తర్వాత మౌనసమయంవచ్చింది. ఇవాళ నేను కసరత్తులు చేయించాలి. ఇవాళ మేదినం, క్రామేడ్స్! ఇవాళే, ఏమైనా కొత్తదొకటె

ప్రారంభిద్దాం– గార్డుచూసినా, చూడకపోయినా, మొదటిది: సమ్మెట నెత్తి కొట్టడం– ఒకటి, రెండు; ఒకటి, రెండు. రెండవది: కొడవలితో కోతలు. సుత్తి, కొడవలి– ఇప్పుడందరూ అర్థంచేసు కుంటున్నారు. ఒక చిరునవ్వు పంక్తి పొడుగునా వ్యాపిస్తోంది ఉత్సాహంతో కసరత్తు చేస్తున్నారు. కామ్రేడ్స్! ఇది మన మేదినోత్సవ ప్రదర్శనం. ఈ నిశ్శబ్దనాట్యం, కృతనిశ్చయులమై నిలబడతామని– చావుకు సిద్ధపడిన వాళ్లం– మనంచేసే ప్రతిజ్ఞ.

తిరిగి గదుల్లోకి, తొమ్మిది గంటలవేళ, ఇప్పుడు క్రెమ్లిన్‌లో క్లాక్‌టవర్ పదిగంటలు మోగుతోవుంటుంది. ఊరేగింపు రెడ్‌స్క్వేర్ లోప్రవేశిస్తోవుంటుంది. రా, తాతా! విన్నావా, అంతర్జాతీయగీతం పాడుతున్నారు. ఆగీతం లోకంనిండా మోగుతోంది. మన గదిలో కూడా ఆగీతం విన్పించనీ! గొంతెత్తి పాడుతున్నాం.ఒకటొకటిగా విప్లవ గీతాలు వరుసనే పాడుతున్నాం. మేం ఒంటరితనంలో మగ్గిపోదలుచుకోలేదు – ఒంటరిగా లేంకూడా. బైట, ధైర్యంతో గొంతెత్తి పాడుతున్న వర్గం మాది. వాళ్లుకూడా బైట పోరాడుతున్నారు. ఇక్కడ మాలాగా ......

> ఖైదుల్లో మగ్గుతున్న కామ్రేడ్స్!
> కంచుగోడ లడ్డుగునపడి కనలుతున్న కామ్రేడ్స్!
> మాతోవున్నారు మీరు, మాతోనే మాతోనే –
> చేయి చేయి కలిపినేడు సైన్యంతో నడువలేరు
> కాని సర్వదా మాతో
> కలిసే వుంటారు మీరు!

ఔను, మీతోనే వున్నాం.

267 నంబరు గదిలో, ఈ మా మే దినోత్సవానికి ఇది చక్కని ముగింపే అనిపించింది. కాని, ఇంకా మే దినోత్సవం ముగియలేదు. స్త్రీ ఖైదీల పరిచారిణి ఒకామె రెడ్ ఆర్మీ మార్చింగ్‌సాంగ్ ఈలగా పాడుతోంది. తర్వాత గెరిల్లా గీతం, మొదలైన సోవియట్ పాటలు పాడుతూ, పురుషుల ధైర్యానికి ఆమె సాహసాన్నిగూడా శృతి కలుపుతోంది. నాచేతికి కాగితమూ, పెన్సిలూ యిచ్చి వ్రాయమని,

ఈ రచన నెవ్వరూ కనిపెట్టకుండా, తాను జెక్ పోలీసు యూనిఫాంలో గదిబైట కాపలాకాచే వ్యక్తి ఇప్పుడక్కడే వున్నాడు. ఈ చీటీ లన్నిటినీ బైటికిచేర్చి, ముద్రించే అవకాశం లభించేవరకూ భద్రంగా దాచివుంచే గార్డుకూడ. ఈ రచనను రక్షించటానికి అతను తన శిరస్సునైనాసరే యిస్తాడు. దాస్యంతో ఖైదులోమగ్గే "నేటి" కీ, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో వెలిగే "రేపటి"కీ మధ్య ఈచీటీలతో వంతెన నిర్మించాలని, అందుకు తన ప్రాణమైనా త్యాగం చెయ్య డానికి సిద్ధంగావున్నాడు. అంతా ఒకే మహాసంగ్రామంలో పాల్గొం టున్న యోధులు. వాళ్లెక్కడున్నా సరే, ఏ ఆయుధాలు చేతికిచిక్కినా సరే, ఇందులో డాంబికం లేదు, ఉద్రేకంలేదు – అంతా సింపిల్‌గా జరిగిపోతోంది. ఈవైఖరి చూస్తే ఇది జీవన్మరణాలతో కూడిన భయంకర సంగ్రామం అనే విషయమే స్ఫురించదు.

మే దినోత్సవనాడు విప్లవసైన్యాలుచేసే గొప్పగొప్పప్రదర్శనా లన్నీ చూశావు. పదిసార్లు, ఇరవైసార్లు, అనేకసార్లు. అద్భుతంగా వున్నాయి. కాని, ఈసైన్యాల ధైర్యస్థైర్యాలు సంగ్రామసమయంలో గాని ఋజువుకావు. 'అవి అజేయమైనవి' అనే సత్యం అప్పుడుకాని వెల్లడికాదు. నీ వనుకున్నదాని కంటె సులభంగా వస్తుంది – మృత్యువు. నీ వనుకున్నట్టు ప్రదర్శనలు, పటాటోపాలు వుండవు – శౌర్యానికి. కాని, ఈసంగ్రామం మహాఘోరమైనది. దీనిలో విజయం సాధించటానికి అనంతమైన శక్తి సామర్థ్యాలుండాలి. ఈ సైన్యాల పురోగమనం గమనిస్తావు. కాని వాటి బలం నీకంత త్వరగా అంతు పట్టదు. అవి శత్రువుపై సింపిల్‌గా క్రమానుసారంగా దెబ్బ తీస్తూ ముందుకు నడుస్తాయి.

ఆసంగతి ఇప్పుడు గ్రహిస్తావు.

1943 లో మే దినోత్సవనాడు.

నేను చెపుతున్నకథకు ఈ మేదినోత్సవం కొంత అంతరాయం కలిగించింది. సహజంగా అంతే. ఏదైనా ఉత్సవం జరుగుతున్నప్పుడు అసలు ఆలోచించే పద్ధతే వేరుగా వుంటుంది. నే నిప్పు డనుభవించే

ఆనందం, నాదైనందిన బాధామయజీవితస్మృతులనే మార్చి వేస్తుందేమో.

ఈ పెచెక్ భవనంలోని "సినిమా" దృశ్యాలు తలుచు కుంటేనే దుర్భరంగా వుంటుంది. లోపలవున్న మారణ హోమంలో ప్రవేశించటానికి ఇదేమార్గం. అందులోనుంచి కేకలు, మూల్గులు విన్పిస్తే, నీకోసం ఎలాంటి చిత్రహింస ఎదురు చూస్తూ న్నారో ఊహించుకుని వొణికిపోతావు. నీ యెదుటే కొందరు పుష్టిగా, ఆరోగ్యంగాఉన్న వ్యక్తులు లోపలికి వెడతారు. రెండు మూడుగంటల తర్వాత, వాళ్ళంతా, బ్రద్దలుగా పగిలిపోయి, వికలాంగులై తిరిగివస్తారు. లోపలికి ప్రవేశిస్తూ, కృతనిశ్చయం తెలిపే కంఠంతో "గుడ్ బై" చెవుతారు. మళ్ళీ తిరిగి వచ్చినప్పుడు, ఆకంఠమే బాధతో భయంతో గాద్గదికంగా మోగుతుంది. ఒక్కొక్కసారి ఇంతకంటె అధ్వాన్నంగా వుంటుంది పరిస్థితి. లోపలికి వెడుతూ మీవంక నిర్మలంగా సూటిగా చూసినవ్యక్తి, బైటికివచ్చి మళ్ళీ కళ్ళెత్తి చూడటానికే జంకుతాడు; అంటే లోపల ఎప్పుడో ఒకప్పుడు చిత్రహింసకు హడలి, ఒకక్షణంసేపు పట్టుసడలిపోయి వొళ్లుకాచుకునే స్వార్థంతో బైటపడ్డాడన్నమాట. అంటే, రేపీ వ్యక్తిమూలంగా మరికొందరు పట్టుబడతా రన్నమాట. తిరిగీ ఆగదిలోనే ప్రవేశించి మారణ హోమంలో దగ్ధమౌతారన్నమాట.

ఒక వికలాంగుని దృశ్యంకంటె,తన అంతరాత్మని స్వాభిమానాన్నీ చంపుకున్న వ్యక్తినిచూడటం దుస్సహంగా వుంటుంది. ఇక్కడ ప్రతి క్షణమూ నీ ఎదుట తిరుగాడుతున్న మృత్యువు; ఆ మృత్యువు నీకండ్లపై చల్లగా వాలితే, నీవు పునర్జన్మ పొందితే; ఎవరు భయంతో వొణికి పోతారో, ఎవ రెవరికి ద్రోహంచేస్తారో, స్వార్థంకోసం అందరి ప్రాణా లకు ప్రమాదం కలిగించే దెలాంటివ్యక్తులో స్పష్టంగా గ్రహించ గలవు. బలహీనుల్ని చూస్తే జాలివేస్తుంది.తమ ప్రాణాలకోసం ఇతరుల ప్రాణాలను బలిగొనేవాడు బ్రతికి ఏంబావుకుంటాడు!

మొట్టమొదట "సినిమా"లో కూచున్నప్పుడు ఇలాంటి భావన నాకు రాలేదు. కాని తర్వాత పదే పదే కలవర పెట్టసాగింది. ఆ

మొదటిరోజున నా పరిసరాలన్నీ నాలో ఇలాంటి ఆలోచనలే రేపాయి. ముఖ్యంగా నాకు అగాధమైన భావనాబలాన్ని ప్రసాదించిన ఆగది; నంబరు 400.

ఆ సినిమాలో గంటో, గంటన్నరో కూచున్నాను. అంతలోనే నా వెనుకనుంచి ఎవరో పేరుపెట్టి పిలిచారు. జెక్ భాష మాట్లాడే ఇద్దరు సివిలియన్లు నన్ను లేవనెత్తి, ఎలివేటర్‌లో ఎక్కించి, నాల్గవ అంతస్తులో బైటికి నడిపించి, 400 నంబరువున్న గదిలో ప్రవేశపెట్టారు. వెనకాల గోడదగ్గరవున్న ఒకే కుర్చీమీద ఒంటరిగాకూచుని, చుట్టూ పరికిస్తూ, ఇలాంటి క్షణాలెప్పుడో ఇక్కడ గడిపినట్లుందే – అనుకుంటు న్నాను. ఎప్పుడైనా ఇక్కడికి కొచ్చానా? ఊహు! ఒట్టిదే. కాని, ఈ గదిఅంతా సుపరిచితమైనదే. దీన్నిగురించి ఎన్నో భయంకర స్వప్నాలు కన్నాను, అసహ్యించుకున్నాను. ఆ గదేనా అని ఇప్పుడు పోల్చుకుంటున్నాను.అయితే ఇప్పుడంతా ఆకర్షవంతంగా,వెచ్చని పగటి కాంతితో, వివిధవర్ణాలతో నిండివుంది. పెద్ద పెద్ద కిటికీల ఇనుప ఊచల లోంచి బైటవున్న టిన్ చర్చి, పచ్చని లెట్నాపార్కూ కన్పిస్తున్నాయి. నాస్వప్నంలో, ఈ గదిఅంతా కిటికీలు లేకుండా చీకటితో నిండివు న్నట్టూ, గోడలన్నీ పచ్చగా మురికిపట్టి దుమ్ముకొట్టుకున్నట్టూ,ఇందులో వ్యక్తులు నీడల్లాగ నిర్జీవంగా వాలిపోతున్నట్టూ అనిపించింది. ఔను, ఇక్కడ మనుష్యులున్నమాట వాస్తవమే ఐనా, ఇప్పుడంతా ఖాళీ గానేవుంది. వరుసనే పేర్చివున్న ఈ ఆరు బెంచీలూ. ఎందుకోగాని, నాకు వివిధవర్ణాల పూలపంక్తులతో నిండివున్న మైదానంలాగ కన్పి స్తోంది. కాని, స్వప్నంలోనో: బెంచీలనిండా క్రిక్కిరిసికూచున్న ఖైదీలు. పాలిపోయి, రక్తంతో తడిసిన వదనాలు. అక్కడే, ఆ వాకిలిదగ్గరే, పనిచేసేసమయంలో ధరించే నీలిఉడుపులతో, బాధతో కాలిపోయే కండ్లతో, తాగుదామని కోర్కెతో, తాగి తెగిన యవనికలాగ కూల బడి పోదామని...

అంతే,అలాగేవుంది. కాని,ఇప్పు డవగతమౌతోంది.అది స్వప్నం కాదు. సంధిలోవచ్చే స్వప్నంలాంటి ఆదుర్భరదృశ్యం నిజంగా జరిగింది.

నేను అరెస్టయిననాటి మొట్టమొదటి రాత్రి. మొదటి విచా

రణ. సరిగ్గా మూడుసార్లు తెచ్చారిక్కడికి. పదిసార్లా? ఏమో, వాళ్ళకు, విశ్రాంతి తీసుకోవాలన్నా, విచారణ చెయ్యాలన్నా అన్నిటికీ నేనే దొరికాను. కాళ్ళకేమీ తొడుక్కోలేదు, దెబ్బలతో వాచి వున్న కాళ్ళకు చల్లని ఇటుకలనేల తగిలి సుఖంగా వుంది.

ఆరోజు గెస్టాపో పోలీసులు జెలినిక్స్ యంత్రాగారంలో పట్టుకున్న కార్మికులతో బెంచీలన్నీ నిండిపోయాయి. వాకిలిదగ్గర నీలి బట్టల్లో నిలబడివున్న వ్యక్తి, నా అరెస్టుకు కారణమైన కామ్రేడ్ బార్టన్.

ఎవరో వొకరి పిరికితనంగాని ద్రోహంగాని నాఅరెస్టుకు కారణంకాదు. అజాగ్రత, దురదృష్టం మాత్రమే ఇందుకు ప్రధాన హేతువులు. కామ్రేడ్ బార్టన్ తనసెల్ తరఫున ప్రతిఘటనోద్యమ నాయకులతో సంబంధం కలిగించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. "కాంటాక్ట్" నా దగ్గరనుంచి కిందికి వెళ్ళవలసింది. కాని కామ్రేడ్ జెలినిక్ 'అండర్‌గ్రౌండ్‌రూల్సు' - పాటించక తను కాంటాక్ట్ ఏర్పరుస్తానని బార్టన్‌కు వాగ్దానంచేశాడు. అది మొదటితప్పు. రెండవది: పార్టీద్రోహి ఒకడు బార్టన్‌నుంచి జెలినిక్‌పేరు తెలుసుకున్నాడు. దానితో జెక్‌కుటుంబం గెస్టాపో బోనులో పడిపోయింది. పాపం! జెలినిక్ దంపతులు రెండేళ్ళనుంచీ తమ ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తిస్తున్నప్పటికీ, ఈ చిన్నపొరపాటుతో అంతా తారుమారై పోయింది. నేను జెలినిక్స్ ఇంటికివెళ్లిన సాయంత్రమే నాజీలుకూడా అక్కడికి రావాలని నిర్ణయించుకున్నారు. అంత బలగంతో వాళ్లు రావడంకూడా అనుకోకుండానే జరిగింది. అసలు జెలినిక్స్‌ను మరుసటి ఉదయం అరెస్టు చెయ్యాలని వాళ్లు తీర్మానించుకున్నారు. కాని, జంకర్స్‌సెల్‌సభ్యుల్ని పూర్తిగా నిర్బంధించగలిగాం గదా అనే ఉత్సాహంతో అప్పుడే జెలినిక్స్‌మీద వచ్చిపడ్డారు. వాళ్ళ రాకను చూసి నేనెంత చకితుణ్ణైనానో అంతకంటె పదిరెట్లు నన్నుచూసి వాళ్ళు ఆశ్చర్యపడ్డారు. అసలు వాళ్లెవర్ని పట్టుకున్నారో వాళ్ళకే తెలియలేదు మొదట్లో. బహుశా ఎన్నటికీ తెలిసేది కాదేమో, అలా జరక్కపోతే......

నంబరు 400 గదిలో మొట్టమొదటిసారి కూచున్నప్పుడు వచ్చిన ఆలోచన లివన్నీ. అప్పటికి నేను ఒంటరిగాలేను, బెంచీలన్నీ నిండిపోయాయి. గోడలచుట్టూ ఒక పంక్తిగా నిలబడ్డారు. గంటల కొద్దీ అక్కడ కూచుంటే వందలకొలది సంఘటనలు మమ్మల్ని చకితుల్ని చేస్తున్నాయి. కొన్ని విశేషాలు నాకు అవగాహన కాలేదు, కొన్ని దుస్సహమైనవి, నాలో నరనరాన్ని పట్టి బాధి స్తున్నాయి.

మొట్టమొదటి విశేషం నాకంత కొత్తగానూలేదు, కలవర పెట్టనూలేదు. బహు స్వల్పమైనదీ, అముఖ్యమైనదిన్నీ: ఐనా నేను మరచిపోలేను. మొదట్లో నా జేబులన్నీ పైకిలాగి సోదాచేసిన గెస్టాపో సైనికుడు, చూస్తూచూస్తూ ఒక సిగరెట్టు కాల్చి నావేపు విసిరేశాడు. ఈ మూడు వారాల్లోనూ ఇది మొదటి సిగరెట్టు. చిత్రహింసలతో ఒకసారి మరణించి మళ్ళీ పునర్జన్మ ఎత్తిన నాకు - ఇది మొదటి సిగరెట్టు! అందుకోనా? లేక ఒక సిగరెట్ ముక్కతో నన్ను కొనే శానని గర్విస్తాడా? లేదు, పాపం! ఆ సిగరెట్ ముక్కవంక అమా యికంగా చూస్తున్నాడు. కాని, చివరివరకూ కాల్చలేకపోయాను. అప్పుడే పుట్టిన పసిపాపలు సిగరెట్లేం కాల్చగలరు!

రెండవ విశేషం- నలుగురు వ్యక్తులు నాజీపద్ధతితో మార్చిచేస్తూ లోపలికివచ్చి, జెక్ భాషలో నమస్కరిస్తున్నారు, నన్నుకూడా. టేబిల్ వెనకాల కూచుని, సిగరెట్లు వెలిగించి, జేబుల్లో కాగితాలుతీసి బల్ల మీద పరచి ఆఫీసర్లలాగ నిశ్చింతగా పరిశీలిస్తున్నారు. అరె! వాళ్లను నే నెరుగుదును- అందులో ముగ్గురైనా కచ్చితంగా నాకు పరిచితులే. వాళ్లిప్పుడు నాజీల్లో కలసిపోలేదు గద? ఏమో! వీళ్లుముగ్గురూ? అతనిపేరు రెనెక్‌గమా! ఒక పిసరు వెర్రివుండేది గాని ఎంతోకాలం పార్టీకి, ట్రేడ్‌యూనియన్‌కు కార్యదర్శిగా వున్నాడు! ఎంతో లాయల్టీ వుండేది! అసంభవం! అదిగో! ఆమె అనార్క వికోవా. జుత్తంతా తెల్లబడిపోయింది. ఎంతటి కష్టాలకైనా ఓర్చి దృఢనిశ్చయంతో పోరాటం సాగించేవ్యక్తి! ఉహూ! ఇది నిజంగా అసంభవం! మరి అతడో! వాపెక్ రబెక్. ఉత్తరంగా బొహీమియన్ గనుల ప్రాంతంలో

తొపీమేస్త్రీ. జిల్లాపార్టీకి కార్యదర్శి! ఆహా! అతనే. నా కెందుకు తెలియదు? నిజంగా అతనే. ఆ ఉత్తరప్రాంతంలో అన్ని మహత్తర పోరాటాల్లో పాల్గొన్న తర్వాతగూడా, అతనికి వెన్నెముక జారిపోవ టానికి కారణం ఏమిటి చెప్మా? అసంభవం, అట్లా జరిగివుండదు. ఐతే, ఇక్కడెందుకున్నట్టు? ఇక్కడేంపనుంది వాళ్లకి?

ఈ "సినిమా"లోకి తర్వాత ఎవరెవరు ప్రవేశించారో తెలుసుకున్నప్పటికీ, నన్ను వేధించే ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకలేదు. మిరెక్, జెలినిక్స్ దంపతులూ, ఫ్రీడ్ దంపతులూ వచ్చారు. నాకు తెలుసు - వాళ్లు నాతోనే అరెస్టయినారు. కాని, మిరెక్ మేధావుల రంగంలో పనిచేస్తోంటే అతనికి తోడ్పడే వాడే: అతను, పావెల్ క్రొపాచెక్ ఎలా వచ్చాడు? నాకూ, మిరెక్ కూతప్ప అతని సంగతి ఎవరికి తెలుసు? అతడో? ఆనేవళంగా వున్న యువకుడెవరో? నన్నెరగనట్టు నటిస్తున్నాడు. ఓహో! అతను షిటిచ్. షిటిచ్? డాక్టర్ జెడెనెక్ షిటిచ్? అబ్బబ్బా! ఐతే, వాళ్లు డాక్టర రంగాన్నిగూడ ఛేదిస్తున్నారన్నమాట. అతన్నికూడా నేను, మిరెక్ తప్ప ఎవరూ ఎరగరే! ఖైదుగదిలో హింసిస్తూ, మేధావుల్ని గురించి ఎందుకు వేధించారు? నాకూ మేధావిరంగానికీ సంబంధం ఎలా పసిబట్టారు? మా ఇద్దరికేగదా తెలిసింది; నేనూ మిరెక్!

ఐతే గ్రహించడం కష్టంకాదు, కాని ఆ ఆలోచనే బాధా కరంగావుంది! మిరెక్ బయటపెట్టివుండాలి. మమ్మల్నందర్నీ ఒప్ప జెప్పింది ఈ మిరెక్! మళ్ళీ ఒక క్షణంసేపు అతను కాదేమోనని సందే హించి సంతోషించాను, కాని, మళ్ళీ ఒక గ్రూపు ఖైదీలు ప్రవే శించారు. అప్పుడు తెలిసివచ్చింది.

జెక్ దేశపు మేధావులచే నిర్మించబడిన జాతీయ విప్లవ కమిటీ సభ్యులంతా ఇక్కడ హాజరు! వ్లాడిమిర్ వాంచూరా. అతను గ్రంథ కర్త; ప్రొఫెసర్ ఫెల్బర్, అతని కుమారునితోసహా; బెడ్రిక్ వాక్లా వెక్, అసలు రూపే మారిపోయాడు; బొజీనా పుల్పనోవా; జిండ్రి ఇల్బా; ఆఖరికి డ్రొరాక్ కూడా, అతను శిల్పి, మేధావివర్గాన్ని గురించి, మిరెక్ పూసగుచ్చినట్టు చెప్పేశాడు.

పెచెక్ భవనంలో నా మొదటి అనుభవం దుస్సహంగావుంది, కాని, ఈ సంఘటన నన్ను క్రూరంగా దెబ్బకొట్టింది. – కాకపోతే, మృత్యువుకోసం ఎదురుచూశాను గాని ద్రోహం జరుగుతుందని కలలోగూడ అనుకోలేదు. అతన్నిగురించి ఎంత ఉదారంగా ఆలోచించినా, ఎలాంటి క్లిష్టపరిస్థితుల్లో అతనీ నైచ్యానికి పాల్పడ్డాడోనని ఊహించినా, అతను చేసింది ద్రోహమనక తప్పదు. ఇది ధైర్యం సడలిపోవడంవల్ల కాదు, బలహీనతవల్లకాదు. దారుణ చిత్రహింసకు లోనై లొంగిపోవడంకాదు. ఈ ద్రోహాన్ని క్షమించడానికే వీలు లేదు. ఇప్పుడు తెలుస్తోంది; ఆ మొదటిరాత్రి నాజీలు నా పేరెలా తెలుసుకోగలిగారో, ఆన్నీ జిరాస్కోవాగూడా పట్టుబడిపోవడానికి కారణం తెలుస్తోంది. వాళ్ల యింటిదగ్గర అతను నన్ను రెండుసార్లు కలుసుకున్నాడు. క్లొపాచెక్, డాక్టర్ పిటిచ్ ఇద్దరూ ఇక్కడి కెలా వచ్చారో స్పష్టంగా తెలిసిపోయింది.

తర్వాత– ప్రతిరోజూ 400 నంబరువున్న గదికి వెళ్లాను. రోజు రోజుకూ కొత్తసంగతులు బైటపడ్డాయి. ఈ సంఘటన విషాదకరంగా వుంది, నాకు భయసంభ్రమాలు కల్గిస్తోంది. ఇడుగో! ఇతనే! ధైర్యానికి మారుపేరుగా చెప్పుకున్నవ్యక్తి. స్పెయిన్ అంతర్యుద్ధంలో పోరాడేటప్పుడు తుపాకిగుండ్లకే జంకలేదు. ఫ్రాన్సులో కాన్సెన్ట్రేషన్ కాంప్‌లో ఎన్నిబాధలకైనా తలవొగ్గలేదు. కాని, ఇప్పుడో: గెస్టాపో చేతిలో స్విచ్ చూచి గజగజలాడి పోయాడు, తనవొళ్లు కాపాడుకోడానికి, సహచరులందర్నీ బలియిచ్చాడు. నాలుగు దెబ్బలకువెరచి హడలిపోయిన మనిషి ఆదర్శం ఎంత పేలవమైనదై వుంటుంది! చుట్టూ నలుగురున్న సమయంలో, ప్రతివదనం ఒకే భావనతో వికసించినప్పుడు అతను దృఢంగానే నిలబడ్డాడు. అప్పుడు వాళ్లనిగురించే యోచిస్తూ, ఆ యోచనలో ధైర్యం పుంజుకున్నాడు. కాని, ఒంటరిగా నిలబెట్టగానే నిస్సారంగా దిగజారిపోయాడు! అప్పుడతన్ని గురించే ఆలోచించుకున్నాడుగామాలు! తనవొళ్లు కాచుకోడానికి ఎప్పుడైతే పూనుకున్నాడో, అప్పుడే పిరికితనం అతనిలో చోటు చేసుకుంది. ఆ పిరికితనంతోనే ద్రోహానికి తలపడ్డాడు.

ఆనాడతని గదిలో దొరికిన రచనలకు అర్థాలు విప్పిచెప్పటం కంటె మరణించడం మేలనే విషయాన్ని విస్మరించాడు. అప్పుడు కోడ్ భాషలు వున్నవాటికి అంతరార్థాలన్నీ వాళ్లకు విడదీసి చెప్పాడు. వాళ్ల పేర్లూ, వాళ్లవాళ్ల చిరునామాలూ రహస్యంగా జాబితా లిచ్చాడు. ఒక గెస్టాపో ఏజంటును వెంటబెట్టుకుని షిటిచ్‌తో మాట్లాడ టానికి వెళ్లాడు! వాక్లావెక్‌ను, క్రొపాచెక్‌నూ కలుసుకోడానికి డొరాక్ యింటికి పోలీసుల్ని పంపాడు! ఆ నాజీరాక్షసులకు ఆనీని వప్పజెప్పాడు. తనను ప్రేమించిన అమ్మాయి లిడాకే ద్రోహం చేశాడు. రెండు దెబ్బలు వెయ్యగానే అతనికి తెలిసిన సంగతుల్లో సగం బైటపెట్టేశాడు. ఇక నేను మరణించివుంటానని, తనింకెవ్వరికీ జవాబుదారీ లేదని అనుకున్న మరుక్షణానే, మిగిలిన విశేషాలన్నీ వెళ్లగక్కాడు.

నిజంగా ఇదేదీ నన్ను గాయపరచలేదు. గెస్టాపో పిడికిట్లో పడి పోయే వుంటిని- అంతకంటె బాధపెట్టే దేముంది? కాని, అతను చెప్పిన సమాధానాలన్నీ, ఒక పెద్ద విచారణతతంగానికి ప్రాతిపదిక ఏర్పరచి, అనేక సాక్ష్యాలూ అవీ తయారై చివరికి నన్నే బంధించి వేశాయి. అతను చెప్పిన విషయాలు విని వాళ్లు పరమానందభరితు లయ్యారు. నేనూ, నాసహచరులం అన్ని యాతనలూ పడుతూ "మార్షల్‌లా"ను గూడా ధిక్కరించి బ్రతికింది ఇందుకేనా? అతనూ, నేనూ పట్టుబడితే మా గ్రూప్ బ్రతకడమే కష్టం. కాని, అతను నోరు మెదపకుండా వుంటే, మా రెండో గ్రూప్ మాత్రం, నేనూ అతనూ చనిపోయినా సరే బాగా పనిచేయగలిగేది.

పిరికివాడు తన ప్రాణమే కాదు; ఇతరుల జీవితాన్ని కూడా బలితీసుకుంటాడు. అతను ఒక అద్భుతశక్తిగా పోరాడుతున్న స్వతంత్ర సైన్యానికి ద్రోహంచేసి, నీచాతినీచమైన శత్రువులకు లొంగిపోయాడు. అతనింకా బ్రతికేవున్నా, తన గ్రూప్‌నుండి విడిపోయిన తర్వాత చనిపోయినవాడితోనే సమానం. ఈ ద్రోహాలన్నీ మరుగుపరిచి తన స్థితిని చక్కపెట్టుకోడానికి ప్రయత్నించాడు కాని, అతన్ని మళ్ళీ

మాలో చేర్చుకోలేదు. ఆడుప్త్రిపక్షితత్వం, బైట ఏమోగాని, ఖైదులో భరించడం మాత్రం అసాధ్యం.

కారాగారవాసమూ, ఒంటరితనమూ — ఈ రెండూ ఒకటేనని అనేకమంది భావన. అది పెద్ద పొరపాటు. ఖైదీ అంటూవుంటే అత నెప్పుడూ ఒంటరిగా వుండడు. కారాగారం ఒక పెద్ద సమూహాన్ని కూడగట్టుతుంది. అందులో ప్రతివారినీ ఎంత ఏకాంతనిర్బంధంలో వుంచినా, మిగిలినవాళ్లనుంచి పూర్తిగా వేరుచెయ్యడం అసంభవం. తనకై తాను విడిపోతే తప్ప నిర్బంధం మితిమీరేకొద్దీ, బానిసల మధ్య పెంపొందే సాభ్రాతృత్వం దృఢతరమై, కేంద్రీకృతమై అతి సున్నితమై, ప్రేమాస్పద మౌతుంది. అది కుడ్యాలలోనుంచి ప్రయాణంచేస్తుంది. గోడలుకూడా ప్రాణం పొంది, మాట్లాడి, సంజ్ఞలను వినిపిస్తాయి. ఒకే గార్డులు, ఒకేచోట కలిసి చేసే వ్యాయామాలు, సమిష్టిధర్మాలు, బాధలు — అన్నీ ఒకటే గనుక సాభ్రాతృత్వం అనేది ప్రతి గదికీ, వార్డుకీ వ్యాపించి వుంటుంది. అందుచేత, బైట కలుసుకున్నప్పుడు హఠాత్తుగా ఒక సంజ్ఞచేస్తే చాలు ఎంతటి క్లిష్టమైన విశేషమైనా ఇట్టే అర్థమైపోతుంది. ఒక్కొక్కసారి ఒక సోదరుని ప్రాణాన్నే కాపాడటానికి తోడ్పడుతుంది. గుంపులు గుంపులుగా విచారణకు వెడుతూ, "సినిమా"లో కలిసి బాధ లను భవిస్తూ, తిరిగివచ్చే ఈ జీవితంలో ఖైదీలందరినీ సమిష్టి సాభ్రాతృత్వమే సంఘటితపరుస్తుంది. ఈ జీవితంలో సంభాషణ బహు స్వల్పం, పరస్పర సహకారం అత్యధికం. అలాంటప్పుడు, ప్రేమతో కరస్పర్శ చేసినా, ఆప్యాయంగా ఒక సిగరెట్ బహూకరించినా, ఆ స్వల్పవిశేషమే, నీవు నిత్యమూ నివసించే బందిఖానానే బద్దలుచేసినట్టు, నిరంతరం కుళ్ళిపోయే దుర్భర ఏకాంతవాసాన్నే చీల్చి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రసాదించినట్టూ వుంటుంది. ఈ గదులకు చేతులున్నాయి; చిత్ర హింసతో దేహం ముక్కలుగా విరిగిపోయి తిరిగివస్తే, పడిపోకుండా పైకెత్తి సంరక్షించే సోదరుల చేతులు. నీశత్రువులు ఆకలితో నిన్ను మరణంవేపు తరిమి కొడుతూంటే నీకు ఆహారం యిచ్చే చేతులు. ఈగదులే, నీవుఉరికంబమెక్కబోతున్నా నీకేసి తేరిపారచూస్తుంటాయి:

అప్పుడు నీవు ధైర్యంతో నిబ్బరుగా నశించితీరాలని, లేకపోతే ప్రేమ వీక్షణాలతో నిన్నభిషేకించే ఆ సోదరులు నిస్పృహ చెందుతారని గ్రహిస్తావు. ఈ సౌభ్రాతృత్వం! అనేక గాయాలతో అటమటించి పోతున్నది; కాని అజేయమైనది. దీని బలం లేనిదే, ఈ బాధామయ జీవితంలో పదోవంతుగూడా భరించడం కష్టం. నీవేకాదు, ఎవ రైనా అంతే.

ఈ కథని నేనింకా కొనసాగించ గలిగితే [ఏరోజు, ఏగంటన మృత్యువు కౌగిలిస్తుందో నాకేం తెలుసుమరి] ఈ అధ్యాయానికి ప్రారంభంలోవున్న నంబరు 400 గదిని గురించి తరచు వ్రాస్తాను. మొదట నేను అదొక గదిగదా అనుకున్నాను; దాన్నిగురించి విచారంతో యోచించాను. ఐతే, అది ఇప్పుడు గదికాదు; ఒక సమిష్టిసంఘటన, ఒక ఆదర్శంతో నిరంతరం పోరాడుతున్న ఒక సమిష్టిసంఘటన. ఈ పోరాటంలో మాకు సుఖమేకాని దుఃఖంలేదు.

ఈ "సినిమా" వ్యవహారం అసలు 1940సం.లో, గెస్టాపో కమ్యూనిస్టు వ్యతిరేకశాఖ విస్తరించిన తర్వాత ఏర్పరచబడింది; ఈ దేశపు కమ్యూనిస్టులను, ఈ దేశంలోనే నిర్బంధించే ప్రత్యేకశాఖ కోసం ఈ గదిని ప్రత్యేకించారు. అందులోనూ, ఎవరిని విచారించ దలుచుకున్నా ప్రతిసారీ కిందినుంచి నాలుగో అంతస్తువరకూ శ్రమపడి తీసుకురాకుండా, అందరినీ ఒకేసారి ఈ గదిలో చేర్చి, తర్వాత ఒక్కొక్కరినే ప్రశ్నించవచ్చుగదా అని, దీన్ని వైటింగ్‌రూమ్‌కింద వుపయోగిస్తున్నారు. అలాచేస్తే, పని సులువౌతుందిగదా అని వాళ్ల అభిప్రాయం.

ఇద్దరుఖైదీలను ఒకచోట చేర్చావో, అందులో కమ్యూనిస్టుల్ని, వెంటనే ఒక ఐదునిమిషాల్లో వాళ్లొక ఆర్గనైజేషన్‌గా తయారై కూచుంటారు. ఇక నీప్లానులన్నీ తలకిందులుకాక తప్పదు. 1942లోనే ఈ "సినిమా"కు "కమ్యూనిస్టు సెంట్రల్" అనే పేరువచ్చింది. తర్వాత దీనిలో అనేకమార్పులు వచ్చాయి. వేలమంది కామ్రేడ్స్, స్త్రీలు, పురుషులు ఈబెంచీలమీద కూర్చున్నారు, వెళిపోయారు. కాని, ఒకటి మాత్రం చెక్కుచెదరలేదు. సంగ్రామానికి సంసిద్ధమైన ఈ సమిష్టిఉద్య

మంలో ఉద్భవించిన ఆవేశం; అంతిమ విజయంమీద విశ్వాసం చలిం చని ఆదర్శం!

ఈ యుద్ధరంగంలో మొదటిశ్రేణి కంచీలలో ఒకటి- నంబరు 400 గది. దీన్ని పూర్తిగా శత్రువులు ముట్టడివేశారు. అన్ని దిక్కులనుంచీ అగ్నివర్షం కురిపిస్తున్నారు. కాని, కలలోగూడ అపజయాన్ని ఊహించం. ఇక్కడ ఎర్రజెండా నిర్భయంగా ఎగురుతోంది. స్వేచ్ఛకోసం పోరాడుతున్న జెక్ జాతి సమైక్యత ఈ సమిష్టిఉద్యమంలో రూపెత్తింది.

మేడకింద నాజీ యస్. యస్. సైనికులు ఎత్తయిన బూట్లు వేసుకుని పహరాయిస్తున్నారు. నీవు కళ్లెత్తిచూసినప్పుడల్లా, కోపంతో ఎగిరిపడుతున్నారు. పైన ఈగదిలో, జెక్ ఇన్స్పెక్టర్లు, పోలీసు ఏజంట్లు కాపలా కాస్తున్నారు. ఇందులో కొందరు జెక్ భాష తర్జుమా చెయ్యా డానికి జర్మన్లదగ్గర చేరినవాళ్లు- స్వయంగానూ, పైఅధికారుల ఆజ్ఞల ననుసరించికూడా. వీళ్ళలో కొందరు నాజీలకు సేవచేస్తారు - మరి కొందరు జెక్ దేశానికి. కొందరు అటూ ఇటూ కూడా! ఈగదిలో అరిచేతులు మోకాళ్ళకు బిగించి, చూపులు నిగిడించి భయభక్తులతో కూచోవలసిన అవసరంలేదు. కులాసాగా కూచోవచ్చు, చుట్టూ పరి శీలించవచ్చు, చేతులాడించవచ్చుకూడా. ఆపైచెప్పిన మూడురకాల గార్డుల్లో ఎవరు కాపలాకాస్తున్నారో, దాన్నిబట్టి ఇంకా ఏమైనా చెయ్యడానికి అవకాశం వుంటుంది.

ఈ గదిలో వున్నప్పుడు, ఈనరజంతువు తత్వాన్ని పరిపూర్ణంగా అవగాహన చేసుకోడానికి వీలుంటుంది. ఎట్టఎదుట మృత్యువు భయం కరతాండవం చేస్తున్నప్పుడు, మాస్వభావాలన్నీ అతినగ్నంగా స్పష్టంగా బైట పడుతున్నాయి. ముంజేతికి అరుణకంకణం కట్టుకున్న కమ్యూనిస్టు లైనాసరే, విచారణలో పోలీసులకు తోడ్పడే నాజీ ఏజంట్లయినా సరే- జరిగేది అంతే. ఇక్కడ ఆలోచించేది, నీ మాటలకు ఎంత విలువ వున్నదీ అనికాదు, నీలోవున్న సరుకెంత, నీ తత్వమేమిటీ? అని. ఈపా టికి, నీలోవున్న ఒకే ఒకప్రధానలక్షణం మిగిలి వుంటుంది. ఇంతకు ముందు నీ వ్యక్తిత్వాన్ని నిర్మించిన, బలహీనపరిచిన లేక శోభావంతం చేసిన స్వభావాలన్నీ మృత్యువు నెదుర్కొనేముందు వీచే పెనుతుపాను

లలో తుడిచిపెట్టుకుపోతాయి. ఇకమిగిలేవి; ఒక నామవాచకం, ఒక క్రియ : నిజాయితీపరులు ప్రతిఘటిస్తారు, ద్రోహులు బైటపడతారు; వీరులు పోరాడుతారు, బలహీనులు దిగజారిపోతారు.

మనలో ప్రతి ఒక్కరిలోనూ బార్ధ్యత, అశక్తత, ధైర్యం, భయం, పట్టుదల, చాంచల్యం, నైర్మల్యం, నైచ్యం – ఇవన్నీ గూడు కట్టుకొనివున్నాయి. ఇక్కడమాత్రం; ఏదో ఒకే గుణం నిలబడుతుంది. అవును; కాదు; ఏదో ఒకటి. ఈ రెంటికీ మధ్య నాటకం ఆడాలని ఎవరైనా ప్రయత్నిస్తే, నెమలి ఈకలు కట్టుకున్న కాకిలాగ, శ్మశానంలో పాడిన మంగళగీతంలాగ ఊరికే వెల్లడైపోతుంది.

ఐతే, ఇలాంటి వ్యక్తులు లేకపోలేదు. ఖైదీల్లోనూ వున్నారు. జెక్ ఇన్‌స్పెక్టర్లలోనూ వున్నారు. వాళ్ళు విచారణ సమయంలో తమ దేవుడైన హిట్లర్‌కు హారతిపడతారు; ఈగదిలో బోల్షివిక్ భూతానికి ధూపంవేస్తారు. ఎదుట జర్మన్ కమిసార్ వుంటే, నీకోరియర్ పేరుచెప్పమని పళ్ళూడగొట్టగలరు; ఈగదిలో ఆకలి తీర్చడానికి రొట్టెముక్క దానంచేస్తారు. నీయింటికి సోదాచెయ్యడానికివస్తే విలువైన వస్తువులన్నీ దోచుకుంటారు; ఈ గదిలోకి వచ్చేటప్పటికే, నీమీద ఎక్కడలేని సానుభూతినటిస్తూ సగం సిగరెట్టుముక్క విసిరేస్తారు. మరోరకం వుంది – వాళ్ళకంటె ఒక నూలువాసి తేడా – వాళ్లు స్వయంగా నిన్నుకొట్టడానికి పూనుకోరు; పైగా చచ్చినా సహాయం చెయ్యరు. వాళ్లు దగ్గరుంచుకుని ప్రవర్తించడమే వాళ్ళ పరమాశయం; వాళ్ళ ప్రవర్తనుబట్టి బైట రాజకీయవాతావరణం ఎలావుందో ఇట్టే పసిబట్టవచ్చు. వాళ్లొకవేళ, కరుకుగా అధికారోన్మాదంతో ప్రవర్తిస్తే, స్టాలిన్‌గ్రాడ్ దగ్గర జర్మన్లు పురోగమిస్తున్నారని చెప్పేసుకోవచ్చు, అలాకాక, ఖైదీలతో మెత్తగా సంభాషణల్లోకి దిగితే, స్టాలిన్‌గ్రాడ్‌దగ్గర జర్మన్లు దెబ్బతిన్నారన్నమాటే. ఒక్కొకసారి వాళ్లు తమ జెక్ పూర్వీకుల గొప్పలు ఏకరువుపెట్టారంటే; బలవంతంవల్ల గెస్టాపోలో చేరామని మొత్తుకున్నారంటే; ఓ, ఇంకేం – రెడ్‌ఆర్మీ రోస్టోవ్‌ని పునరాక్రమించుకుంటోందని నిర్ణయించుకోవచ్చు. ఇంకో రకం జాతివుంది : వాళ్ళు

నీవు నట్టేట మునిగిపోతోవుంటే జేబులో చేతులు ముడుచుకుని అలా నిర్వికారంగా చూస్తూవుంటారు. ఐతే, నీవు ఏ ఒడ్డుకో చేరుకున్న తర్వాత, చెయి పూర్తం యిచ్చితీరుతారు.

ఈ గదిలోవున్న ఖైదీల ధైర్య స్థైర్యాలు, ఈ చివరిజాతి పోలీసులకి బాగా అంతుపట్టాయి. అందుకని కొంచెం సన్నిహితంగా రావాలని ప్రయత్నించారుకూడాను. కాని ఎప్పుడూ పూర్తిగా దాని కంటిపెట్టుకోవడంమాత్రం జరగలేదు. ఇంకొక తరగతి వ్యక్తులున్నారు. వాళ్లకు అసలీ ఖైదీల బలాబలాలంటే ఏమిటో తెలియదు. వాళ్లను హంతకులని పిలిస్తే చాలదు — ఐతే వాళ్ళుకూడా మనుషులే! జెక్ భాష మాట్లాడే ఈ జంతువులు, చేతుల్లో కర్రలు ఇనపకడ్డీలు పుచ్చుకుని ఖైదీలను ఘోరహింసలకు గురిచేస్తోంటే జర్మన్ కమీసార్లే ఏవగించుకునేవాళ్ళు! ఇటు దేశభక్తితోగాని, అటు జర్మన్ల శ్రేయస్సు కోరిగాని, తమ రాక్షసత్వాన్ని అదుపులో పెట్టుకోవాలనే జ్ఞానమే లేని హంతకులు! హింసించడం, హత్య చెయ్యడమంటే వాళ్ళకు సరదా! నిర్దాక్షిణ్యంగా ఖైదీలను కొట్టి పళ్ళు విరగగొట్టీ, గూబలు పగలగొట్టీ, కళ్లు పొడిచేసీ, తన్నీ, మెదడు చితకగొట్టీ — ఒకటేమిటి — ఇవన్నీ చేస్తేగాని వాళ్ళ రాక్షసత్వానికి సంతృప్తి లేదు. వాళ్ళను కళ్లారా చూడటానికే అసహ్యంవేసేది. అసలు వాళ్ళు దగ్గరవుంటేనే మరణరోదనలతో రక్తపుమడుగులతో వాతావరణం కలుషితమయ్యేది. ఈ హంతకులు చిట్టచివరి ఖైదీతోసహా పొట్టన పెట్టుకున్నా, ఆఖరికి వీళ్ళకు తగిన శిక్ష పడితీరుతుందనే అచంచల విశ్వాసమే మమ్మల్ని నిస్పృహనుంచి కాపాడింది.

వీళ్ళతోబాటే ఈ బెంచీలమీదే ఇంకొకరకం వ్యక్తులు కూచునేవారు. నిజంగా మానవులు అని స్వర్ణాక్షరాలతో లిఖించదగిన వ్యక్తులు. కారాగార నియమాలను ఖైదీల రక్షణకోసం వినియోగించేవారు. ఈ గదిలో మేము నిర్మించే సమిష్టి సంఘటనకు హృదయపూర్వకంగా, మొక్కవోని ధైర్యంతో తోడ్పడేవారు. ఈ వ్యక్తులెన్నడున్నా కమ్యూనిస్టులుకారని చెపితే అప్పుడు వీళ్ల ఔన్నత్యం యింకా



7

స్ఫుటంగా వ్యక్తమౌతుంది. బహుశా, కమ్యూనిస్టు వ్యతిరేకులుగాను, జెక్ పోలీసులకు ఏజంట్లుగాను పనిచేశారన్నా ఆశ్చర్యంలేదు. కాని, జర్మన్ దురాక్రమణ నెదుర్కొని మేము జరిపే పోరాటాన్ని గమనించి, జెక్ జాతి చరిత్రలో కమ్యూనిస్టుల ప్రాముఖ్యాన్ని గ్రహించారు. ఆ క్షణంనుంచి, మాతో సహకరిస్తూ, ఆఖరికి ఈ బెంచీల మీద కూచునిగూడా నిజాయితీతో లాయల్టీతో మాకు తోడ్పడుతున్నారు.

ఒకసారి గెస్టాపో పిడికిట్లో చిక్కిన తర్వాత, ఎంత దారుణ బాధలకు గురి కావలసివస్తుందో కొంచెమైనా అవగతమైతే, బైట ధైర్యంతో పోరాడే మన "సైనికులు" చలించిపోయి వుండేవారు. కాని, ఈ దేశభక్తులు ఈ ఘోరహింసలన్నిటినీ ప్రత్యక్షంగా ప్రతిరోజూ చూస్తూగూడా, ఏక్షణాన్నైనా ఖైదీలలో తాముగూడా చేరవచ్చుననీ, అంతకంటె దారుణహింసలకు గురిచేస్తారని గ్రహించిగూడా, అచంచలంగా నిలబడ్డారు. వీరే ఇప్పటికి కొన్ని వేలమంది ప్రాణాలను కాపాడారు. కాపాడలేని వారికి, బాధోపశమనం కలిగించారు. వీరులంటే వీరిననాలి, వీరితోడ్పాటు లేకుండా నంబరు 400 గది ఇలావుండేదికాదు: ఎలాగ ? గాఢాంధకారం కమ్మిన భవనంలో వెలిగే జ్యోతిలాగ; శత్రు పంక్తులకు వెనకాల తవ్విన ట్రెంచీలాగ; స్వాతంత్ర్య సమరంకోసం శత్రుస్థావర మధ్యంలోనే ఏర్పరిచిన పోరాట కేంద్రంలాగ—

V

# సహచరులు: శత్రువులు [1]

మానవ చరిత్రలో ఈయుగంలో జీవిస్తున్న మిమ్మందరినీ ఒక్క విషయం అడుగుతున్నాను: ఈమహత్తర సంఘర్షణలో పాల్గొంటున్న వారెవరినీ మరిచిపోవద్దు. ఇందులోని మంచినీ, చెడ్డనీకూడ జ్ఞాపకం పెట్టుకోండి. మీజీవిత సౌభాగ్యంకోసం, తమ ఆత్మగౌరవం కోసం ప్రాణాలు విడిచిన వారందరిని గురించీ సమగ్రంగా విశేషాలు సేకరించండి. ప్రస్తుత జీవితం క్రమంగా గతచరిత్రలో కలుస్తుంది; అసంఖ్యాకమైన అజ్ఞాతవీరుల త్యాగాలతో నిర్మితమైన ఒక మహా యుగంగా దీనిని పేర్కొంటారు. ఈ వ్యక్తులందరికీ పేర్లున్నాయి, ఆకారాలున్నాయి, ఆశలూ ఆశయాలూ వున్నాయి. అందుకనే చరిత్రలో ప్రసిద్ధికెక్కే ఏ ఒకరి త్యాగంకంటె, అనామకంగా నశించిన ఏ ఒక వ్యక్తి స్వల్పమైన బాధకూడా తీసిపోదు. నాకోర్కె ఒక్కటే: మీరు వాళ్లందరినీ సుపరిచితులుగా, ఆప్తులుగా భావించుకోవాలని; మీకు రక్త బంధువులైనట్టు, మీ ఆత్మలోనే అంతర్భాగమైనట్టు చూచుకోవాలని.

అనేకమంది వీరుల కుటుంబాలే నశించాయి. అందులో ఎవరో ఒకరిని ఎన్నుకోండి. మీకొడుకో, కూతురో, అనుకుని ప్రేమించండి. భవిష్యత్తును మహోజ్వలం చెయ్యడానికి ప్రాణత్యాగం చేసిన ఒక మహావీరుడుగా భావించి గర్వపడండి. తమ జీవితాలను భవిష్యత్తులోకి వ్యాపింపజేసి, భవిష్యత్తును సౌందర్యమయం చెయ్యడానికి ప్రాణం త్యజించే వీరుల స్వరూపాలను నిజంగా మహావిగ్రహాలుగా చెక్కి శాశ్వతత్వం కలిగించాలి. కాని, పూర్వచరిత్రలోని ధూళితో విప్లవ ప్రవాహానికి ఆనకట్ట వెయ్యడానికి ప్రయత్నించిన వ్యక్తులు వాళ్ళకు ఎన్ని భుజకీర్తులున్నా సరే, పుచ్చిపోయిన కొయ్య బొమ్మలతో సమానం. ఐతే, వాళ్ళనుగూడా ప్రాణంతోవున్నట్టే

భావించి వాళ్ళనైచ్యాన్నీ, అమానుషత్వాన్నీ, క్రౌర్యాన్నీ గ్రహించాలి. అప్పుడు గాని భవిష్యత్తును పరిపూర్ణంగా ఊహించలేము.

నేనీ క్రింద రచించే కొందరి జీవిత చిత్రాలు కండ్లారా చూచి గ్రహించినవే కాని ఒకే కోణంనుండి, కొంతవరకు అసమగ్రంగా గూడా వుంటాయి. ఆయా వ్యక్తుల జీవితాలలోని ప్రధానాంశాలు మాత్రమే ఇక్కడ పొందుపరిచాను. కాని, వారిలో అత్యున్నతులూ, అతి సాధారణులూ అందరూ వున్నారు.

జెలినిక్స్ దంపతులు :

జోసెఫ్. మేరీ. అతను బస్సు కండక్టరు. ఆమె వంటపనిచేస్తుంది. మీరు చూసితీరవలసిన ఇల్లువాళ్లది. సాధారణంగా, అధునాతనంగా వున్న కుర్చీలు, బల్లలు; పుస్తకాల అలమారా; ఒక చిన్న శిల్పం; గోడలమీద చిత్రాలు — అన్నీ పరిశుభ్రంగా అమర్చివుంటాయి. అదిచూస్తే, మేరీ ఆఇంటోనే వుండి మగ్గిపోతున్నదనీ, బాహ్య ప్రపంచంతో పరిచయమే లేదనీ, అనుకుంటారు మీరు. కాని, ఆమె ఎంతోకాలంనుంచి కమ్యూనిస్టుపార్టీలో పనిచేస్తోంది. తను గ్రహించినవిధంగా సమాజ ధర్మాన్నిగురించి అనేక స్వప్నాలు కన్నది. ఇద్దరూ ఎంతో ఆసక్తితో పనిచేశారు; ఎంతో మౌనంగా జర్మన్ దాడి సమయంలో ఎన్నో త్యాగాలు చేయవలసివచ్చినా వెనుదీయలేదు.

మూడేళ్లు అజ్ఞాతంగావున్న తర్వాత — అప్పుడు జర్మన్లు వాళ్లపై కెగబడ్డారు. ఇద్దరూ ఒకరిపక్క నొకరు నిలబడ్డారు; చేతులెత్తి, ఒకరి చేతులొకరు స్పృశిస్తూ.

మే 19, 1943:

నేటిరాత్రి, నాభార్య అగస్టినాను "కూలిపని" అని పేరుపెట్టి పోలెండ్‌కు ఈడ్చుకుపోతున్నారు: ఉరి కంబాలెక్కించడానికి; టైఫస్ వ్యాధితో హత్యచెయ్యడానికి. ఆమెజీవితం కొద్దివారాలలో అంతమౌతుంది— బహుశా రెండు మూడు నెలల్లో, నాకేసు కోర్టుకెక్కించారు.

ఇంకా ఒక నెలవరకు పాంక్రాస్‌లో విచారణ; మరి రెండు మూడు నెలల్లో- మరణం. ఈ రచన ఇక పూర్తికాదు. ఇంకా కొద్దిరోజుల్లో, అవకాశంలభిస్తే వ్రాయడానికి ప్రయత్నిస్తాను.. కాని, ఇవాళ మాత్రం వ్రాయలేను. నా మనస్సు, హృదయము అగస్తినాతో నిండిపోయింది. సహృదయత, ఔన్నత్యం ఆమెలో మూర్తీభవించాయి. అశాంతితో కూడినదైనా, అగాధమైన మా జీవితంలో ప్రేమగౌరవాలతో తన పాత్రను నిర్వహించింది.

ఆమె మనస్సుకు బాగానచ్చిన ఒక గీతాన్ని ప్రతిసాయంత్రం అదేపనిగా పాడతాను. విశాలమైన రమ్యక మైదానాలలోని పచ్చగడ్డిని గురించి; గాలి విసురుకు ఊగుతూ, గొరిల్లాల వీరగాథలను రహస్యంగా గానంచేసే పచ్చగడ్డిని గురించి, స్వాతంత్ర్యంకోసం తన భర్తకు తోడుగా పోరాడిన కాసక్ అమ్మాయిని గురించి; ఆమె శౌర్యాన్ని గురించి; ఒకానొక భీకరయుద్ధం తర్వాత నేలకొరిగి, తిరిగిలేవని ఆమె త్యాగాన్నిగురించి.

ఓహో ! నా ప్రియమైన అగస్తినా ! అంతచిన్న నీశరీరంలో, అందంగా అమర్చినట్టున్న నీ వదనంలో ఎంతశక్తిప్రజ్వలిస్తోందో ! విశాలంగా, పసిబిడ్డకులాగ సుకుమారంగావున్న నీ కండ్లలో ఎంత ఆర్ద్రతవుంది ! మనం నిరంతరం సాగ్గొనే పోరాటాలవల్ల, తరచుకలిగే వియోగాలవల్ల మనం శాశ్వత ప్రేమికులమై, అనేక వందలసార్లు ప్రథమ సమాగమంనాటి మధురక్షణాల గాఢానుభవాలను ఆస్వాదించాము. ఆనందంతో పరవశమైనప్పుడు, ఆందోళనతో అలజడి పడినప్పుడు, ఉద్రేకంలో దుఃఖంలోగూడా ఇద్దరిహృదయాలూ ఒకటిగా స్పందించాయి. ఇద్దరిప్రాణాలూ ఒకటై ఊపిరిపీల్చాయి.

అనేక సంవత్సరాలనుండి మేమిద్దరం గాఢమైన స్నేహితుల్లాగ ఒకరి కొకరు సహాయం చేసుకున్నాము. కొన్ని సంవత్సరాలనుంచి నారచనలను మొట్టమొదట చదివేది మొట్టమొదట విమర్శించేది ఆమే. ఆమె చూపులు నామీద ప్రసరించకపోతే వ్రాయడమే అసంభవమై పోయేది. నిరంతర సంఘర్షణలతో నిండిన మాజీవితాల్లో ఒకరికొకరం అండగా నిలబడ్డాము. చేయి చేయి కలిపి మా మాతృ

దేశమంతా సంచారం చేశాము. అనేక పరీక్షలలో నెగ్గాము. అనేక ఆనందా లనుభవించాము. ఎలాగ? నిరుపేదలకుండే సౌభాగ్యం మాకూవుంది – అది అంతర్నిహితమైన సౌభాగ్యం.

అగస్తినా? ఈమే! చూడండి! ఈమే అగస్తినా!

ఒక సంవత్సరం క్రితం; జూన్ మధ్యకాలంలో, యుద్ధశాసనం ప్రకటించినప్పుడు: మా అరెస్టు తర్వాత ఆరువారాలకు తిరిగి నన్ను కలుసుకున్నది. అంతవరకు తన ఖైదులో ఒంటరిగావుంటూ, ప్రతి నిత్యమూ నేను మరణించానని చెప్పేవదంతులతో కుంగిపోయింది. జర్మన్లు ఆమెని నాదగ్గరకు తీసుకొచ్చారు. నన్ను లొంగదీయాలని.

"అతనికి నచ్చచెప్పరాదూ!" ఆమెని ముఖాముఖిగా నిలబెట్టి కేకవేశాడు పరిశోధకశాఖ అధికారి, 'న్యాయంగా' వున్నదంతా చెప్పెయ్యమను. తన ప్రాణాన్ని లెక్క-చెయ్యకపోయినా, నీ శ్రేయస్సు కోరైనా బైటపెట్టమను. ఇంకా ఒకగంట వ్యవధి యిస్తున్నాను మీ ఇద్దరికీ. అప్పటికీ మూర్ఖంగావుంటే కాల్చివెయ్యక తప్పదు, ఇద్దరినీ.

ఆమె చూపులతో నా వదనాన్ని నిమురుతూ, ఏమీ ప్రమాదం లేనట్టు, అన్నదిగదా:

"మిస్టర్ కమిసార్, ఇలా నన్ను బెదిరించలేవుసుమా. నిజంగా నాకోర్కె-కూడా అదే. అతన్ని కాల్చేస్తే నన్నుకూడా కాల్చండి."

ఆమె! నా అగస్తినా, అంటే అలావుంటుంది. అపారమైన ప్రేమ, అనంతమైన శక్తి. మన ప్రాణాలు బలితీసుకోవచ్చుకాని, నా అగస్తినా! మన ప్రేమను, ఆత్మాభిమానాన్ని అవమానించ లేరమ్మా!

పాఠక సోదరులారా! ఒక్కసారి ఊహించండి; ఈ నరక యాతనలన్నీ గడిచి గట్టెక్కిన తర్వాత మళ్ళీమనం కలుసుకుంటే ఎలా వుంటుందో! స్వతంత్రులమై, సృజనాశక్తి విజృంభించే, సౌంద ర్యోపేతంగా వెలుగొందే స్వేచ్ఛలో మళ్లీ కలుసుకోగలిగితే ఎంత అద్భుతంగా వుంటుందో! ఒక ఆదర్శంకోసం నిరంతరం కృషిచేసి, ఆచిరకాలవాంఛితాన్ని సాధించిననాడు, అందుకోసం మరణాన్ని

కూండా ఎదుర్కొన్ననాడు ఎలావుంటుంది? ఒకవేళ మేం మీ పోరాటంలో ఆహుతి ఐనా, తర్వాత మీరనుభవించే సుఖసౌభాగ్యాలలో మాకూ భాగంవుంటుంది — మా ప్రాణాలను బలిపెట్టింది అందుకోసమే కనుక, మిమ్మల్ని విడిచిపోవడం ఎంత బాధాకరమైనా, అది తలుచుకున్నప్పుడు మేము సంతోషంతో పరవశుల మాతున్నాము.

చివరకు వీడ్కోలు చెప్పుకోడానికైనా అనుమతించలేదు. కౌగిలించుకోడమూ, కరస్పర్శచేసుకోడమూ,ఎలా సాధ్యం? పాంక్రాస్ జైలుకూ, ఆమెవున్న కార్లోవో స్క్వేర్ ఖైదుకూ మధ్య ఖైదీల సమిష్టితత్వం మాత్రమే లంకెవెయ్యగలిగింది. వారి ద్వారానే మా సాధక బాధకాలను గురించి పరస్పరం వార్తలు అందుకునే వాళ్ళం.

అగస్తినా! ఇప్పటికైనా గ్రహించావుగదూ. మనిద్దరం మళ్ళీ కలుసుకోవడం అసాధ్యం. ఐనా, దూరంగా నీపిలుపు విన్పిస్తోంది! ఇదిగో, నాప్రేయసీ! మళ్ళీ మనం కలుసుకుంటామేమో, గుడ్‌బై !

మళ్లీ కలుసుకునే ఆశతో, గుడ్‌బై !

నా వాఙ్మయం :

నాకు ఒక చిన్న గ్రంథాలయం తప్పితే, లోకంలో మరేమీ లేదు. దాన్ని నాజీలు ధ్వంసంచేశారు.

నేను వైజ్ఞానిక, రాజకీయ సమస్యలనుగురించి అనేక వ్యాసాలు వ్రాశాను. సంస్కృతి, నాటక సాహిత్యాలనుగురించి అనేక విమర్శ వ్యాసాలు, సమీక్షలు రచించాను. జర్నలిష్టు రచనలుగూడా. ఇందులో దైనందిన సమస్యలనుగురించిన రచనలు ఆనాటితోనే తమ ధర్మం నెరవేర్చాయి, అవి సరే. మరికొన్ని శాశ్వతంగా మనవలసినవి. వాటన్నిటినీ తర్వాత అగస్తినా ప్రచురిస్తుందిగదా అనుకున్నాను. కాని, ఇప్పుడా ఆశలేదు. అందుచేత, ఆ రచనల్లో ముఖ్యమైనవాటిని ఎన్నమనీ, వాటిని ఐదు గ్రంథాలుగా ప్రచురించమనీ ఇప్పుడు కామ్రేడ్ లాడ్యాస్లావ్‌ను కోరుతున్నాను.

ఒకటి : రాజకీయవ్యాసాలు, చర్చలు.

రెండు: ఆంతరంగిక సమస్యలనుగురించి కొన్ని ముఖ్య వ్యాసాలు.

మూడు: సోవియట్ యూనియన్ వెళ్లినప్పుడు వ్రాసిన రచనలు.

నాలుగు: } సారస్వతం, నాటకకళలను, గురించిన విమర్శలు,
ఐదు: } వ్యాసాలు.

ఇందులో అధికభాగం 'ట్వోర్బా' [సృజనాసాహిత్యం], 'రూడీప్రవో' [రెడ్ రైట్స్]లోను, మిగిలినవి 'క్రెమెన్', 'ప్రామెన్', 'ప్రోలిట్ కల్ట్', 'డోబా', 'సోషలిస్ట్', 'అవంత్ గార్డ్' మొదలైన సాహిత్య, రాజకీయ పత్రికలలోను దొరుకుతాయి.

నేను జూలియస్ జెయర్‌నుగురించి వ్రాసిన విమర్శగ్రంథం గిర్గాల్ అనే ప్రచురణకర్త దగ్గరవుంది. అతనంటే నాకెంతో అభిమానం. జర్మన్లు ఆక్రమించుకున్న తర్వాతగూడా, ఎంతో సాహసంచేసి 'బోజనా నెంకోవా' అనే నాపుస్తకం వెలువరించాడు. సాబిన్‌ను గురించిన విమర్శలో కొంతభాగం, జాన్ నెరూడాను గురించిన వ్యాఖ్యలు జెలినిక్స్ దంపతులు, విసూషిల్స్, సుచానెక్స్ కుటుంబాలువున్న ఇండ్లల్లో ఏ మూలో దాగి వుంటాయి – వాళ్లలో ఎక్కువమంది అప్పుడే బలియైనారు.

మనతరంలోవున్న ప్రజాజీవితాన్ని చిత్రిస్తూ ఒక నవల ప్రారంభించాను. రెండధ్యాయాలుమాత్రం నా తల్లిదండ్రులవద్ద వున్నాయి. మిగతావి బహుశా ధ్వంసం అయ్యాయేమో. నేను వ్రాసిన అనేక కథలు వార్తాపత్రికలతో నాజీల ఫైళ్ళలో [illegible]ంచాయి!

ఇకముందు రాబోయే సాహిత్యచరిత్రకారులు, మహాకవిజాన్ నెరూడా*పై నా గాఢాభిమానాన్ని ప్రదర్శిస్తారని ఆశిస్తున్నాను. అతన్ని జెక్ కవులలో అగ్రగణ్యుడని చెప్పవచ్చు. భవిష్యత్తును దర్శించడంలో మనందరికంటె అతని ప్రతిభ చాలా గొప్పది. అతన్ని పూర్తిగా అవగతం చేసుకుని, అతని ఔన్నత్యాన్ని గుర్తిస్తూ ఇంత

* జెక్ మహాకవి. ఇతనిపై గౌరవంతోనే ఇప్పుడు అమెరికాలోవున్న పాబ్లో నెరూడా తనపేరు మార్చుకున్నాడు

వర కెవరూ వ్రాయలేదు. అతన్ని ప్రజాకవిగా ఆమోదిస్తూ విమర్శ వ్రాయడం అవసరం. అతను, పేదప్రజలు కార్మికులు జీవించే స్మిచోవ్ ప్రాంతం పక్కనే జన్మించాడు. "గోరీలపైపూలు" అనే అతని కావ్యానికి సామగ్రిఅంతా రింగ్‌హోఫర్ మిల్లు చుట్టుపక్కల వున్న జీవితంనుంచే సేకరించాడు. "గోరీలపైపూలు"అనే కావ్యం వ్రాసి నప్పటినుండి, "మేదినోత్సవం, 1890" అనే రచన చేసేవరకూ అతని పరిణామాన్ని గ్రహించాలంటే, వెనుకవున్న ఈ పరిస్థితులన్నిటినీ అవగాహన చేసికోవాలి. అనేకమంది విమర్శకులు - ప్రతి రచననూ నిశితంగా పరిశీలించగల షాల్డావంటివారుకూడా- జర్నలిస్టుగా అతను చేసినకృషి, అతని కావ్యనిర్మాణానికి అంతరాయం కలిగించిందని అభిప్రాయపడ్డారు. అది వట్టిబూటకం. వాస్తవానికి అతను జర్నలిస్టు కావడంవల్లనే అతను రచించిన* బాలడ్స్, సానెట్స్, హిమ్స్ఫర్ ఫ్రైడే డివోషన్స్, సింపుల్ మోటివ్స్ అంత అద్భుతంగా వున్నాయి. జర్నలిస్టుగా అతను కార్యభారంవల్ల అలిసిపోవచ్చు, వివిధ మార్గాల ననుసరించవచ్చు - కాని, పాఠకులతో ప్రత్యక్ష సంబంధం కలిగించి, నిజాయితీపరులైన నెరూడావంటి కవులకు ఉత్తమ కావ్య రచనకు దోహదం చేస్తుంది. ఈ పత్రికాప్రపంచాన్నుంచి నెరూడా వైదొలగి వుంటే, అనేక కావ్యాలు వ్రాసేవాడు. కాని, వ్రాసిన కావ్యాల ప్రభావం, ఇప్పటిలాగ, అనేక శతాబ్దాలవరకూ వ్యాపించేటంత మహత్తరంగా వుండేదికాదు. అతను అసంపూర్ణంగా వ్రాసిన 'సాబినా' అనే గ్రంథాన్ని ఎవరో ఒకరు పూర్తిచెయ్యాలి; దానికోసం ఎంత శ్రమించినా వృథాకాదు.

ప్రేమ, దివ్యత్వం మూర్తీభవించిన ట్లున్న నా తల్లిదండ్రులకు సుఖసంతోషాలు కలిగించాలని ఎంతో అనుకున్నాను. ఆ కాంక్ష వుండబట్టే, రచనా వ్యాసంగంలో నా కృషి నన్ను కృతార్థుణ్ణి చేస్తుందనుకున్నాను. ఇప్పటికైనా, నా మరణం వాళ్ళ జీవితాలను దుఃఖ భాజనం చెయ్యరాదని ఆశిస్తున్నాను. "కృషికర్త చనిపోయినా,

* అంటే వరుసగా: జానపదగీతాలు, ఒకేవస్తువును చిత్రిస్తూ వ్రాసిన గేయాలు, శుక్రవారప్రార్థన గీతాలు, పదాలు.

కృషిఫలితం నిలుస్తుంది." వాళ్ళచుట్టూ ప్రేమాస్పదంగా వ్యాపించే వాతావరణంలో నా స్మృతి జీవించే వుంటుంది : అది నా ఆశ.

మా కుటుంబంలో ఇప్పుడు కలుగుతున్న విఘాతాన్ని మా తల్లిదండ్రులు మరచిపోవడంకోసం మా గృహాన్ని సంతోషంతో, సంగీతంతో నింపమని నా చెల్లెళ్ళు లీబా, వీరాలను కోరుతున్నాను. నన్ను పెచెక్ భవనంలో చూడటానికి వచ్చినప్పుడు వాళ్ళిద్దరూ శోకంతో వెక్కి వెక్కి ఏడ్చారు, కాని వాళ్ళ అంతరాత్మలలో ఆనందం వెలుగుతోంది. అందుకే మా పరస్పర ప్రేమాదరాలు ఎన్నటికీ వాడిపోవు. వారు నడిచిన త్రోవనిండా ఆనందం తాండవించింది - వాళ్ళ సుఖానికి అంతరాయం కలుగకుండుగాక !

ఈ అంతిమపోరాటంలో పాల్గొంటున్నవారందరితో, ముందు పోరాటానికి సంసిద్ధమౌతున్నవారందరితో - ఇదిగో, కరచాలనం చేస్తున్నాను. మీ చేతు లందించండి. నాకూ, అగస్తినాకూ - మే మిద్దరం మా ధర్మాన్ని నెరవేర్చాము. కరస్పర్శ చెయ్యండి; వీడ్కోలివ్వండి.

ఇదిగో, మళ్ళీ చెపుతున్నాను, మే మిద్దరం జీవనసౌభాగ్యం కోసం బ్రతికాము; అందుకే పోరాడాము; అందుకే మరణిస్తున్నాము. ఎప్పుడుకూడా—మా పేర్లకూ, దుఃఖానికీ పొత్తు కలపకండి.

మే. 19, 1943 జూ. ఫ్యూ.

మే 22, 1943.

అది నావాఙ్మూలం. సంతకంపెట్టి, ముద్రవేసి, సీల్ చేసేశాను.

నా కేసు, అనుకున్నదానికంటె త్వరగా నడుస్తోంది. వాళ్ళెందు చేతనో హడావుడి పడుతున్నారు. విడాప్లాషా, మిరెక్ నా తోటిముద్దాయిలు. చూడగా, అతనిద్రోహం అతని కేమీ లాభించలేదు.

కోర్టులో జడ్జీ ముందు అంతా కర్కశంగా, ఖచితంగా వుంటుంది. ఆ కర్కశత్వం తలుచుకుంటేనే వొళ్ళు కంపిస్తుంది. కాని, గెస్టాపో కేంద్రకార్యాలయంలో జరిగే విశేషాలన్నీ జీవంతో తొణికిసలాడుతున్నాయి. ఎంత భయంకరంగా వున్నా, అవి మా జీవితాల్లో

అంతర్భాగాలు కదా! అక్కడ ఉద్రేకం ఉప్పొంగిపోతోంది: ఒక వైపు వీరుల ఉద్రేకోత్సాహాలు, మరొక వైపు వేటగాళ్ళ మొరటుతనం. అది ఆకలి గొన్న మృగాల పగలాంటిది; గజదొంగల క్రౌర్యం లాంటిది. అటుపక్క వున్న వాళ్ళలో కొందరిలో కొన్ని దృఢవిశ్వాసా లున్నట్టు కన్పిస్తోంది. కాని, జడ్జీముందివేమీ బైటపడవు - అధికార పూర్వకంగా జరిపించే విచారణ తతంగం తప్ప. ఈ అధికారులు ఆజ్ఞాపత్రాలు, మారణాయుధాలు అడ్డుపెట్టుకొని, తమ ఆందోళనలను మరుగు పరుస్తున్నారు. కాని, వీళ్లంతా అధోగతికి జారిపోయిన అల్పు లని స్పష్టంగా తెలుస్తూనేవుంది. వాళ్ల వైఖరిచూస్తే, ఏదోలాగ ఈ యుగాన్ని గడిచి బైటపడటంకోసం, ఎదురు చూస్తున్నట్టుంది. వాళ్లలో మంచీ, చెడూ - రెండూ కనపడవు. నవ్వరు. మండిపడరు. అధికార పూర్వకంగా వర్తిస్తారు. వాళ్ల నాళాల్లో రక్తం ప్రవహించదు- పులుసు నీళ్లు: జీతపురాళ్లతో కొనుక్కునే పులుసునీళ్లు!

సాక్ష్యాలన్నీ ప్రతులు తయారుచేస్తున్నారు. లా పుస్తకాలలో నుంచి పేరాలుతీసి పక్కనే ఉదహరిస్తున్నారు. సంతకాలు పెడుతు న్నారు. దేశద్రోహనేరంక్రింద మామీద ఆరు అభియోగాలు. నాజీ ప్రభుత్వంపై కుట్ర, సాయుధ విప్లవానికి ప్రయత్నాలు, ఇంకా ఏవేవో! మా ప్రాణం బలితీసుకోడానికి ఇందులో ఏ ఒకటైనా సరి పోతుంది!

నా ప్రాణాన్నీ, నా సహచరుల జీవితాలనూ కాపాడటానికి ఇప్పటికి పదమూడుమాసాలనుంచీ ఉత్సాహంతో, ఉపజ్ఞతో పోరాడు తున్నాను. ఆర్యసంప్రదాయమంటూ వాగుతున్నారు; దాన్ని పటా పంచలు చేశాను. కాని, వాళ్ళ చేతుల్లో న్యాయశాస్త్రమనే గొడ్డలి వుంది. దుర్మార్గం వుంది. అందుకే నేను ఓడిపోయాను.

ఆ సంఘర్షణ అంతమైనట్లే. ఇక మిగిలింది, ఎదురుచూడడమే. జడ్జిమెంటు చెప్పడం, తర్వాత జర్మనీకి ప్రయాణం, మళ్ళీ అక్కడ విచారణ, చివరికి శిక్షచెప్పడం, తర్వాత ఇక ఉరిదీసేముందు వంద రోజుల గడువును భరించడం. బహుశా అలాగే నడుస్తుంది. మహా ఐతే నాలుగైదు నెలలు. ఈ అంతరంలో ఏదైనా జరగడానికి అవ

కాశం వుందిగదా ! ఏమో ఇక్కడుండి ఎలా ఊహించడం! ఒకవేళ బైట పరిస్థితులు ప్రమాదకరంగా పరిణమిస్తే హడావుడిగా మమ్మల్ని కాల్చేస్తారేమో! ఎలాగైనా, మాకు గత్యంతరం లేదు.

ఈ యుద్ధమూ, మా ఆశా పోటాపోటీలతో విజృంభిస్తున్నాయి. రెండు విధాలైన మరణాలకుమధ్య వైరుధ్యం. ఏది ముందు వచ్చిపడుతుందో? నేనే ముందు చనిపోతానో, ఫాసిజమే నశిస్తుందో! ఈప్రశ్న నా ఒక్కడిదేనా? కాదు. అనేక వేలమంది ఖైదీలను, లక్షలకొలది సైనికులను ఇదే ప్రశ్న వేధిస్తోంది. యూరప్‌లోని కోట్లకొలది ప్రజలు, ప్రపంచప్రజలంతా ఇదే ప్రశ్న వేస్తున్నారు. కొందరికి అచంచలమైన ఆశవుంది. కొందరికి తక్కువ. కాని, ఇదంతా వట్టి భ్రమ, పతనదశలోవున్న పెట్టుబడిదారీవిధానం ప్రపంచాన్ని యుద్ధంలో ముంచడంవల్ల కలిగిన ఈ భయంకర మృత్యువు ప్రతి వ్యక్తినీ, ప్రత్యణువునీ చుట్టుముట్టుతోంది. అమాయకులు, సహృదయులు ఐన లక్షలాది ప్రజలు నశించిపోయినతర్వాత, అప్పుడుగాని మిగిలినవాళ్ళు గుండెమీద చెయివేసుకుని, ఫాసిస్టు ప్రమాదాన్ని గడిచిగట్టెక్కాం అని చెప్పలేరు.

కొన్ని నెలల్లోనే యుద్ధం ముగుస్తుంది. బహుశా కొద్ది దినాల్లోనే. కాని, ఆదినాలు అతి రాక్షసంగా వుంటాయి. నేనప్పుడప్పుడూ అనుకునేవాణ్ణిగదా: యుద్ధం అంతంకాబోయే చిట్టచివరి క్షణంలో, ఆఖరు గుండుదెబ్బతో చనిపోయే కట్టకడపటి సైనికుడి గతి ఎంత దుస్సహంగా వుంటుందీ — అని. కాని, ఎవరోఒక సైనికుడు ఆ దురదృష్టానికి బలికావాలిగదా! ఆ చిట్టచివరి సైనికుడి దుస్థితికి నేనే పాల్పడతాననుకుంటే, నేనీ క్షణాన్నే ప్రాణత్యాగం చేస్తాను.

... ... ...

ఈ పాంక్రాస్ ఖైదులో నాకిక స్వల్పకాలమే వుంది. అందుచేత ఈ రచనలను నేను కోరినవిధంగా తీర్చిదిద్దలేకపోతున్నాను. ఇంకా క్లుప్తంగా వ్రాయాలి. అందుచేత నేటి చరిత్రగతికంటె, వ్యక్తుల స్థితికి ప్రాధాన్యం యిస్తాను.

ఇంతకుముందు జెలినిక్స్ దంపతులను గురించివ్రాస్తూ మధ్యలో

ఆవేశానుకమూ! అతి సామాన్యులలాగ కన్పిస్తారు. సాధారణ పరిస్థితులలో వారి ధైర్యస్థైర్యాలు వెల్లడికావు. వాళ్లిద్దరూ అరెస్టు సమయంలో ఒకరిపక్కన ఒకరు నిలబడి చేతులు పైకెత్తారు: అతని మొహం పాలిపోయింది; ఆమెకు, క్షయరోగి కావడంవల్ల, కణతలకింద ఎరుపెక్కింది. ఇన్నాళ్లూ అంత జాగ్రతగా కాచుకున్న యింటిని నాజీలు ఐదునిమిషాల్లో ధ్వంసంచెయ్యడం చూసి, ఆమె కళ్లలో భీభత్సం తాండవించింది. నెమ్మదిగా భర్తవైపు తలతిప్పి, అడిగింది.: తర్వాతేం జరుగుతుంది?

అతను మితభాషి. అసలే మాటలకోసం వెతుక్కుంటూ చెపుతాడు. మాట్లాడేటప్పుడు ఊరికేనే ఉద్రేకపడతాడు. ఇప్పుడు మాత్రం తడుముకోకుండా, నిర్భయంగా జవాబిచ్చాడు:

"తీసుకుపోతారు, మరణిస్తాం. అంతే!"

ఆమె భయంతో కేకపెట్టలేదు, వొణికిపోలేదు. కుడిచేతిని కిందికిదించి, ఎదురుగా పిస్టల్స్ నోళ్లు తెరచి సిద్ధంగావున్నా, అతని చేయి పట్టుకొని అలాగే నిలబడ్డది. దానితో వాళ్లు మొహాలమీద మూర్ఖంగా బాదారు. ఆమె చెక్కిళ్లు తుడుచుకుంటూ, నాజీలవంక ఆపాద మస్తకం పరీక్షగాచూసి, నిర్లక్ష్యంగా అన్నది:

"చూడటానికి సాధువుగా వుంటారూ!" గొంతెత్తి అరిచింది. "చూడటానికి ఇలా వుంటారుగాని, వొట్టి అడవి మృగాలలాగుంది!"

వాళ్ల రాక్షసత్వాన్ని బాగా గ్రహించింది. కొన్ని గంటలలోనే స్పృహతప్పి పడిపోయిన ఆమెను, "పరీక్షాధికారి" ఆఫీసునుంచి తీసుకుపోయారు. ఆమెను ఎంత హింసించినా ఒక్క విశేషమైనా బైట పెట్టించలేకపోయారు. అప్పుడుగాని, ఆతర్వాతగాని ఎంత హింసించినా ఆమె ఒక్క ముక్కకూడా బైటికి పొక్కలేదు.

వాళ్ళ విచారణ జరుగుతున్నరోజుల్లో, అక్కడికి వెళ్ళడానికి కూడా వీలులేని దుస్థితిలో నా గదిలోనే పడివున్నాను. అందుచేత అక్కడ ఏమేంజరిగిందీ స్వయంగా చూడకపోయినా, వాళ్లు ఏమీ బైటపెట్టలేదనిమాత్రం స్పష్టంగా గ్రహించాను. నా ఆజ్ఞకోసం

వాళ్లు ఎదురుచూశారు. అతన్ని చేతులూ, కాళ్ళూ కట్టివేసి ఎన్ని సార్లు అమానుషంగా హింసించారో! కాని, నేనక్కడవుండి కళ్ళతో సైగచేస్తేతప్ప ఏ విషయమైనా చెప్పేసేవాడుకాదు. అదికూడా విచారణ తతంగం నడవడంకోసమే కొన్ని అసంగతాలు చెప్పేసేవాడు.

అరెస్టుకుపూర్వం ఎంతో సున్నితంగా, ఉద్వేగంతో చలించే హృదయం ఆమెది. ఐతే, గెస్టాపో అధీనంలో బాధలుపడుతున్నంత కాలం, ఒక్కసారైనా కంటతడిపెట్టియెరగదు. ఆమెకు తన ఇల్లే స్వర్గం. కాని, ఆమె బాధోపశమనంకోసం, బైటవున్న కామ్రేడ్సు, ఆ యింటిలోని వస్తువుల్ని ధ్వంసంచేసిన దుర్మార్గులు బైటపడ్డారని, వాళ్ళని జాగ్రత్తగా కాపలాకాస్తున్నామని కబురుపంపిస్తే, ఆమె జవాబిచ్చిందికదా:

"పోతే పోయాయి వెధవ సామాన్లు. వాటికోసం కాలం వ్యర్థంచెయ్యకండి. అంతకంటె అతిముఖ్యమైన బాధ్యతలున్నాయి. వాటిని నిర్వహిస్తూ, మేము లేని లోటు తీర్చడానికి పూర్వంకంటె రెట్టింపు పని చెయ్యాలి. మొట్టమొదట అక్కడ శత్రువుల్ని తుడిచిపెట్టాలి. తర్వాత, నేను బ్రతికి బైటపడితే ఇంటివిషయం చూసుకోగలను." తర్వాత ఒకనాడు నాజీలు వాళ్ళిద్దరినీ చెరివొక ప్రదేశానికి లాక్కుపోయారు. వాళ్ళ అంతిమదశను తెలుసుకోడానికి ఎంత తంటాలుపడ్డా సాధ్యంకాలేదు. కారణం? గెస్టాపో చేతుల్లో పడ్డవాళ్ళంతా విచిత్రంగా అంతర్ధానమైపోతారు. వాళ్ళకోసం ప్రతినిత్యం ఒక వెయ్యి గోరీలు కాచుకుని వుంటాయి. ఓహో! ఇప్పుడు నాటే ఈ ప్రాణబీజాలు ఒకనాటికి ఎలాంటి పంటపండుతాయోకదా!

ఆమె నాకు పంపిన చిట్టచివరి సందేశం యిది:

"నాకోసం బైటవాళ్ళెవరూ చింతించవద్దని కోరండి. నా దుర్గతిచూచి ఎవరూ బాధపడకూడదు. నేను కార్మికస్త్రీగా నా విధి నిర్వర్తించాను; నా కర్తవ్యనిర్వహణలోనే మరణిస్తున్నాను."

ఆమె యింటింటా చాకిరిచేసుకుని బ్రతికే స్త్రీ. పెద్ద చదువుకున్నదికూడా కాదు. అందుకనే శతాబ్దాలనాటి వీరుల సందేశం ఆమె విని యెరుగదు.

"ఓ యాత్రికుడా! లాసిడమోనియన్లకు తెలియజెయ్యండి!
మేము చనిపోయామని, న్యాయశాస్త్రానికి లొంగామని."

విసూషిల్ కుటుంబం

ఈ దంపతులిద్దరూ, జెలినిక్స్ కుటుంబం నివసించే భవనంలోనే, వారి గదిపక్కనే వుండేవారు. వీళ్ళ పేర్లుకూడా జోసఫ్, మేరీలే. జోసఫ్ ఒక చిన్న వుద్యోగి. ఆ దంపతులకంటె కొంచెం వయస్సు మీరినవాళ్లు. అతను నస్లీఅనేచోట పుట్టాడు. ఏపుగా పెరుగుతున్న పదిహేడవయేట నిర్బంధంగా సైన్యంలో చేర్చి మొదటి ప్రపంచయుద్ధం లోకి పంపారు. కొద్దివారాలకే, మోకాలిదెబ్బతిని తిరిగివచ్చాడు. ఆ దెబ్బనుంచి యిప్పటికీ పూర్తిగా కోలుకోలేదు. అతను బ్రూనో అనేచోట హాస్పటల్లో వున్నప్పుడు, ఆమె నర్సుగా పనిచేస్తోంటే పరిచయం కలిగింది. అతనికంటె ఎనిమిదేళ్ళు పెద్దది. అప్పటికి ఒక వివాహంలో దుర్భర యాతన లనుభవించి విరమించుకున్నది. అక్కడే ఈ రైల్వేగుమాస్తాకు, ఆమెకు పరస్పర ప్రేమ పెంపొందింది.

నా తర్వాత కొద్దిరోజుల్లోనే అతని అరెస్టుకూడా. ఆ వార్తవిని భయకంపితున్నయ్యాను. అతనే గనుక చెప్పేస్తే ఎంతైనా బైటపడుతుంది. కాని. అతను నోరు కదపలేదు. ఒక స్నేహితునికి నిషిద్ధ కరపత్రాలు పంచిపెట్టాడని తెలిసి అతన్ని పట్టుకొచ్చారు. అంతకు మించి వాళ్ల కేమీ దొరకలేదు.

కొద్దిరోజుల క్రితమే, పావోర్ష్న, పికోస్రవా అనే యిద్దరు కొరియర్ల తెలివి తక్కువవల్ల, హోంజా చెర్నీ అనే ముఖ్యనాయకుడు విసూషిల్ మేరీ సోదరియింట్లో వుంటున్నాడనే సంగతి బైటపడింది. అందుచేత జోసెఫ్‌ను "విచారణ"కుపెట్టి, నానాయాతనలకు గురిచేసి, మా కేంద్రకమిటీలో బైట మిగిలియున్న ఒకే ఒకవ్యక్తి హోంజా చెర్నీ అజ తెలుసుకోవాలని ప్రయత్నించారు. నా అరెస్టు తర్వాత మూడో రోజున అతను నం. 400 గదిలో ప్రవేశించాడు. వచ్చాడు. బల్లమీద కూర్చున్నాడు. అన్ని గాయాలతో బల్లమీద కూచోడం ఎంత

దుర్భరం! నేను ఆందోళనపడుతూనే, ధైర్యం కలిగించే చూపులతో ఆహ్వానించాను. కూచున్న తర్వాత, నస్లీప్రాంత ప్రజల పద్ధతిలో సూటిగా ఇలా అన్నాడు.

"నేను చెప్పనూఅంటే, అంతే. నావీపు వాళ్ళిష్టమొచ్చినట్టు పగలగొట్టుకోనియ్యండి. ఒక్క సంగతైనా బైటికి పొక్కితే ఒట్టు."

ఆదంపతుల జీవితం నాకు బాగా తెలుసు. ఒకరిని విడిచి ఒకరు క్షణమాత్రం వుండలేరు. ఇప్పటికి కొన్ని నెలలు గడిచాయి. ఆచక్కని గృహంలో, ఆమె ఒంటరిగా కూచుని ఎంత కుంగిపోతోందో! అందులోనూ, ఆవయస్సులో ఏకాంతజీవితం మరణంకంటె పదిరెట్లు దుర్భరంగా వుంటుందిగదా! అతని విముక్తికోసం, మళ్ళీ ఆయింట్లో కులాసాగా కూచుని సరదాగా 'తాతయ్యా', 'అమ్మమ్మ' అనే పేర్లు పెట్టుకొని ముద్దుగా పిలుచుకుంటూ కాలం గడపడంకోసం, ఎన్నిసార్లు ఎన్నిరకాల వూహాలు పోయిందో!

కాని, చిట్టచివరకి ఒకే మార్గాంతరం కన్పించింది. నిర్భయంగా తన కర్తవ్యం నెరవేర్చుతూనే, తన భర్త బాధ్యతలనుగూడా నిర్వర్తించేది.

అలాగే, 1943 ఉగాదిపండుగనాడు ఒంటరిగా యింట్లో కూచున్నది. అతని కుర్చీదగ్గర అతని ఫొటో నిలబెట్టింది. అర్ధరాత్రి అయి, కొత్త సంవత్సరం ప్రవేశించే క్షణాన తన 'గ్లాసు నెత్తి, బల్లమీద నింపివున్న అతని గ్లాసుతో ప్రేమపూర్వకంగా స్పర్శించి, అతని ఆరోగ్యాన్ని, పునరాగమనాన్ని వాంఛిస్తూ — జెక్‌దేశం విముక్తిపొందే వరకూ అతను జీవించివుండాలని ప్రార్థిస్తూ గ్లాసు పెదవుల కెత్తుకున్నది.

ఒక నెల తర్వాత ఆమె కూడా అరెస్టయింది. ఆమె ద్వారా బహిరంగ కార్యకలాపా లనేకం జరిగేవి. ఇప్పుడెలాగా అని మేమంతా హడలిపోయాము.

ఆమె పెదవిదాటి ఒక మాటైనా బైటికిరాలేదు.

ఆమెను కొట్టలేదు; కొడితే ఆ అనారోగ్యస్థితిలో రెండు దెబ్బ

లకే ప్రాణం విడిచేది. అంతకంటె దారుణంగా హింసించారు — తప్పుడు వ్యూహాలు ప్రవేశపెట్టి.

ఆమె అరెస్టుకు కొద్దిరోజులముందే, భర్తను బానిసగా పోలెండ్ పంపించారు. ఇప్పుడామెతో కథ మొదలెట్టారు:

"చూడు! ఎంత బలవంతుడికైనా అక్కడ చాకిరీకి తట్టుకోవడం చాల కష్టంసుమా! అందులో నీ భర్త కాలు దెబ్బతిన్నది. అసలే తట్టుకోలేడు. అక్కడ ఏ నిముషాన్నో రాలిపోతాడు. ఇక నీవు కలుసుకోవడం అసంభవం. నీకు భర్తకావాలంటే ఎక్కడ దొరుకుతాడు— ఈ వయస్సులో? అందుచేత, వున్నసంగతేమిటో బైటపెట్టు. వెంటనే నీ భర్తను పిలిపిస్తాం!"

—అక్కడెక్కడో ఏక్షణాన్నో రాలిపోతాడు, నాభర్త, పాపం! జో! ఏదుర్మరణం పాలౌతాడో ఎవరికి తెలుస్తుంది! ఇప్పటికే నా చెల్లెల్ని చంపారు. నా భర్తను పొట్టన పెట్టుకుంటారు. ఇక నేను మిగిలితే జీవితాంతం వరకూ ఒంటరిగా బ్రతుకీడ్చుకోవాలి. ఈ వయస్సులో ఎవరు పెండ్లాడతారు? కాని, అతన్ని రక్షించగలను. అతన్ని వెనక్కు తీసుకొస్తారు - అందుకొక పణంపెట్టాలి. ఊహు! నేను, నా కామ్రేడ్స్ జీవితాలను పణంపెట్టి వొళ్లుకాచుకునే వ్యక్తిని కాదుసుమా! అలా, అతను తిరిగివచ్చినా అతన్ని ప్రేమించ లేనుకూడ!—

ఒక్కమాటైనా బైటికి రాలేదు.

అనామకంగా మరణానికి దారితీసే అనేక రైళ్లలో ఎందులోనో ఆమెకూడా ప్రయాణం చేసింది. ఆ తర్వాతనే వార్త వచ్చింది; ఆమె భర్త జోసెఫ్ పోలెండ్‌లో చనిపోయాడని.

## లిడా

బాక్యాస్ కుటుంబంవున్న యింటికి, మొట్టమొదటిసారి ఒక సాయంత్రంవేళ వెళ్ళాను. జోసీమాత్రం యింట్లోవున్నాడు. అతనితో పాటు లిడా అనే అమ్మాయి, పొట్టిగా జీవంతో చలించిపోయే కండ్లతో అక్కడ కూచునివుంది. పసిపిల్లలాగ నా మీసాలకేసి

చూస్తూ, ఈ వచ్చిన వ్యక్తి బహు సరదాగావున్నాడే అనుకుంటున్నట్లు తోచింది.

మా యిద్దరికీ బహు త్వరగా స్నేహితం కుదిరింది. ఆమెకు అప్పుడే పందొమ్మిదేండ్లని తెలిసి ఆశ్చర్యపోయాను. ఆమె యింటిపేరు స్లాచా (అంటే 'బెరుకు'). కాని ఆమెలో ఏ మాత్రం బెరుకుతనం లేదు. ఆమెకు నాటకాల్లో నటించడమంటే మహా సరదా. ఆమె నన్నొక ఆప్తుడుగా భావించి, ఆమె యౌవనస్వప్నాలను, దుఃఖాలను నాతో వెళ్ళబోసుకునేది.

అక్కడ ప్రవేశించినతర్వాత, ఆరు నెలలకు బైటికివచ్చాను. ఆమెకూడ నాతో నడిచింది. కుంటుకుంటూ నడిచే వృద్ధుడు, తను ఒంటరిగా వెళ్ళడంకంటె కుమార్తెతో కలిసి వెళ్ళితే, ఇతరులంత ఎక్కువగా గమనించరు. తోవలో ఎదురొచ్చేవాళ్లంతా నాకంటె ఆమె వంక చూసేవారు. అందుచేత, నేనెప్పుడు బైటికి వెళ్ళినా ఆమె వెంట వచ్చేది. నేను మొదటిసారి రహస్యసమావేశానికి వెళ్ళేటప్పుడు వెంబడించింది. నేను తిరిగి అజ్ఞాతవాసంలో ప్రవేశించినప్పుడు నాతో కూడా వున్నది అలాగే – ఇప్పుడు జర్మన్లు ఛార్జిషీట్‌లో వ్రాసినట్టు – నాకు కొరియర్‌గా తయారయింది.

ఆమె కేపనిచెప్పినా, దాని పర్యవసానమైనా ఆలోచించకుండా, అమాయికంగా హుషారుగా, ప్రమాదాన్నెదుర్కొనే ధైర్యోత్సాహాలతో నెరవేర్చేది. ఆమె చిన్న చిన్న పనులు చేస్తున్నంతకాలం, నేను గూడా వాటి ప్రాముఖ్యాన్ని బోధపరచలేదు.

లిడా, త్వరత్వరగా అభివృద్ధి పొందింది. అక్కడా యిక్కడా చిన్న చిన్న వార్త లందించడంకంటె, ముఖ్యమైన కార్యకలాపాల్లో పాల్గొన సాగింది. అందుచేత ప్రతి విషయాన్నిగురించి తెలియజెప్పడం ప్రారంభించాను: అంతా ఒక స్కూలులాగే నడిచింది. ఆమెకూడా సరదాగా ఆదుర్దాగా చెప్పినవన్నీ గ్రహించింది. బైటికిమాత్రం, పూర్వంలాగే హాయిగా, నిర్లక్ష్యంగా వున్నట్టు కన్పించినా, మానసికంగా పెరిగింది. గాఢంగా యోచించ ప్రారంభించింది.

ఈ పరిస్థితిలోనే మిర్కేతో ఆమెకు పరిచయంకలిగింది. అతను అప్పటికే ఎంతో కార్యభారాన్ని నిర్వహించాడు. దాన్నిగురించి ఆమెకు బోధపరచగలిగాడు. ఆమెకు అతనంటే గాఢాభిమానం ఏర్పడింది. ఐతే, అతని ప్రధాన లక్షణాలను స్పష్టంగా గ్రహించలేదు. అందులో నేను కూడా పొరపడ్డానుగదా! అన్నిటికంటె ముఖ్యంగా అతని కృషి, అచంచలంగా కన్పించిన అతని విశ్వాసమూ, ఆమెనెక్కువ ఆకర్షించాయి.

ఆమెలో అతిత్వరితంగా ప్రేమ పెంపొందింది. ఆమె అంతరాంతరాల్లో వేళ్లూనింది.

1942 ప్రారంభంలోనే, పార్టీలో సభ్యత్వం కావాలని తటపటాయిస్తూ అడుగుతూండేది. అంత ఆందోళన ఆమెలో ముందెప్పుడూ కన్పించలేదు; ఇంతకుముందెప్పుడూ ఏ విషయాన్నీ సీరియస్‌గా యోచించియెరగదు. సభ్యత్వం విషయం ఆలోచిస్తూనే, ఆమెకు రాజకీయవిద్య సాగించాను. ఆమె నింకా పరీక్షించి చూడటం అవసర మనుకున్నాను.

1942, ఫిబ్రవరిలో కేంద్ర కమిటీయే ఆమెను సరాసరి పార్టీలోకి తీసుకున్నది. మంచు దట్టంగా కమ్మిన ఆ రాత్రిలో యింటివేపు నడుస్తున్నాము. ఎప్పుడూ మాటలంటే చెవికోసుకునే లిడా, మౌనంగా నడుస్తోంది. యింటిసమీపంలో ఒక పొలందాటి ముందుకు అడుగు వెయ్యగానే హఠాత్తుగా నిలబడింది. నేలమీదవాలే మంచురేకుల చప్పుడుసైతం విన్పించే ఆ నిశ్శబ్దంలో,దడ దడ మాట్లాడేసింది.

“ఇవాళ నా జీవితంలో అతిప్రధానమైన రోజని నాకు తెలుసు. ఇకనుంచీ నా జీవితం నాది కాదు, పార్టీది. ఇదిగో మీ ముందు శపథం చేస్తున్నాను. ఆరు నూరైనాసరే, నాకర్తవ్యం నెరవేర్చి తీరుతాను.”

తర్వాత ఎన్నెన్నో సంఘటనలు జరిగాయి, కాని ఆమె నిశ్చలంగా నిలబడ్డది. పార్టీ నాయకులకు అతిరహస్యమైన వార్తలందించేది. తెగిపోయిన సంబంధాలను తిరిగి నెలకొల్పడంలోను, ప్రమాదంలో పడబోయే వర్కర్లను ముందే హెచ్చరించడంలోను జాగ్రతగా చాతు

ర్యంతో ప్రవర్తించేది. చిన్నదైనా, పెద్దదైనా ప్రతిపనినీ హాయిగా నిర్భయంగా నిర్వహించేది. బైటికి నిర్లక్ష్యంగా వున్నట్టు కన్పించినా, అంతరాంతరాల్లో తన బాధ్యతను పూర్తిగా గ్రహించి ప్రతిపనికీ పూనుకునేది.

మేము అరెస్టయిన నెల రోజులకే ఆమెను పట్టుకున్నారు. మిరెక్ అప్పు డప్పుడూ ఆమెనుగురించే చెప్పుకొచ్చేవాడు. తర్వాత తెలిసింది; తాను అరెస్టయినతర్వాతగూడా ఆమె బావ, అక్క అజ్ఞాతం లోకి వెళ్ళి తలదాచుకోడానికి తనే తోడ్పడిందని. అరెస్టయినతర్వాత గూడా, అమాయకురాలిలాగ నటిస్తూ, సరదాగా తల వూపుతూండేది.

లిడాకు ఎన్నో విషయాలు తెలుసు. కాని, ఒక్కటీ బైటికి రానివ్వలేదు. అంతకంటె ముఖ్యం: తన ధర్మం తాను నెరవేర్చు తూనేవుంది. ఆమె పరిసరాలు, పనిచేసే పద్ధతులు, మారాయి. ఆమె బాధ్యతలుగూడా పూర్తిగా కొత్తవి. ఐనా, చేతులు ముడుచుకొని కూర్చోలేదు. పార్టీపట్ల తన కర్తవ్యం మారలేదుగద! తన పనులన్నీ అతివేగంగా, ఖచితంగా, అత్యంత భక్తిశ్రద్ధలతో చేసుకుపోయేది. స్త్రీ ఖైదీల సెక్షనులో "కాపలాదారు"గా నియమితమై, అక్కడ అనేక రహస్య వార్తలను వెలుపలకు పంపి, బైట అనేకమందిని ప్రమాదం నుంచి తప్పించింది. ఇలా ఒక సంవత్సరమంతా గడిచినతర్వాత, నాజీలు ఈవిషయం పసిపట్టారు. దానితో, "కాపలాదారు ఉద్యోగం"సమాప్తి.

రేపు బెర్లిన్‌లో ఫాసిస్టుప్రభుత్వం జరిపే విచారణకు మాతో పాటు తానుగూడా హాజరుకాబోతున్నది. సాక్ష్యాన్నిబట్టి మా అందరి లోనూ, ఆమె బ్రతికిబైటపడటానికి ఎక్కువ అవకాశం వుంది. ఆమె ఇంకా యువతి. ఒకవేళ మేము చనిపోయినా ఆమెను కాపాడండి. ఆమె యింకా ఎంతో నేర్చుకోవాలి. బోధించండి. ఆమె అభివృద్ధి కుంటుపడకుండా సహాయంచెయ్యండి. తన శక్తిసంపదలు చూచుకుని గర్వించకుండా, తను ఆర్జించిన జ్ఞానంతో సంతృప్తిపడకుండా జాగ్రతగా పెంచండి. అనేక దుస్సహ సంఘర్షణల్లో ఆరితేరి నెగ్గింది. ఆమె జీవితం పరీక్షాగ్నిలో కరిగి మరిగి ఉక్కులాగ తయారయింది.

విచారణాధికారి

ఇతను ఈ పాత్రలతోపాటు చిత్రించదగినవాడుకాదు. కాని చూసేందుకు అందరికంటె హుందాగా కన్పిస్తాడు.

పదేళ్ళక్రితం, వినోరాడ్ అనేచోట ఫ్లోరాహోటల్లో, నీవు డబ్బుచెల్లించాలనుకుని నాణేలు బల్లమీదమోగిస్తే, "వెటర్, బిల్లు?" అని పిలిస్తే, ఒక పొడుగాటి బక్కపలచని వ్యక్తి సరాసరివచ్చి మీ పక్కనే నిలబడేవాడు. కుర్చీల మధ్యగా ఈదుతున్నట్లు ఊగుతూ, నిశ్శబ్దంగా నడుస్తూ వచ్చి బిల్లు బల్లమీద పెట్టేవాడు. వన్యమృగం లాగ అతివేగంగా నిశ్శబ్దంగా కదిలేవాడు. క్షణంలో చూచినవన్నీ ఆకట్టేవాడు. మీరు చెప్పీచెప్పకముందే మీకు ఫలానివస్తువులు తెమ్మని వైటర్లను ఆజ్ఞాపించేవాడు. అప్పుడతన్ని నే నెరగను. ఆ తర్వాత ఒకానొకనాడు జెలినిక్స్ యింట్లో [ఈసారి పెన్సిల్ కాదు] నా మీదికి పిస్టల్ గురిపెట్టి: "ఇతనంటేనే నాకు సరదా" అన్నప్పుడు గుర్తుపట్టగలిగాను.

అతనికి తెలివితేటలున్నాయి. మనుష్యుల్ని సులభంగా అరంచేసుకోగలడు. నేరగాండ్లు, హంతకులు అతను ప్రశ్నిస్తేచాలు, ఇట్టే అన్ని రహస్యాలూ విప్పిచెప్పేస్తారు. ఇక్కడమాత్రం అలాకాదు. ఇక్కడ పోలీసుల తెలివితేటలు, ఒకఖైదీ బుద్ధికుశలతనుకాదు, అంతకంటె అత్యధికమైన శక్తిని ఎదుర్కొంటాయి. ఒకవ్యక్తి ఆదర్శంతో, విశ్వాసంతో, ఆవ్యక్తి చెందిన రాజకీయపక్షపు సర్వపరిజ్ఞానంతో సంఘర్షించ వలసివస్తుంది. కల్లబొల్లి కబుర్లు, కర్రదెబ్బలు ఆదర్శాలను విచ్ఛిన్నం చెయ్యలేవు.

ఈ విచారణాధికారికి ఒకే విశ్వాసమంటూలేదు. ఎవరిలోనైనా ఉన్నా, దానితోపాటే బోలెడు అజ్ఞానం, మూర్ఖత్వం కలసివుంటాయి. ఐనా, మొత్తంమీద విజయం సాధించగలుగుతున్నారూ అంటే, ఈ సంఘర్షణ పరిమిత ప్రదేశంలో అవిరామంగా సాగుతూండటం, ఈ అజ్ఞాత పోరాటానికి పూర్వంకంటె దుర్భర పరిస్థితులు సంభవించడం ముఖ్య కారణాలని చెప్పాలి. రహస్యోద్యమంలో పాల్గొనే

వారు రెండేండ్లవరకు నిర్భయంగా కృషి చెయ్యవచ్చునీ, ఆపిదప మాస్కోలో బ్రతకడం అసంభవమైతే అక్కడనుంచి పెట్రోగ్రాడ్‌కూ ఆతర్వాత ఒడెస్సాకువెళ్లి లక్షలాది నగరవాసుల్లో కలిసిపోయి అజ్ఞాతంగా వుండవచ్చుననీ, రష్యన్‌బోల్షివిక్‌లు అంటుండేవారు. ఇక్కడ ఎంతసేపూ ప్రేగ్, ప్రేగ్, ప్రేగ్. ఇందులో సగంమంది ఎరిగినవాళ్లు, పైగా శత్రువుల సి. ఐ. డీ. మూకకు కేంద్రస్థానం. అప్పటికీ, పండ్ల తరబడి అజ్ఞాతంగా బ్రతకగలిగాం. మాలో కొందరు ఐదేండ్లనుంచి రహస్యంగా పనిచేస్తూ ఇంతవరకు పత్తా దొరకనివాళ్లున్నారు. దీనికి ముఖ్యకారణం: మేమనేక కొత్త మెలకువలు నేర్చుకున్నాం. అదీగాక, ఇక్కడ జర్మన్ శత్రువు ఎంత బలంగా, క్రూరంగా ప్రవర్తించినా, కన్పించిన ప్రతిదాన్నీ ధ్వంసంచెయ్యడం తప్ప మరొకటి నేర్చుకోలేదు.

ఈ సెక్షన్ 2. ఎ-లో ముగ్గురు ఆఫీసర్లున్నారు. వీళ్లు ముగ్గురూ, అంతశ్శత్రులైన కమ్యూనిస్టు పార్టీని మట్టుపెట్టడంలో ప్రసిద్ధిపొంది నలుపు- తెలుపు- ఎరుపు రంగులువుండే బిరుదులు పొందారు. ఫ్రెడరిక్, జాండర్, మా విచారణాధికారి జోసెఫ్ బోమ్. హిట్లర్ ప్రతినిత్యం కేకలుపెట్టే నేషనల్ సోషలిజం అంటే ఏమిటో ఒక్క ముక్కైనా వీళ్లకు అంతుపట్టదు. వీళ్లు పనిచేసేది ఒకరాజకీయాశయం కోసం గాదు,దొరికినంత కూడబెట్టుకోడానికి. ఎవరి పద్ధతిలో వాళ్లు సంపాదన సాగిస్తున్నారు.

జాండర్- ఇతనికి శక్తితక్కువ, బడాయి ఎక్కువ. పోలీసు పద్ధతులన్నీ క్షుణ్ణంగా తెలుసు. డబ్బు దొంగిలించడంలో అంతకంటె ఘనుడు. భోజనం వేళగూడా విచారణసాగిస్తూ, తనకు అధికార విధులు తప్ప, మరే ఆలోచనా లేదని రుజువు చేసుకోడానికి తాపత్రయపడతాడు. అతని చేతిలో చిక్కిన వాళ్లగతి నిజంగా దుస్సహంగా వుంటుంది. వాళ్లకే గనుక బ్యాంకులో డబ్బుగాని, సెక్యూరిటీలుగానివుంటే ఇక వాళ్ళ దుర్గతికి అంతులేదు. వాళ్లకు వెంటనే మరణం తప్పదు. ఎందుకంటారా? జాండర్ దృష్టి ఎప్పుడూ బ్యాంకుపుస్తకాల మీాదే వుంటుంది.

ఫ్రెడరిక్ – పొడుగ్గా, పల్చగా బోలుగా వుంటాడు. కళ్ళలో, నవ్వులో క్రౌర్యం ఉట్టిపడుతుంది. జెకోస్లావేకియాలో తలదాచుకున్న జర్మన్ కమ్యూనిస్టులను నాజీలకు పట్టియివ్వడానికి, 1937 లోనే గెస్టాపో గూఢచారిగా వచ్చాడు. అతనికి శవాలంటే మహాయిష్టం. ఎవ్వరుగానీ అమాయకులూఅంటే అతను ఒప్పుకోడు. అతని గడప తొక్కిన ప్రతిఖైదీ నేరస్తుడే. భర్తలు కాన్సెన్ట్రేషన్ కాంపులో వున్నారనో, ఉరితీయబడ్డారనో భార్యలకుచెప్పి బాధపెట్టడం అతనికి సరదా. ఎవరినైనా విచారణచేస్తూ, కులాసాగా డ్రాయర్ తెరిచి, అందులో ఖైదీల చితాభస్మం భద్రపరచిన ఏడుగిన్నెలు బైటికితీసి ప్రదర్శిస్తాడు.

"ఈ ఏడుగురినీ స్వయంగా నా చేతులతో కొట్టి చంపాను. నీవు ఎనిమిదోవాడివి– చెప్పు."

ఇప్పు డతని డ్రాయరులో ఎనిమిదోగిన్నె చేరింది. ఈ మధ్యనే జాన్ జీస్ కాను బలితీసుకున్నాడు.

వీటన్నిటికంటె, స్త్రీలను చిత్రహింస చెయ్యడం అతనికి ప్రీతి.

మూడవవాడు నా విచారణాధికారి, జోసెఫ్‌బోమ్ – ఇతని జాబితాలోగూడ, తను స్వయంగా హత్యచేసినవాళ్ళు చాలామంది వున్నారు. కాని, డబ్బంటే, హత్యలంటే అంతగా ఎగిరిపడడు. ఏదో గొప్ప అధికార పదవి పొందాలని ఆందోళన. చాలాకాలం గెస్టాపోలో పనిచేశాడు. హిట్లర్ బెరాన్‌తో రహస్యసంభాషణలు సాగించేటప్పుడు తను అక్కడేవుండి, బెరాన్ చెప్పనివన్ని హిట్లర్‌కు అందజేసేవాడు. కాని అలాంటివాటికంటె, మనుష్యుల్ని వేటాడటం, వాళ్ళ జీవితాలను, మరణాలను నిర్ణయించే నిరంకుశాధికారి కావడం, కొన్ని వందల కుటుంబాలను త్రుటిలో తుడిచిపెట్టే అవకాశం రావడం స్వల్ప విషయమా?

తనతో బాటు కొన్ని వందల కుక్కల్ని తయారుచేశాడు. వేట ప్రారంభించాడు. వేటాడటంవల్ల ఏమీ ప్రయోజనం కలగనక్కర్లేదు– సరదాగావుంటే చాలు. విచారణలంటే విసుగు. మనుష్యుల్ని అరెస్టు చెయ్యడం, తన నిర్ణయంకోసం వాళ్ళంతా ఎదురుచూస్తుంటే– అహా,

ఇంత అధికారం నాకున్నదిగదా— అని సంతోషించడం అతనికిష్టం. ఒకసారి, ప్రేగ్‌లోని రెండువందలమంది బస్ కండక్టర్లను, డ్రయివర్లను అరెస్టుచేసి రహదార్ల వెంట తోలుకుంటూ వెళ్ళాడు. వీధుల్లో రాకపోకలాగిపోయాయి. అప్పుడెంత సంతోషించాడో! వెంటనే నూటయాభై మందిని విడుదలచేశాడు. ఎందుకు? తను ఎంతో ఉదార పురుషుడని నూటయాభై కుటుంబాలు తెలుసుకుంటాయిగదా అని!

అతను పట్టుకునే కేసులు సర్వసాధారణమైనవి. పైగా లేనిపోని చిక్కులు తెచ్చిపెట్టేవి. అతనికి నాకేసు ముఖ్యమైంది— అందులో పొరపాటున దొరకడం.

"నాకేసులన్నిటిలో నీది చాలా ముఖ్యమైనది" అని తరచు అనేవాడు. జెక్ దేశంలోని ముఖ్యమైన కేసుల్లో తనదిగూడా ఒకటున్నదిగదా అని గర్వించేవాడు. బహుశా! ఆ అభిప్రాయం నా జీవితాన్ని మరికొంత కాలం పొడిగించడానికిగూడా తోడ్పడిందేమో.

విచారణలో ఎప్పుడూ, మా శక్తినంతా ప్రయోగించి అబద్ధాలు వల్లించేవాళ్ళం. ఐతే, ఒక్క తేడావుంది. అతను అబద్ధంచెపితే నా కిట్టే తెలిసిపోయేది, నేను చెపితే సాధారణంగా అంతుపట్టేదికాదు. ఏ అబద్ధమైనా ఒకసారి బైటపడితే, ఇద్దరం కూడబలుకుకున్నట్లు వెంటనే మరొక సంగతి ఎత్తుకునేవాళ్లం. ఇదంతాచూస్తే నా కేమనిపించేదంటే: అతనికి వాస్తవం తెలుసుకోవాలనే కుతూహలంకంటే, తను పట్టుకున్న పెద్దకేసు ఖచ్చితంగా వుండాలనే ఆదుర్దా ఎక్కువఅని.

అతనిలో ఇతరులకంటె ఊహాపోహ లెక్కువ. విచారణ జరుపుతున్నప్పుడు, ఒక్కొకసారి,ఎక్కడో బ్రానిక్‌లో ఒక మహాసభ జరుగుతున్నట్టు, అక్కడే తోటలో కూచుని వచ్చేపోయే జనాన్ని మేం పర్యాలోకన చేస్తున్నట్టూ భావించి, చెప్పుకొచ్చేవాడు.

"నిన్నరెస్టుచేశామా! చూడు! అంతమాత్రాన వీరందరిలోనూ రవంతైనా మార్పురాలేదుగద! పూర్వంలాగే హాయిగా షికార్లు చేస్తున్నారుగద! వాళ్ళ సుఖదుఃఖాలలోనే మునిగి తేలుతూ నవ్వుతున్నారు, చింతిస్తున్నారు. నీవసలు పుట్టలేదన్నట్టుగానే ప్రపంచమంతా నడిచిపోతోంది. అందులో నీ రచనలు చదివిన పాఠకులు కొంద

రుంటారుగద! నీ దురదృష్టంచూసి వాళ్లెప్పుడైనా విచారిందా రంటావా?"

మరొకసారి, రోజంతా ప్రశ్నలతో వేధించినతర్వాత, నన్ను తన కారులో ఎక్కించుకుని నెరూడా వీధిగుండా కోటవరకూ తీసుకుపోయి:

"ప్రేగ్ నగరమంటే నీకెంత ప్రేమో నాకు తెలుసు. మళ్ళీ ఎప్పటికైనా ప్రేగ్‌లో ప్రవేశించాలని కోరుకోవూ? ప్రేగ్‌నగరం ఎంత సౌందర్యమయంగా వుందీ! నీవు చనిపోయిన తర్వాతకూడ సుందరంగానే వుంటుందిగద!"

బైబిల్‌లో సతాన్‌లాగ నన్ను లొంగదీయాలని ఎలాగైనా ప్రయత్నించాడు ఆ వేసవి సాయంత్రంవేళ హేమంతఋతువు ప్రవేశిస్తోందని పవనపరిమళం చెబుతోంది. ఆర మగ్గిన సైన్‌లాగ, మత్తులో ముంచెత్తే ద్రాక్షపండ్లలాగ, ఆకాశంలో నీలంగా మంచు పొగ వ్యాపిస్తోంది. ఈ జగతి జీవితాంతంవరకూ ఇలాగే పరవశమై చూస్తోవుండా లనిపించింది. కాని అతని మాటల నెదుర్కొన్నాను:

"... నీవే చనిపోతే ప్రేగ్‌నగరం ఇంకా ఎంతో సౌందర్యమయంగా వుంటుందిగదా!"

ఒక చిన్న నవ్వు నవ్వాడు; కోపంతో కాదు, విచారంతో.

"నీవు సినిక్‌వి" అన్నాడు.

ఆ సాయంత్రపు సంభాషణను గురించి, తర్వాత పదేపదే తడుముతూండేవాడు.

"నీవీగదిలో వీరందరిమధ్య లేనప్పుడుకూడ ... అప్పుడుకూడా మేం జయిస్తామని నమ్మవూ?"

అతను ప్రశ్నించాడు. కారణం? అతనికే నమ్మకంలేదుకనుక. నేను సోవియట్ యూనియన్ శక్తిసంపదలను, ధైర్య స్థైర్యాలను వర్ణిస్తోంటే చెవులప్పగించి విన్నాడు. నా "విచారణ"ల్లో అదికూడా ఒక భాగమే.

ఎదుటిగది తలుపుపక్కనే రెండు రబ్బరుబెల్టులు వేలాడు తున్నాయి. ప్రొసర్లకు తొలిగించే అతిసామాన్యమైన బెల్టులు. ఎందు చేతో అవంటే నా కెప్పుడూ యిష్టంలేదు. ఇప్పుడో? మా గదితలుపు తెరిస్తే అవి కన్పించినప్పుడల్లా సంతోషంతో పొంగిపోతున్నాను — అవి నాకు ఆశాచిహ్నాలు.

ఎవరినైనా అరెస్టుచేసి కొనవూపిరి మిగిలేవరకూ హింసించినా, నిర్దాక్షిణ్యంగా హత్యచేసినా — మొట్టమొదట అతని దేహంమీది నెక్టై, బెల్టులూ మొదలైనవన్నీ గుంజుకునికాని హింస ప్రారంభించరు. వాటితో ఉరిపోసుకుంటాడేమోనని పాపం, వాళ్ల భయం. (కావాలంటే టవల్‌తో ఆత్మహత్య చేసుకోలేరూ!) ఖైదీ ప్రాణం బలితీసుకోడానికి సిద్ధపడినా, వీటినిమాత్రం భద్రంగా జైలుఆఫీసులో దాచిపెడుతారు. మళ్ళీ ఆ ఖైదీని బానిసగానో, కాన్‌సెన్ట్రేషన్ కాంపుకో, ఉరితీయడానికో పంపేవరకు అవి అక్కడేవుంటాయి. అప్పుడు పిలుస్తారు, అధికారపూర్వకంగా వాటిని ఆ వస్తువులన్నీ వొప్పజెప్తారు - కాని, వాటిని నీ గదిలోకి తీసుకుపోవడానికి వీలులేదు. గది బైట తలుపుపక్కనే వాటిని వేళ్ళాడేసివుంచాలి. అందుచేత, అవి అక్కడున్నాయంటే, ఆ గదిలో ఖైదీని ఏ నిమిషాన్నైనా ఎక్కడికైనా ఈడ్చుకుపోతారని ఇట్టే తెలిసిపోతుంది.

అగస్టినాను పంపేస్తున్నారని తెలుసుకున్నరోజునే, ఎదుటి గది తలుపుపక్కనే ఆ బెల్టులు ప్రత్యక్షమయ్యాయి. ఆ గదిలోని క్రామేడ్‌ను గూడా, ఆమెవెళ్ళే రైల్లోనే పోలండుకు బానిసగా పంపుతున్నారు. అధికారు లేర్పరిచిన ప్రయాణం, ఇలా హఠాత్తుగా ఆగిపోవడానికి కారణం, ఆ వెళ్ళే నగరాన్ని బాంబులు ధ్వంసంచేశాయట. ఈ వార్త విని ఇంకా సంతోషంగావుంది. ఇక వాళ్లెప్పుడు బయలుదేరుతారో ఎవరికీ తెలియదు. ఇవాళసాయంత్రమే కావచ్చు; లేక రేపో, ఒక వారం రెండు వారాలు తర్వాతో; ఎప్పుడోమరి! ఎదుటబెల్టులు కనబడుతున్నంత కాలం, అగస్టినా ప్రేగ్‌లోనే వుందని స్థిరపరచుకుంటాను.

అందుచేత, వాటికేసి ప్రేమతో సంతోషంతో చూస్తూ, ఇవే ఆమెకు తోడ్పడు తున్నాయనుకుంటూ ఉవ్విళ్ళూరుతున్నాను. అవే ఆమెకు ఒకరోజు, రెండు, మూడు... అలాగ వ్యవధి నిస్తున్నాయిగదా! ఈ కొద్దిరోజుల్లో ఎన్నివిశేషాలు జరగకూడదు! బహుశా ఇప్పుడే ఏదో రోజున విముక్తి పొందకూడదూ!

ఇక్కడ ఖైదీలందరి తత్వం అలాగేవుంటుంది. గతసంవత్సరం, గతమాసం, నిన్న, రేపూ మా చూపులెప్పుడూ ఆశాస్వరూపమైన "రేపు" మీదే వుంటాయి. మీ మరణం నిర్ణయమైనదని తెలిసినాసరే, రేపే మిమ్మల్ని కాల్చడానికి నిర్ణయించినాసరే — కాని, ఓహో! రేపటిలోపల ఎన్ని అద్భుతాలు జరగకూడదు! రేపటివరకూ బ్రతికి వుంటే అంతా ఒక్కసారిగా మారిపోవచ్చు. పరిస్థితులు క్షణక్షణం తారుమారౌతున్నాయి. రేపేం జరుగుతుందో ఎవరికి తెలుసు? అలాగే, రేపు లనేకం గడుస్తున్నాయి. వేలకొలది యోధులు నేల కూలిపోతున్నారు. వాళ్లకు రేపులేదు. కాని, ప్రాణంతో వున్న వాళ్లు ఇంకా ఆశతోనే జీవిస్తున్నారు. రేపేం జరుగుతుందో ఎవరికి తెలుసు?

ఈ మనః స్థితిలోవున్న ఖైదులో అనేక వెర్రిపుకార్లు పుడతాయి. ప్రతివారం ఒక పుకారు లేస్తుంది. రేపోమాపో యుద్ధం ఆగిపోతుందని ఈ రహస్యం సంతోషంగా చెవినుండి చెవికి ప్రాకుతుంది. ఈ పాంక్రాస్ జైలులో ప్రతివారం ఏదో ఇలాంటి వార్త పుట్టడం, అందరూ మనసార నమ్మి ఆశతో ఎదురుచూడటం — ఇవి నిత్యం జరుగుతాయి. నీవో? ఈ పుకార్లను బూటకాలని వాదిస్తావు; ఇలాంటి పేరాశలవల్ల ఖైదీల ధైర్యం, పట్టుదల సడలిపోవడం తప్ప ఫలితంలేదు. అబద్ధాలు నమ్మి ఆశాభావం నిలబెట్టు వడం ఎప్పుడూ తగదు. ఈ యుద్ధం సమాప్తి కావడం ఎలాంటి పరిస్థితుల్లో సాధ్యమో స్పష్టంగా గ్రహించి, వాస్తవాన్ని ఆమోదించడం మా ధర్మం. సత్యాన్ని విశ్వసించే శక్తి ఆయా వ్యక్తులలోనుంచే ఉద్భవించాలి. ఒకానొక రోజున తప్పని సరిగా విజయం లభిస్తుందనే నమ్మకం, ఆ "రోజు" నీ విముక్తికి సోపానమై, నీవు త్యజించడానికి సిద్ధపడని ఈ జీవితానికి, నిన్ను ప్రతిక్షణం కబళింపజూచే మృత్యువుకు మధ్య

వున్న అగాధాన్ని దాటిస్తుందనే అచంచలవిశ్వాసం - ఈ విశ్వాసం వాస్తవపరిస్థితుల సమగ్రావలోకనంవల్లనే కలుగుతుంది.

ఒక మానవుని జీవితంలో ఎన్నో రోజులు లేవుగదా! ఐనా రోజులెంత త్వరగా, త్వరితంగా గడిచిపోతే అంత మంచిదని కోరుకుంటున్నావు. క్షణక్షణం అదృశ్యమైపోయే "కాలం" జీవితాన్ని పీల్చి పిప్పిచేసే "కాలం" ఇక్కడ నీకదే ఆప్తబంధువు! ఎంతాశ్చర్యం!

రేపు, నిన్నగా మారింది. ఎల్లుండి, నేడుగా వచ్చింది - వెళ్ళిపోయింది. ఎదుటి గోడమీద బెల్లులు ఇంకా వేళ్ళాడుతున్నాయి.

# VI

## నాజీగిట్టలు

27, మే, 1943.

నాజీలు సైనికశాసనం ప్రయోగించిన రోజులు, 1942.

ఉదయమంతా హింసించి, యాతనపెట్టి, తిండిపెట్టడానికి కిందికి లాక్కుపోయారు. ప్రతిరోజూ ఇంతే; మేం "సినిమా" అని పేరుపెట్టిన ఆ గదిలోకి తీసుకుపోవడం, పాంక్రాస్‌నుండి తెచ్చిన తిండి పెట్టడం, మళ్లీ నాలుగోఅంతస్తులో విచారణకు ఈడ్చుకురావడం. కాని ఆరోజుమాత్రం మళ్లీ పైకి రమ్మనలేదు.

నిశ్శబ్దంగా కూచుంటారు. తింటారు. బెంచీలనిండా ఖైదీలు భోజనం హడావిడిలో వుంటారు. ఇందులోమాత్రం ఏదో స్వల్పంగా మానవత్వ లక్షణం గోచరిస్తోంది. రేపోమాపో చనిపోడానికి సిద్ధపడుతున్న మేమంతా హఠాత్తుగా ఈ క్షణాన అస్థిపంజరాలుగా మారితే ఎలా వుంటుందో! ఈ చెంచాలు, మూకుళ్ళు మా ఎముకలకు తగిలి గలగలమంటాయిగదూ! ఐతే, ఎవ్వరికీ ఇలాంటి ఆలోచన రాలేదు. ఆ సందేహంకూడా లేదు. ప్రతిఖైదీ మరోవారమో, నెలో, మరికొన్నేళ్ళో జీవిస్తామనే ఆశతో ఆత్రంగా ఆరగిస్తున్నాడు.

ఇదంతా చూస్తుంటే: ఇవాళెంతహాయిగావుంది! అనిపించింది. వెంటనే ఒక విచిత్రమైన వాతావరణం వ్యాపించింది. భయంకరంగా వుంది. పహరాయిచ్చే గార్డుల మొహాలుచూస్తే, ఏదో గొప్ప ప్రమాదం జరిగిందని తెలిసిపోతోంది. అదికూడా వెంటనే రుజువైంది: ఖైదీలందరినీ బైటికి పిలిచారు, పంక్తిగా నిలబెట్టారు, పాంక్రాస్ జైలుకు తెచ్చారు. మధ్యాహ్నమేమిటి! పాంక్రాస్ జైలుకు తిరిగి రావడమేమిటి! నిండా ఒకపూట హింస తప్పడమా! మా మన

స్సులో అనేకప్రశ్నలు సమాధానాలు దొరకక పెనుగులాడు తున్నాయి. ఇది దేవుని వరం కాదుకదా? – కాదు.

వరండాలో జనరల్ ఎలియాష్ కన్పించాడు (అతను మొదట నాజీ లేర్పరిచిన తాత్కాలికప్రభుత్వానికి ప్రధానమంత్రి). అతని కళ్లు ఉద్రేకంతో మెరుస్తున్నాయి. గార్డులపంక్తిలోనుంచి నన్నుచూసి, పక్కగా జరిగివచ్చి, రహస్యంగా వూదాడు:

"సైనికశాసనం ప్రకటించారు."

నా మూగప్రశ్నలకు సమాధానమిచ్చే వ్యవధిలేదు. ఎంత ముఖ్యమైనవార్తలైనా ఖైదీలు త్వరిటిలో అందించుకోగలిగితేనే బ్రతుకు.

మేము పెచెక్ భవనంనుంచి అంత వేగిరం తిరిగివస్తే, జైలు గార్డులే ఆశ్చర్యపోయారు. నన్ను నా గదిలోకి సాగనంపుతున్న గార్డును ఈ విషయం ప్రశ్నించేటంత విశ్వాసం వుందిగనుక – అడిగాను. అదేమిటో, తలవూపి వూరుకున్నాడు. సైనికశాసనప్రయోగం గురించి అతనికేమీ తెలిసినట్టులేదు – లేక, నా ప్రశ్న వినలేదో! ఐనా... ఏమో, వినలేదేమో – నా ఆదుర్దా అంతటితో అణిగిపోయింది

ఆ సాయంత్రమే అతను తిరిగివచ్చి, గదిలోకి పరికించి చూసి:

"నిజమే; జనరల్ హెడ్రిచ్‌ని చంపడానికి ప్రయత్నించారు. అతనికి బాగా గాయాలు తగిలాయి. ప్రేగ్ అంతటా సైనిక శాసనమే"

మరునాటి ఉదయమే మమ్మల్ని మళ్ళీ వరండాలో పంక్తులుగా నిలబెట్టి, పెచెక్ భవనానికి బయలుదేరదీశారు. ఈసారి మాలో కామ్రేడ్ విక్టార్ సినెక్‌కూడా వున్నాడు. పార్టీ కేంద్రకమిటీలో ఇంకా బ్రతికివున్నది ఇతనొక్కడే. ఇతన్ని 1941, ఫిబ్రవరిలోనే అరెస్టు చేశారు. పొడుగ్గా, బక్కపలచగావున్న ఒక నాజీగార్డు పొడుగాటి కాగితంముక్క వొకటి తెచ్చి, అతని కళ్లముందు వూపుతున్నాడు. దానిమీద పెద్ద అక్షరాలతో ఇలావుంది.

"విడుదల ఆర్డరు"

గార్డు వెగటుగా నవ్వుతున్నాడు.

"చూశావా! యూదు వెధవా, ఇంత హింసించినా బ్రతికే వున్నావ్ ... ఇదిగో విడుదల ఆర్డర్! హు ..." అంటూనే, తన మెడచుట్టూ వేలితో గిరిగీసి, నీతల తెగిపోతుందిసుమా; అని తెలియ జెపుతున్నాడు. 1941 లో సైనికశాసనం ప్రకటించినప్పుడు అతని సోదరుడు ఆటోసినెక్‌ను మొట్టమొదట వురితీశారు. 1942 లో మళ్ళీ మొదటివాడు విక్టార్ సినెక్. నాజీలు సరదాగా అన్నట్టు "ఎగురగొట్టడం" కోసం అతన్ని మెథూసెన్‌కు ఈడ్చుకుపోతారు.

ఇప్పుడు పాంక్రాస్‌కు, పెచెక్‌కు మధ్య ప్రతిరోజూ వేలకొలది ఖైదీలు తీర్థయాత్రగా నడుస్తున్నారు. వీరిమీద నాజీ యస్. యస్. సైనికులు "హెడ్రిచ్ హత్యాయత్నం" పేరిట కసి తీర్చుకుంటున్నారు. ఒక అరమైలైనా వెళ్లకముందే, నాజీల తుపాకి మడమల, బాయొనెట్ల దెబ్బలు తిని డజన్లకొలది ఖైదీల వదనాలలోంచి, నోళ్లలోంచి రక్తం చిప్పిలుతోంది. నాతో ప్రయాణంచేసేవాళ్ళ గతి కొంచెం నయం. గుబురుగా పెరిగిన నాగడ్డంచూసి నాజీలుకూడ హాస్య మాడుతున్నారు. అందుచేత ఖైదీలను కొట్టడానికి వాళ్ళకు కాలం మిగలడంలేదు. మేమెక్కినలారీ బయలుదేరగానే, బస్‌లో బెల్టుపట్టుకొని నిలబడినట్లు, నాజీలు నా గడ్డంపట్టుకొని వేళ్లాడుతున్నారు. ఇది నా చిత్రహింసకు నాంది. ఈ చిత్రహింస అప్పుడప్పుడు బయటి రాజకీయపరిస్థితినిబట్టి మారుతున్నా, చివరికి ప్రతిరోజూ ఒకేవాక్యంతో పూర్తవుతుంది:

"రేపటిలోగా బుద్ధితెచ్చుకోకపోతే, నిన్ను కాల్చేస్తాం; తప్పదు."

ఇప్పు డిదేమంత భయంకరంగా వుండదు. ప్రతిసాయంత్రం గార్డులువచ్చి, ఖైదీలను పేర్లుపెట్టి వరండాలోకి పిలుస్తారు. యాభై, వంద, రెండువందలు; బైటికిరాగానే వెంటనే కాళ్లూ చేతులూ బంధించి లారీల్లో పడవేస్తారు. గొర్రెలమందను చేరవేసినట్లు, కొబిలిసీలోవున్న వధ్యశాలకు ఈడ్చుకుపోతారు. ఐతే, వాళ్ళు చేసిన అప రాధ మేమిటి? మొదటిది: వాళ్ళు నేరంచేశారని ఏ రుజువూ దొరక

లేదు. ముందువాళ్లను అరెస్టుచేశారు. ఏ పెద్దకేసుల్లోనూ వాళ్ళ పేర్లెక్కించడానికే అవకాశం దొరకలేదు. ఇక విచారించే దేముంది! ఒకనా డొకాయన, తనతోవున్న తొమ్మిదిమంది స్నేహితులకు ఒక వ్యంగ్యగీతం విన్పించాడు. అందుచేత, ఈ హెడ్రిచ్ హత్యకు రెండు నెలలముందు అరెస్టుచేసి జైల్లో తోశారు. ఇప్పుడు వాళ్ళని కండెమ్డ్ సెల్స్‌లో పెట్టారు. లోపల వున్న వీళ్ళు బైట జరిగిన హత్యకు తోడ్పడ్డారట!

ఆరు నెలల క్రితం: రహస్య కరపత్రాలు పంచిపెడుతున్నదనే నేరం మోపి ఒకామెను అరెస్టుచేశారు. ఆమె అప్పటికీ యిప్పటికీ తప్పు చేశానని వొప్పుకోలేదు. వాళ్ళకు వేరే సాక్ష్యమేమీలేదు. ఐనా, ఆమె తమ్ముళ్ళను, చెల్లెళ్ళనూ; తమ్ముళ్ళ భార్యలను, చెల్లెళ్ల భర్తలనూ కుటుంబం మొత్తాన్నీ పట్టుకున్నారు. ఈ సైనిక శాసనంలోని రాక్షసత్వమే అలాంటిది. ఒక వ్యక్తి నేరం చేసిందనే సందేహంవుంటే, కొన్ని కుటుంబాలనే పూర్తిగా ధ్వంసంచేసేస్తారు.

పొరపాటున ఒక పోస్టుబంట్రోతును అరెస్టుచేశారు. అది తెలుసుకుని అతన్ని విడుదల చెయ్యడానికి వరండాలోకి తెచ్చారు. అప్పుడే వధ్యశాలకు పంపే ఖైదీలపేర్లుగూడా పిలుస్తొంటే అందులో ఇతని పేరుకూడా వచ్చింది. వెంటనే అతన్ని ఆ ఖైదీల పంక్తిలోకి తోసి, లారీలో పడవేసి, తీసుకుపోయి కాల్చేశారు. మరునాడు గ్రహించారు మళ్లీ అది పొరపాటని; ఆ పేరుతోనేవున్న మరొక ఖైదీని చంపివుండవలసిందనీ. ఐతే ఏంచెయ్యడం? వెంటనే ఆ ఖైదీని గూడా కాల్చేశారు. దానితో అంతా చక్కబడింది.

వధ్యశాలకుపోయేవాళ్ళు, శిక్షపడినవాళ్ళా, నిరపరాధులా, అని యోచించే వ్యవధి యెక్కడుంది? పైగా, జెక్‌జాతి మొత్తాన్నీ దగ్ధంచెయ్యదలుచుకున్నవాళ్ళకు, ఇవన్నీ ఆలోచించవలసిన అవసర మేముంది?

ఆ రాత్రి ''విచారణ''నుంచి చాలా ఆలశ్యంగా తిరిగివచ్చాను. గోడదగ్గరే వ్లాడిమిర్‌వాంచూరా, కాళ్ళదగ్గర సామాన్లమూటతో, నిలబడివున్నాడు. ప్రసిద్ధ జెక్‌నవలాకారుల్లో అతనొకడు. అలా నిల

బడి ఎదురుచూస్తోంటే: దాని ఆంతర్యమేమిటో నాకు తెలుసు, అతనికీ తెలుసు. ఒక క్షణంసేపు ఉద్వేగంతో కరస్పర్శ చేసుకున్నాం. పై వరండాలో నిలబడి దూరతీరాలను వెతికే చూపులతో, మా జీవితావధుల చివరలకేసిచూస్తూ – అలా నిలబడిన అతని వ్యక్తి ఇప్పటికీ నా కళ్ళకు కట్టినట్లుంటుంది. కరస్పర్శ చేసుకున్న తర్వాత అరగంటకే అతనిపేరు పిలిచారు. అంతే...

తర్వాత, కొద్దిరోజుల్లోనే మిలాష్ క్రాస్నీ ఆ గోడపక్కనే నిలబడ్డాడు, అలాగే చూశాడు. ఈ విప్లవోద్యమం సృజించిన యోధులలో అతనొకడు. గత అక్టోబరులోనే అరెస్టయినాడు. చిత్రహింసలతో, ఏకాంతవాసంతో చివికిపోని గుండె అతనిది. గోడకు ఒకపక్కగా వొరిగి, తనవెనుకవున్న గార్డుకు ఏదో ప్రబోధం చేస్తున్నాడు. హఠాత్తుగా నేను కనిపిస్తే, చిరునవ్వుతూ, తలపంకించి వీడ్కోలిచ్చి మళ్ళీ గార్డుతో మాట్లాడుతున్నాడు:

“ఈ హత్యలవల్ల మీకు రవంతైనా ప్రయోజనం లేదు. ఇంకా అనేకవేలమందిమి చనిపోతాం. కాని, చివరికి మీరు ఓడిపోక తప్పదు...”

ఒకరోజు మధ్యాహ్నం, పెచెక్ భవనం క్రింది అంతస్తులో మేం భోజనానికి సిద్ధపడుతున్నప్పుడు జనరల్ యిలియాషను తెచ్చారు. అతని చంకలో వార్తాపత్రిక వుంది. అదితీసి చిరునవ్వుతో చూపిస్తున్నాడు. అతను ఎనిమిదినెలలనుంచీ ఖైదులోవున్నా, అతనికీ, హెడ్రిచ్ హత్యా యత్నానికీ సంబంధం వున్నదని నాజీలు ప్రకటించారు.

“బూటకం!” అంటూ, తన దుర్గతికి వేదనపడుతూ భోజనం ప్రారంభించాడు.

ఆ సాయంత్రం మాతోపాటు పాంక్రాస్ జైలుకు వస్తూ, ఈ ఆరోపణను గురించి ఎగతాళిగా మాట్లాడాడు. కాని, తర్వాత గంటైనా గడవకముందే, అతన్ని బైటికితీసి కొబిలిసీ మారణహోమానికి పంపించేశారు.

రోజు రోజుకూ శవాలు గుట్టలు పెరిగిపోతున్నై. ఇప్పుడు

బెఖ్హి పెట్టడం పదుల్లో వందల్లోకాదు - వేలలో. నరరక్తపురుచితో ఈ నాజీ రాక్షసులకు నోరూరుతోంది. రాత్రి చాలాసేపటివరకూ, ఆఖరికి ఆదివారాలు కూడా "పని" చేస్తున్నారు, అందరూ ప్రత్యేక సైనికులు ధరించే యస్. యస్. యూనిఫాంలు వేసుకుంటున్నారు. ఇది వాళ్ళకొక ఉత్సవం; చిత్రవధలు జరిపే పండుగ. నిర్దాక్షిణ్యంగా కార్మికులను, బడిపంతుళ్ళను, రైతులను, రచయితలను, అధికారులను హత్య చేస్తున్నారు. నిర్వివేకంగా పురుషులను, స్త్రీలను, పసిపాపలను తెగ నరుకుతున్నారు. కుటుంబాలనే పూర్తిగా చిత్రవధ చేస్తున్నారు. గ్రామాలనే తగలబెట్టి ధ్వంసం చేస్తున్నారు. "మృత్యువు" తుపాకుల కింకరులతో ప్లేగ్ వ్యాధిలాగ దేశమంతా వ్యాపించి, విచక్షణా రహితంగా పౌరులందరినీ పొట్ట పెట్టుకుంటోంది.

ఈ భయంకర మృత్యువు విలయతాండవాన్నికూడ ధిక్కరించి ప్రజలింకా జీవిస్తూనే వున్నారు.

నమ్మలేం! కాని, ప్రజలింకా బ్రతుకుతోనే వున్నారు. ఆరగిస్తున్నారు. నిద్రపోతున్నారు. ప్రేమిస్తున్నారు. పనిచేస్తున్నారు. మృత్యువుతో సంబంధంలేని ఒక వెయ్యి ఊహాపోహాలతో ఆలోచిస్తున్నారు. వీటన్నిటివెనుకా, వాళ్ళ గుండెల్లో ఒక భీభత్సం తాండవిస్తోంది; భరిస్తున్నారు. కాని, తలవొగ్గడంలేదు, గుండె జారిపడిపోవడంలేదు.

సైనిక శాసనం అమలులోవున్న మధ్యకాలంలోనే,నా విచారణాధికారి నన్ను కారులో ఎక్కించుకొని బ్రానిక్ అనే చోటికి తీసుకుపోయాడు. ప్రకృతి సౌందర్యంతో విలసిల్లే జూన్ నెల లిండెన్ చెట్ల పరిమళంతో, అకేసియాపూల గుబాళింపుతో వాతావరణం తియ్యగావుంది. ఆదివారంసాయంత్రం అది.షికారువెళ్లి తిరిగివస్తున్న ప్రజాప్రవాహంతో వీధి క్రిక్కిరిసిపోయింది. రోజంతా సూర్యరశ్మి కౌగిలిలోగడిపి, నదిలో ఈది, ఆడుకొని, ప్రేయసుల కౌగిళ్ళలో కాగి, సాయంత్రానికి సంతోషంతో కేరింతలుకొడుతూ, సుఖాస్పదమైన అలసటతో వూగుతూ తిరిగి వస్తున్నారు. అప్పుడప్పుడొక నాజీ సైనికుడు మృత్యుస్వరూపం లాగ తుపాకి గురిచేసుకుని వెడుతూ కన్పించినా, వాళ్ళ ముఖాలలో

మృత్యువు చిహ్నాలు మచ్చుకైనా లేవు. ఒక్కొక్కసారి భయపడి చెవులపిల్లుల్లాగ గభాలున పక్కకు నక్కుతున్నారు. చెవులపిల్లులు! అందులో ఎవరో వొకరిని పట్టిగుంజి, నాజీ రాక్షసుడు విరుచుకు తింటాడు: క్షణంసేపు పక్క కొదిగినా, మళ్ళీ గందరగోళంగా రహ దారినిండా క్రిక్కిరిసి నడుస్తూ, ఆనందంతో ఉజ్జీవంతో ఉప్పొంగి పోతూంటారు - ప్రజలు.

ప్రతిక్షణం ఉక్కిరి బిక్కిరిచేస్తున్న చెరసాలలోంచి, హఠాత్తుగా మహాప్రజా ప్రవాహంలోకిరాగానే నాకీ మధురానుభవం దుస్సహంగా తోచింది.

అలావుండవలసిందికాదు, న్యాయానికి, ఇక్కడ వెలుగుతున్నదీ జీవితమే, అక్కడ వొదిగివున్నదీ జీవితమే. ఎంత దారుణంగా అణచి వేయాలని ప్రయత్నించినా, జీవితం అజేయమైనది. ఒక మూల నశిస్తే, వందచోట్లనుంచి ఉద్భవిస్తుంది. అది జీవితం! ఎప్పుడూ మృత్యువుకంటె బలవత్తరమైనదే! అందులో దుస్సహమైనదేముంది?

ఐతే, ఈ ఖైదులో గదుల్లో కుళ్లుతున్న మేము, మృత్యువు ముఖాన బ్రతుకుతున్న మేము, శక్తిసామర్థ్యాలలో బయటి ప్రజలకంటె భిన్నులమా? ముమ్మాటికీకాదు.

నేను వెళ్లే పోలీస్‌కారులో అప్పుడప్పుడూ ఒక మంచి గార్డు వుండేవాడు. ఆ యిరుకు అల్లికలోంచి వీధిలోకి చూడనిచ్చేవాడు. దుకాణాలు, ప్రదర్శనస్థలాలు, పూల అంగళ్లు, వచ్చేపోయే జనం, స్త్రీలు - అంతా కన్పించేది. నేనొకసారి సరదాగా అనుకున్నానుగదా: ఎప్పుడైనా వరుసనే తొమ్మిది జతల స్త్రీల పాదాలు లెక్కపెట్టగలిగితే ఆరోజు నన్ను వురితీయరని. ఇకను, వచ్చేపోయేజనం పాదాలు లెక్క పెట్టడం మొదలెట్టి, చక్కనివి ఏరుతూ వికారమైనవి వదిలేస్తూ, అలాగ; ఆపాదాలే నాసర్వస్వం ఐనట్టూ, నాప్రాణానికి ప్రమాద మేమీ లేనట్టూ ఆలోచిస్తున్నాను.

నన్ను సాధారణంగా ఖైదుకు ఆలస్యంగా చేరవేసేవాళ్లు. నే నసలు తిరిగి వస్తానో రానో అని "తాత" కుంగి పోతూండేవాడు. నేను రాగానే ఆప్యాయంగా కౌగలించుకునేవాడు. గత రాత్రి కొబిలిసీలో

ఎవరెవరిని కాల్చేశారో... మొదలైన వార్తలన్నీ నాకు తెలిసినంత వరకూ చెప్పేవాణ్ణి; తర్వాత, ఆకలికి తట్టుకోలేక, తప్పనిసరియై, పుచ్చిపోయిన కూరగాయలతో వండిన పులుసూ, రొట్టె తినేవాళ్ళం. ఒక్కొక్కసారి సంతోషంగా సంగీతం ప్రారంభించేవాళ్ళం. విచారంతో కోపంతో కుంగిపోయివుంటే పావులు తీసి ఆడుతూ, ఒక క్షణంసేపు లోకాన్ని మరిచిపోయేవాళ్ళం. ఏగంటలోనైనా నాగదిని తెరవవచ్చు, కొబిలిసీలో కాల్చివెయ్యడానికి బైటికి లాక్కుపోవచ్చు : దుస్సహమైన ఆఘడియల్లో లోకాన్నెలా మరవడం ?

"నీవు- ఊ, నీవుకూడా, బైటికినడు. సామాన్లన్నీ మూట గట్టుకుని బయలుదేరు. ఊ, త్వరగా!"

కాని, ఆరోజుల్లో మమ్మల్నెవరినీ పిలవలేదు. ఆ భీభత్సాన్నంతా స్వయంగా అనుభవిస్తూనే బ్రతికాము. ఆరోజుల్లో మాభావాలు, ఇప్పుడు తలుచుకుంటే మాకే ఆశ్చర్యం వేస్తున్నది. మానవ జీవితాలెంత విచిత్రమైనవి - దుస్సహ బాధలనుకూడా సహించి నిలబడతాయిగదా!

కాని అలాంటి ప్రమాద పరిస్థితులు మా వ్యక్తిత్వాలపై ముద్ర వేశాయి. మా మేధస్సులో ఏదోఒకమూల ఆభీకరస్మృతులు చుట్ట చుట్టుకొని పడుకుని వుంటాయి, తర్వాత తర్వాత బ్రతికి బైటపడితే, విప్పారి వ్యాపించి వేధించి వెర్రెత్తిస్తాయి. లేక మాతోపాటు అవీ, రుద్రభూమిలో బూడిదగానో, ప్రాణబీజాలతో నాటి పెంచిన పూల తోటలుగానో మార్పుపొందుతాయి.

ఈ ప్రాణబీజాలు అత్యుత్తమమైనవి, అమూల్యమైనవి. ఇవి తిరిగి ఏనాడో మొలకలెత్తి పుష్పించి జీవనోద్వేగంతో ప్రకాశిస్తాయి.

# VII

## సహచరులు : శత్రువులు [2]

ఖైదులో రెండురకాల జీవితాలున్నాయి. ఒక రకం చీకటి గదుల్లో నిర్బంధింపబడి, బాహ్యప్రపంచంతో సంబంధం లేకుండా — ఐనా, నిరంతర పోరాటంద్వారా సాధించే ఆశయంలో బైటప్రజలతో ఐక్యమై వుండేది. రెండవది : యూనిఫాంలు ధరించి వరండాలలో నిత్యం కాపలాకాస్తూ, గోడల నీడల్లో పచార్లుచేస్తూ వుండేది. నీచులతో, అల్పులతో నిండివున్న ఈరకం జీవితం, మాకంటె ప్రపంచానికి దూరంగావుంది. ఇప్పుడిందులో కొందరువ్యక్తుల జీవితాలుకూడా వర్ణిస్తాను.

ఇందులో కొందరికి పూర్వ వృత్తాంతాలున్నాయి, కొంత చరిత్రవుంది. అలా లేకపోతే, నేను పరిశీలన చేసి గ్రహించవలసిన అవసరమే వుండదు. లేకపోతే, ప్రతి నిత్యం మాగుండెలపై తాండవిస్తున్న వాళ్ళ అధికార ప్రదర్శనం మాత్రమే కన్పించి, నేపథ్యంలో వున్నవేవీ మాకర్థమయ్యేవికాదు. ఒక సంవత్సరం, అర్థ సంవత్సరం వరకూ అలాగే అనిపించింది. కాని, ఇప్పుడిప్పుడూ ఈ ఉద్యోగులు నిర్మించిన కంచుగోడల్లో పగుళ్లు కన్పిస్తున్నాయి. బాధలతో కృశించే వదనాలు, ప్రశ్నలతో వేధించబడే వదనాలు...ఎన్నైనా ఇందులోంచి బైటికి తొంగి చూడటానికి అవకాశంవుంది. ఈవదనాలు మానవులవే. ఈఅధికార్ల వదనాలపై ఫాసిస్టు క్రౌర్యం స్పష్టంగా ముద్రితమైవుంది. అందులోంచే వాళ్ళలోని మానవత్వ చిహ్నాలు కూడా వెలికుబుకుతున్నాయి. సాధారణంగా ఈచిహ్నాలు బహు స్వల్పంగానే కన్పిస్తాయి; కొద్ది మందిలో మాత్రం మానవత్వ రేఖలు స్ఫుటంగా ఇంకా గోచరిస్తున్నాయి. వీటి తరతమ భేదాలనుబట్టి, అధికార్లలో తరగతులేర్పరచవచ్చు. కొందరిలో మానవత్వం ఇంకా

వికసించేవుంది. ఫాసిస్టు హత్యాకాండ లేకపోయినా వీరిలోనే మానవత్వం ప్రదర్శితమయ్యేది.

ఖైదు అనేది ఒక దుస్సహమైన సంస్థ. అందులోనూ, గదుల్లోని సాధక బాధకాల కంటె, గదులముందు వరండాల్లో జీవితం దుర్భరంగా వుంటుంది. గదుల్లో పరస్పర స్నేహసంబంధాలు దృఢంగా వుంటాయి. ఆ సౌభ్రాతృత్వం వర్ణనాతీతమైనది. సంగ్రామంలో ప్రథమ శ్రేణిలో నిలబడి పోరాడే వారిలో మాత్రమే అలాంటి సౌభ్రాతృత్వం వర్ధిల్లుతుంది. ఒకక్షణంసేపు నా బ్రతుకు నీగుప్పిట్లో వుంటే, మరుక్షణమే నీప్రాణం నాచేతిలో వుంటుంది మరి! అందుకనే ఆస్నేహం అంత అగాధంగా వుంటుంది. కాని, ఈ ఫాసిస్టు ఉద్యోగుల్లో స్నేహితమనేది అరుదు. అది అసాధ్యం. ఒకరిమీదవొకరు చాడీలు చెప్పుకోవడం, వెన్నులో పొడవడం, అసూయ – ఇవన్నీ వాతావరణాన్ని విషపూరితం చేస్తాయి. అందులో నిజంగా సాహచర్యం అభిలషించే ఉత్తములెవరైనా వుంటే, వాళ్లు స్నేహితంకోసం ఖైదీలనే పరిచయం చేసుకోవాలి. ఉద్యోగులు పరస్పరం అధికారపూర్వకంగా "కామ్రేడ్స్" అనిపిలుచుకున్నా, ఒకరంటే ఒకరికి తగని భయం; ద్వేషం.

చాలాకాలంవరకూ ఈ ఉద్యోగులపేర్లే మాకు తెలియలేదు. అదంత విశేషంకాదు, ఎందుచేతనంటే వాళ్లందరికీ మేమేపేర్లు పెట్టి ప్రయోగించేవాళ్లం. కొన్ని పేర్లు మేం పెట్టినవే; మరికొన్ని పేర్లు మాకు పూర్వం ఖైదులో వున్నవాళ్లు ఏర్పరిస్తే మేం వాడేవి. ఇందులో కొందరిని మళ్ళీ ఒక్కొక గది ఒక్కొకపేరుపెట్టి పిలిచేది– ఈజాతి ఒకవ్యక్తిత్వమంటూ లేక కాకీ, నెమలీ కాని రకం. ఈ ఉద్యోగులే ఒక గదిలో ఖైదీలకు కొంచెం సౌకర్యం యిచ్చినా, పక్కగదిలో ఖైదీలను దారుణంగా హింసించేవారు. ఒక గదికీ ఒక ఉద్యోగికీ రోజుకు కొన్ని సెకండ్లు సంబంధం వుంటుందేమో! ఈ స్వల్ప సంబంధమే వాళ్ల మనస్తత్వాలను గ్రహించడానికి ఆధారం. అందుకే వాళ్ళకు పేర్లుపెట్టడం, ఒక్కొకసారి అన్నిగదుల్లోవాళ్ళూ పరస్పరం సంప్రదించుకోకుండానే ఒక ఉద్యోగికి విచిత్రంగా ఒకే పేరుపెడతారు.

ఈవ్యక్తు లెవరో ఒకసారి గమనిద్దాం. ఇటు, ఈవ్యక్తులకేసి చూడండి! వీళ్ళందరూ హఠాత్తుగా ఇక్కడ గుమిగూడిన మూక కాదు; ఫాసిస్టుల రాజకీయసైన్యంలో ఇదొక భాగం. ప్రభుత్వ భవనానికి మూల స్తంభాలుగా వున్న ఈవుద్యోగులందరినీ జాగ్రతగా ఎన్నిక చేసి నియమించారు.

స్మార్ట్ :

ఇతను జెకాబుడీజోవిసీ ప్రాంతంలో సారాయి ఫాక్టరీలో డ్రైవర్‌గా పనిచేసేవాడు. మహావదరుబోతు, కాని జాలిగుండె. మాకు తిండితెచ్చి పెట్టేవాడు. ఎప్పుడు గదిలో ప్రవేశించినా హాయిగా నవ్వేవాడు. ఒక్కసారైనా మాకు కష్టం కలిగించి ఎరుగడు. గది బైట చాటుగా నిలబడి ఖైదీల సంభాషణలు వినడంకాని, పైఅధికార్లకు చాడీలుచెప్పి ఖైదీలను హింసించడం కాని – ఇలాంటివేవీ ఇతని జీవితంలో ఎరుగడు.

కోక్లార్ :

ఇతను కూడా స్మార్ట్‌వున్నచోటే, కూలిపని చేసుకుని జీవించేవాడు. ఇలాగ, సుడేటన్ ప్రాంతంనుంచి వచ్చిన జర్మన్ కూలీలిక్కడ అనేకమందివున్నారు. మార్క్స్ ఒకసారి అన్నాడుగదా: “కార్మికులు ఒకవర్గ సంఘటన ద్వారా తమ చారిత్రక కర్తవ్యాన్ని ఎలా నెరవేర్చుతున్నారాఅనేది ముఖ్యం కాని, విడివ్యక్తిగా ఒకొక్కకూలీ ఏమనుకుంటున్నాడో ఏంచేస్తున్నాడో అనేది ముఖ్యంకాదు.” ఇక్కడ పని చేస్తున్నవారు ‘కార్మికవర్గ కర్తవ్యం’ అనేమాటే విని ఎరుగరు. వాళ్ళు సహజంగా కలిసి పోవలసిన వర్గంనుండి వేరైపోయి, దానికి ప్రతికూలంగా పనిచేస్తూ, ఇప్పుడు ఏవర్గానికీ చెందకుండా మధ్యలో వేళ్ళాడుతున్నారు. బహుశా చివరికి వాళ్ళశరీరాలు కూడా ఏ వురిత్రాళ్ళనుంచో వేళ్ళాడతాయి.

సులభంగా డబ్బుగడించడంకోసం కోక్లార్ నాజీలలో చేరాడు. కాని, తానెన్నడూ ఊహించనంత క్లిష్టపరిస్థితుల్లో చిక్కుకున్నాడు. అప్పటినుంచీ అతని ముఖాన సంతోషం సమసిపోయింది. నాజీలు

గెలుస్తారుకదా అని అంచనా వేసుకున్నాడు. చివరకది చచ్చిన గుర్రం తరఫున పందెంవేసినట్లయింది. గుండె చెదరిపోయింది. ఇప్పుడు వరం డాలో రాత్రివేళ నిశ్శబ్దంగా పహరాయిస్తూ, దీపాలకాంతిలో మెరిసే దుమ్ములో కంగారుగా అడుగులువేస్తూ తీస్తూ, ఆపాదముద్రలలో తన భయంకర భావాలను కూడ విడుస్తున్నాడు.

ఒకసారి దుమ్ములో తన కాలివేళ్ళతో గీస్తూ, అవ్యక్తంగా "ఇదంతా కుళ్ళిపోతోంది" అని వ్రాశాడు. ఆత్మహత్య చేసుకుందా మని యోచించాడు.

పగటివేళ, ఖైదీలను గార్డులను తరుముతూ, వెర్రిగా కేకలు వేస్తూ – అలాగ తన ధైర్యాన్ని నిలబెట్టు కుంటున్నాడు.

రోస్లర్:

పొడుగ్గా పల్చగా వుంటాడు. బొంగురుగొంతు. ఇక్కడ మన సార నవ్వగలిగిన కొద్దిమంది వ్యక్తుల్లో అతడొకడు. జాబ్లొనెజ్ అనే చోట బట్టల మిల్లులో కూలిపని చేసేవాడు. అప్పుడప్పుడు మా గది లోకి వచ్చి గంటలకొద్దీ చర్చిస్తుంటాడు.

"నేనిందులో కెలావచ్చానా? సరిగ్గా పదేళ్లనుంచీ నాకొక ఉద్యోగమంటూ లేదు. వారానికి ఇరవై క్రౌన్లతో బండెడంత సంసా రాన్ని పోషించాలంటే ఎవరితరం. అప్పుడు వాళ్లొచ్చి: "మేం నీకు పని చెపుతాం, మాతోరా" అని అన్నారు. నేను వెళ్లాను. మాకందరికీ పని ఇప్పించారు.ఇప్పుడు తిండికి గడుస్తోంది; ఆఖరుకు ఒక ఇల్లంటూ ఏర్ప డింది. బ్రతకడానికి సాధనం లభించింది. సామ్యవాదమా? ఊహూ, అదేమంత మంచిదికాదు. అదేమిటో అనుకున్నానుగాని, మేమిపు డున్నస్థితే నాకు బాగుంది.

"బాగులేదూ? యుద్ధం సంగతా? నేనేం స్వయంగా యుద్ధాన్ని రావాలని కోరుకోలేదుగద? నాకొర్కె ఇతరులంతా నాశనంకావాలని కాదు; నేను బ్రతికితే చాలునని.

"ఏమిటీ? నాకిష్టమున్నా లేకపోయినా నాచర్యలే యుద్ధానికి సహాయం చేస్తున్నానయంటారా? అందుకు నేనేం చెయ్యను? ఇక్కడెవరి

నైనా నేను బాధ పెట్టానా? నేనుపోతే ఈ స్థానంలో మరొకడొస్తాడు; బహుశా నాకంటె దుర్మార్గుడు. అట్లా జరిగితే ఎవరికి ప్రయోజనం? యుద్ధమైన తర్వాత మళ్ళీ ఫ్యాక్టరీకి పోతాను...

"ఎవరు గెలుస్తారని మీ అంచనా? మేం కాదూ? మీరా! అప్పుడు మాగతేమాతుంది?

"చస్తామా? అన్యాయం. ఇలా జరుగుతుందని ఎప్పుడూ అనుకోలేదే."

చర్చముగించి లేచి, నిట్టూర్పుతూ, అడుగులువేస్తూ వెళ్ళిపోతాడు!

మళ్ళీ ఒక అరగంటలో తిరిగివచ్చి, ప్రశ్నార్థకంగా చూస్తూ, 'సోవియట్ యూనియన్‌లో జీవితం ఎలావుంటుంది?' అని అడుగుతూ నిలబడతాడు!

స్మిటోన్ :

గ్రోస్ రచించే వ్యంగ్యచిత్రాలలో నాజీ సైనికుడు అచ్చం యిలాగేవుంటాడు. గూనితో వంగిన శరీరం, పాలిపోయిన ముహం, జీవంలేని కళ్లు. ఇతని జన్మస్థలం తూర్పు ప్రష్యాలో లిథూనియా సరిహద్దుదగ్గరవుంది. ఆవుల్ని పెంచి, పాలమ్ముకుని బ్రతికేవాడు. కాని, ఆవులకుండే వినమ్రత ఇతనిలో మచ్చుకైనా కనపడదు. అధికారులంతా ఇతనిలో నాజీలు మెచ్చుకునే లక్షణాలన్నీ వున్నాయని ఆనందించేవారు. ఏపనైనా ఖచ్చితంగా చేస్తాడు. కర్కశుడు. లంచాలకు లొంగడు. రేషన్లు పంచిపెట్టే స్త్రీ పరిచారకులు తనకు రొట్టెలు అదనంగా యివ్వాలని బలవంతం చెయ్యడు, కాని...

ఎవరో ఒక జర్మన్ విజ్ఞానవేత్త, ప్రాణుల బుద్ధికుశలతను అంచనా వెయ్యడానికి, ఆప్రాణి ఎన్ని "మాటలు" నిర్మించ గలుగుతుందో లెఖ్ఖవేశాడు. ఆలెఖ్ఖప్రకారం, మన యిళ్లలో తిరిగే పిల్లి మొత్తం 128 "మాటల" కంటె నిర్మించలేకపోవటంవల్ల, అది అనేక ప్రాణులకంటె అథోగతిలో వున్నదని నిర్ణయించాడు. ఆహా! నిజంగా

స్కెటోన్‌తో పోల్చితే ఆసిల్లి జీనియస్ అనే చెప్పాలి. అతనెప్పుడుగానీ మూడు మాటలకంటె మించి ప్రయోగించడుగదా :

"ఇదిగో! నిన్నే! చూడు!"

అతని తత్వమే అంత. కన్పించిన ప్రతి ఖైదీని హింసించేవాడు. నిర్దాక్షిణ్యంగా హత్య చేసేవాడు. ఒకసారి ఒకగదిలో అప్పటికే గాయాలతో నీరసించి చావుకు సిద్ధంగావున్న ఖైదీని బలంగా కొట్టాడు. ఆఖైదీ క్రిందపడిపోయి, పక్షవాతంవచ్చి అల్లల్లాడి పోతున్నాడు. వెంటనే స్కెటోన్ మిగిలిన ఖైదీలందరినీ ఆ క్షతగాత్రుని వణుకు ననుసరించి గుంజిళ్లు తీయమని ఆజ్ఞాపించాడు. క్రమంగా ఆఖైదీలో బలం తగ్గి కొద్ది సేపటిలోనే వణుకు ఆగి, చనిపోయాడు. ఇటు మిగిలిన ఖైదీలు గుంజిళ్లుతీస్తూ అతని దుర్గతిని చూస్తూకూడా సహాయం చేయలేక పోయారు. అంతసేపూ స్కెటోన్ అక్కడే నిలబడి, అధికార గర్వంతో పొంగిపోతూ నడుమున చేతులుపెట్టుకుని, "ఈ క్లిష్టసమస్య నెంతసులభంగా పరిష్కరించానో చూడండి!" అన్నట్టు తల పంకించాడు.

చిట్టచివరికి ఈ కఠినాత్ముడికికూడా గుండె పగిలింది. ఒకనెల రోజుల క్రితం ఇతనూ, కామ్రేడ్ కె— జైలుఆఫీసులో కూచుని వున్నారు. ఉన్నపరిస్థితినంతా కామ్రేడ్ కె— తెలియ చెపుతున్నాడు. విసుగూ విరామం లేకుండా కొన్ని గంటలసేపు బోధించిన తర్వాతగాని, స్కెటోన్‌కు అంతుపట్టలేదు. వెంటనే స్కెటోన్ లేచి నిలబడ్డాడు. తలుపు తెరిచి జాగ్రతగా కిందికిచూశాడు. బైట నిశ్శబ్దంగా వుంది. అర్ధరాత్రివేళ కారాగారం గాఢనిద్రలో మునిగివుంది. తలుపు మూసి, భద్రంగా తాళంవేశాడు. కుర్చీలో కూలబడి పోయాడు:

"ఐతే, నీ వుద్దేశం...?"

పిడికిలిమీద గడ్డంవాల్చి ముందుకు వంగాడు. అంత లావు శరీరంలో మినుకుమినుకు మంటున్న అంతచిన్న అంతరాత్మ ఇప్పుడు తీవ్రంగా వేధించ ప్రారంభించింది. ఎంతోసేపు అలాగ కూచున్న తర్వాత, తలఎత్తి, నిర్జీవంగా ఇలా అన్నాడు:

"నువుచెప్పేది అక్షరాలా నిజం. మేం గెలవలేం..."

ఆక్షణంనుంచి ఖైదీల కిక అతని కేకలు వినిపించలేదు! కొత్త ఖైదీలకు అతని పిడికిలిపోట్లు తగలలేదు!

పాంక్రాస్ జైలు డైరెక్టరు:

ఇతను హిట్లర్ ప్రత్యేక సైన్యంలో సభ్యుడు. విగ్రహించిన్నది. ఎప్పుడూ నీటుగా యూనిఫాం వేసుకుని, ప్రతి అంగుళంలోనూ తన ఆత్మసంతృప్తిని ప్రదర్శిస్తుంటాడు. కుక్కల పెంపకం, వేటాడటం, వ్యభిచారం – ఇవీ అతని కత్యంత ప్రియమైన కార్యాలు. వీటి విషయం అలావుంచుదాం.

అతని ప్రధాన లక్షణాలు – ఖైదీలకు సంబంధించి నంతవరకూ మొరటుతనం, కాఠిన్యం. చెడి బాగుపడిన నాజీలెంత అహంకారంతో వుంటారో ఇతన్నిచూస్తే తెలుస్తుంది. తన పదవికోసం ఎన్నిప్రాణాల నైనా బలిచేస్తాడు. పోలెండ్ నుంచి వచ్చాడు. పేరు సోపా. ఇంతకు ముందు ఒక కర్మాగారంలో పనిసేర్చుకునేవాడట. కాని, ఆ సాధు వృత్తిలోవుండే వినమ్రత ఏ మాత్రం కన్పించదు. చాలాకాలం క్రితం హిట్లర్ సైన్యంలో చేరాడు. పొగడ్తలతో, కుట్రలతో, ఈ జైలుకు సర్వాధికారైనాడు. ఖైదీలు, ఉద్యోగులు, పిన్నా పెద్దా- ఎవరన్నా అతనికి లక్ష్యంలేదు.

ఎంతసేపూ స్వార్థం గురించే ఆలోచన, స్వార్థంతోనే ఈపదవి సంపాదించుకున్నాడు. స్వార్థంకోసమే ఈప్రభుత్వానికి లోబడి వుంటాడు.

ఫాసిస్టుల పతనం అతన్ని అధోగతికి తోస్తుంది. అతని పేరాసను, అన్యాయార్జితాన్ని తుదముట్టించుతుంది! దర్జాగా కట్టుకున్న భవనాన్ని, డాబుసరిగా వేసుకు తిరిగే బట్టలతోసహా దగ్ధంచేసి తీరుతుంది. ఉరి తీయబడిన ఖైదీల దుస్తులుకూడా కాజెయ్యటానికి వెరవని నీచుడు!

అంతే, అలాగే, అతను నశించిపోతాడు!

డాక్టర్ వీస్నర్:

పోలీస్‌మాస్టర్ వీస్నర్, పాంక్రాస్ రంగస్థలంలో నాటక మాడే ఒక విచిత్రవ్యక్తి. అప్పుడప్పుడూ ఇతనిక్కడ ఉండతగినవాడు

కాదనిపిస్తుంది. హాస్పిటల్ విడిచిపెట్టడంటే, చిన్న చిన్న అడుగులు వేసుకుంటూ, మోతగా వరండాలనిండా తిరుగుతుంటాడు – తనలో తాను మాట్లాడుకుంటూ, పరిసరాలను పరిశీలిస్తూ. అతనెన్నో రహస్యాలు గ్రహిస్తాడు. కాని, ఎన్నడూ చాడీలు చెప్పడు, ఎవరి మీదా నేరమారోపించడు. గది అంతా పొగతో నిండివుంటే, అందరికి వినపడేలాగ నిశ్వసిస్తూ వచ్చి అంటాడుగదా:

"హు! గదుల్లో పొగ తాగుతున్నారు," పెదవులు బిగించుకుని, "పొగ తాగడం నిషేధించారు" అంటాడు.

కాని, వెళ్ళి రిపోర్టు చెయ్యడు. ఏదో దుర్భర శోకంతో వేగిపోతున్నట్లు అతని వదనం ముడుతలుపడి విషాదమయంగా వుంటుంది. ఈఫాసిస్టు ప్రభుత్వంతో తెగతెంపులు చేసుకోవాలని వాంఛిస్తున్నాడని అతని వదనంలో స్పష్టంగా తెలుస్తుంది. వాళ్ళు ఖైదీలను చిత్రహింస పెట్టడం, తాను వైద్యం చెయ్యడం! అతనికి ప్రభుత్వంలో ఎంతమాత్రం విశ్వాసం లేదు. ఈప్రభుత్వం శాశ్వతంగా సాగుతుందనే నమ్మకం లేదు. ఎప్పుడూ లేదు. కాని, పూర్తిగా అటో, ఇటో మొగ్గే సంకల్పం గాని, శక్తిగాని లేదు.

ప్రాణభయంతో వొదిగిపోయే స్వల్పాత్ములైన పౌరులలో ఇతనొకడు. ఒకపక్క ఫాసిస్టుల క్రౌర్యానికి బెదురుతో, మరొకపక్క తర్వాతేం జరుగనున్నదో అనే ఆదుర్దాతో ఒంటరిగా మధ్యనిలబడి వెర్రిచూపులు చూస్తున్నాడు. తన ప్రశ్న కెక్కడైనా సమాధానం లభిస్తుందేమోనని వెతుకుతున్నాడు. తన కెక్కడా పరిష్కారమార్గం గోచరించడంలేదు. బోనులో పడ్డ – ఎలుకగూడా కాదు–చిట్టెలుక! దుస్సహమైన బోను!

"కొలిన్":

---

సైనిక శాసనం అమలులోవున్న రోజులు. ఒకనాటి సాయంత్రం నాజీ యూనిఫాంలోవున్న ఒక గార్డు నన్ను గదిలోకి పంపుతూ జేబులన్నీ నిర్లక్ష్యంగా వెతుకుతున్నాడు.

"ఎలాగడుస్తోంది జీవితం?" అన్నాడు రహస్యంగా.

"ఏమో నాకేం తెలుసు? రేపు కాల్చేస్తామని చెప్పారు." అన్నాను.

"ఆ మాటకు భయపడ్డావా?"

"ఊహు! ఆమాట ఎప్పుడో అంటారని ఎదురు చూస్తున్నాను."

ఒక క్షణంసేపు అజాగ్రతగా నా కోటు మీద చేతులుపోనిచ్చి తడిమాడు, మళ్లీ అందుకున్నాడు:

"ఏమో! కాల్చేస్తారేమో! రేపుగాకపోయినా తర్వాతైనా! బహుశా అసలు కాల్చరో? కాని, ఇలాంటి రోజుల్లో... దేనికైనా సిద్ధపడి వుండటం మంచిది..."

తర్వాత మౌనంగా వున్నాడు.

"ఒకవేళ నిజంగానే కాల్చేస్తారేమో! బైట ఎవరికైనా కబురు పంపుతావా?...లేకపోతే, ఏమైనా వ్రాసి పంపుతావా? ఇప్పుడు ప్రకటించటానికి కాదుసుమా, భవిష్యత్తులో ప్రచురించుకోటానికి. నువ్వెలా పట్టుబడింది, ఎవరైనా ద్రోహంచేశారో, లేక ఎవరెవరెలా ప్రవర్తించారో – అన్నీ. నీకు తెలిసిన రహస్యాలు నీతోనే మరుగుపడి పోకుండా..."

నేను రాయడానికి యిష్టపడతానా అనా? అంతకంటే నాకు కావలసిందేముంది!

ఒక క్షణంలో అతను పేపరూ, పెన్సిలూ తెచ్చియిచ్చాడు. ఎవ్వరెంత శోధించినా బైటపడకుండా వాటిని భద్రంగా దాచేశాను.

ఐతే. చాలాకాలం వరకూ వాటిని ముట్టుకోలేదు.

ఈవ్యక్తుల్లో ఇంత ఔన్నత్యంవుందని నమ్మ శక్యం కాకుండా వుంది – నమ్మడం అసాధ్యం. అరెస్టయిన కొన్ని వారాల్లోనే, అధికార మదాంధకారంలో పూడిపోయిన ఈఖైదులో, అందులోనూ యూని ఫాంలో వున్న మనిషంటే దూషించే, హింసించే వాళ్ళు అని తేలి పోయిన తర్వాతకూడా–వాళ్ళలో ఈ "మానవుడు" కన్పించడం ఎంత అద్భుతం! స్నేహంతో పలకరించి, చెయ్యి ఆసరాయిచ్చి నిలబెట్టి ఈమారణహింసనంతా గడిచి గట్టెక్కి, బ్రతికే బైటవున్న లక్షలాది ప్రజలతో ఒక క్షణంసేపైనా సంభాషించటానికి అవకాశం యిస్తు

న్నాడు. ఈపోరాటంలో వీరమరణం పొందేవారికికూడా నాకంఠం విన్పిస్తుంది. ఇక్కడ ఇంత ఉదాత్తమైన మానవత్వ శిఖరం కన్పిస్తోంటే, ఇప్పుడే, వరండాల లోనే, నాజీలు ఉరితీయబడే ఖైదీలను పేరుపేరునా పిలుస్తూన్నారు. ఖైదీల కంఠాల్లో దుఃఖం, క్రోధం వెలికి రాలేక గడ్డకట్టిపోతున్నాయి. ఇలాంటి సమయంలో, ఒక "మిత్రుడు" దొరకడం నాకాశ్చర్యంగా వుంది! ఇప్పుడిది నిజమైనా కాకపోయినా, ఈలక్షణమే ఒక హెచ్చరిక! ప్రస్తుతం నేనున్న భయంకరస్థితిలో, అనాయాచితంగా ఎదుటికివచ్చి, చెయిచాచి "ఇదిగో నా తోడ్పాటు" అని నిర్భయంగా చెప్పడానికి ఎంత ఆత్మశక్తివుండాలి! ఎంత ధైర్యం!

తర్వాత ఒక నెల గడిచింది. సైనిక శాసనం రద్దుచేయబడింది. కేకలు, ఆర్భాటాలు అణిగిపోయాయి. భయంకర క్షణాలు గడిచి బైటపడి పూర్వానుభవాలనే మళ్ళీ జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాము. ఒకనాటి సాయంత్రం. మళ్ళీ అదే గార్డు తటస్థించి నన్ను గదిలో విడిచివెళ్ళడానికి పొంచుకుంచాడు.

"ఇప్పుడు కొంచెం పుంజుకుంటున్నావ్. అంతా సక్రమంగా నడుస్తోందా?" ఎంతో ఆప్యాయంగా అడిగాడు.

అందులో అంతరార్థం గ్రహించాను. ఆర్ద్రితతో కరిగిపోయాను. అతని నిజాయితీమీద గాఢంగా విశ్వాసం ఏర్పడింది. ఎంతో నైతిక బలంవున్నవాడికేగాని, అలాంటి ప్రశ్న వేసే గుండె వుండదు. ఆక్షణం నుంచీ అతన్ని నమ్మాను; అతను మాలో ఒకడైనాడు.

మొట్టమొదట వింతగా కన్పించాడు. వరండాలలో ఒంటరిగా పచార్లు చేసేవాడు. మౌనంగా, పెదవులు బిగించుకుని, జాగ్రత్తగా పరిసరాలను పరిశీలిస్తూ తిరిగేవాడు. ఎప్పుడూ కేకలువేసి ఎరుగడు. ఎప్పుడూ ఒకరిమీద చెయ్యి వేసి ఎరుగడు.

"ఈసారి స్మెటోన్ ఇటుచూస్తున్నప్పుడు నామీద ఒక దెబ్బ వెయ్యి." పక్కగదిలో ఖైదీలు అతని శ్రేయస్సుకోరి అలా చెప్పారు ఒకసారి.

"అనవసరం" అన్నాడు, తలపంకిస్తూ.

అతనెప్పుడూ జెకొస్లోవేకియాను గురించి తప్ప మరొకవిషయం మాట్లాడడు. అతన్నిచూస్తే చాలు, మిగతా గార్డులకూ ఇతనికీ ఎంతో తేడావున్నట్లనిపించేది. ఆ తేడా ఏమిటో మాత్రం ఎవరికి అంతుపట్టేది కాదు.అధికారులు కూడా అలాగే అనుకునేవారు, కాని, ఫలానిలోపం అని వేలెత్తిచూపలేక పోయేవారు.

అతనితో ఎక్కడ అవసరముంటే వెంటనే అక్కడ ప్రత్యక్షం. కోపతాపాలు, ఆందోళన వున్నచోట ప్రశాంతి నెలకొల్పేవాడు. భయంతో వేళ్ళాడిపోయినవాళ్ళకు ధైర్యం తెచ్చేవాడు. బైట కొందరి జీవితాలకు ప్రమాదం కలుగుతుందని తెలిస్తే, వెంటనే ఒక కొత్త "కాంటాక్టు" ఏర్పరిచేవాడు. వివరాలతో విసుగెత్తించకుండా, ఒక నిర్ణీతక్రమంలో పనిచేసేవాడు.

ఇది మాకు కొత్తకాదు. ఈ ఉద్దేశంతోనే మాలో కొందరు నాజీలలో కూడా ప్రవేశించారు.

ఇతని పూర్తిపేరు ఎడాల్ఫ్ కొలిన్‌స్కీ. మొరేవియాలో జీవించే ఒక పురాతన జెక్ కుటుంబంలో పుట్టాడు. జర్మన్‌జాతి పౌరుడుగా నటించి, జెక్ ఖైదీల కాపలాకు గార్డుగా ఉద్యోగం సంపాదించాడు. మొదట రాడెక్‌రాలోవ్‌లో కొంతకాలం పనిచేసి,ఇప్పుడు పాంక్రాస్‌కు వచ్చాడు. అతని పాతచరిత్ర తెలిసిన తర్వాత అధికార్లెంత మధన పడ్డారో చెప్పలేను. ఈ సంఘటనలు జరిగిన తర్వాత నాలుగేళ్ళకు, జైలు సూపరింటెండెంటుగావున్న నాజీ అధికారి అతనిమీద కోపంతో పిడికిలెత్తి ముఖంలో పొడవబోతూ, "నీ జెక్ తత్వాన్ని నాశనం చేస్తాను" అని కేకలు పెట్టాడు.

పాపం, ఆ అధికారి సమయం మించిపోయిన తర్వాత గ్రహించాడు. పైగా పొరపడ్డాడు. కొలిన్‌లోని జెక్ తత్వాన్ని రూపుమాపితే చాలదు. అతనిలోని మానవత్వాన్నే దగ్ధంచేస్తేగాని అతను ఖచ్చితమైన నాజీగా మారలేడు.

కొలిన్ ఒక మహత్తర చైతన్యంతో, కావాలని నాజీలలో చేరాడు. వాళ్ళ ఉద్యోగంలోవుండి వాళ్ళ నాశనానికై పోరాడు

తున్నాడు. ఏక్షణాన్నైనా తనజీవితానికి ప్రమాదం రావచ్చునని గ్రహించడంవల్ల, అతని ఆశయం మరింత శక్తివంతమౌతోంది.

మేము :

---

ఫిబ్రవరి 11, 1943.

రోజూ కాఫీపేరుతో తెచ్చి యిచ్చే మురికినీళ్ళకు బదులు, అచ్చమైన కోకో తెచ్చిపెడితే అద్భుతంగా వుంటుంది. కాని, ఇవాళ జరిగిన విచిత్రం వాటన్నిటినీ మించిన అద్భుతం — గస్తీ తిరిగేగార్డు జెక్‌యూనిఫాంలో వున్నాడు.

ఆ యూనిఫాం తిరగడంమాత్రమే మాకు కన్పించింది. పెద్ద బూట్లు, నల్లని ట్రౌసరూ వేసుకున్న ఒక గార్డు పాదంమాత్రమే మాకు పొడకట్టింది. చిక్కని నీలిరంగు చొక్కాలోవున్న వొక చేయిపైకి సాగి, మాగది తాళంతెరచి, మూసేసి వెంటనే అదృశ్యమైపోయింది. అదంతా ఒక్క తృటిలో జరిగిపోవడంవల్ల, నిజంగా అలాంటి యూనిఫాం చూశామా అని ఒక పావుగంటతర్వాత మాకే అనుమానంవేసింది.

పాంక్రాస్‌జైలులో గార్డు పనికి జెక్‌పోలీసులు! ఈ ఒక్క సంఘటననుబట్టి అనేక ముఖ్యవిషయాలు బైటపడతాయి.

తర్వాత గడిచిన రెండుగంటలలోనూ బయటి రాజకీయ పరిస్థితులను గురించి కొన్ని ముఖ్యాభిప్రాయాలేర్పరుచుకుంటున్నాం. మా గది తలుపు తెరుచుకుంది. ఒక జెక్ టోపీ లోపలికి తొంగిచూసింది. మా ఆశ్చర్యానికి సమాధానంగా చిరునవ్వు నవ్వుతూ, అతని పెదవులు పలికాయి :

" ఇంటర్వల్ ! బైటికి రావచ్చు. "

మేమనుకున్నదానిలో పొరపాటేమీలేదు. ఆకుపచ్చ, గౌరవర్ణమూ కలిసివుండే జర్మన్ నాజీ యూనిఫారంలతోబాటు, అక్కడక్కడా నీలిరంగు దుస్తుల్లో జెక్ పోలీస్ ఆఫీసర్లు కన్పిస్తున్నారు. ఉత్సాహంతో మావైపే చూస్తున్నారు.

ఇక మా పరిస్థితులెలా వుంటాయో ? వీళ్లెలా ప్రవర్తిస్తారో ?

వీళ్లలాంటి వాళ్లయినా, అసలు వీళ్లిక్కడ ప్రత్యక్షం కావడమే ఒక ముఖ్యవిషయాన్ని బైటపెడుతోంది. ఒక ప్రభుత్వం తాను అణిచిపెట్టి హింసించదలచుకొన్న జాతిలోనుంచే, తాము ప్రయోగించే చిత్రహింసలు అమలు జరపడానికవసరమైన వ్యక్తులను ఏరుకోవలసి రావడం ఆ ప్రభుత్వ పతనస్థితిని తెలియచేస్తుంది! ఈ ఫాసిస్టు ప్రభుత్వం, కొద్దిమంది వ్యక్తులను సైన్యంలో పంపడంకోసం తాను కట్టుదిట్టంగావుంచే పోలీస్ బలగాన్ని క్షీణింపచేస్తోందంటే, దాని సంఖ్యాబలం నానాటికీ ఎలా తరిగిపోతున్నదో స్పష్టపడుతుంది! ఈ పద్ధతిలో ఈ ప్రభుత్వం ఇంకెంతకాలం నిలబడగలుగుతుంది?

అది నిజమే. జర్మన్ గార్డులకంటె దుర్మార్గంగా ప్రవర్తించే వాళ్లనీ, మానవత్వమూ, విజయంపొందుతామనే విశ్వాసమూ పూర్తిగా నశించినవాళ్లని ఎన్నికచేసి ఇక్కడికి పంపివుండవచ్చు. కాని, నాజీ సైనికులకు బదులు జెక్ జాతి పోలీసుల్ని నియమించారంటే, ఈ ప్రభుత్వం అంత్యావస్థలో వున్నదనడానికి అంతకంటె ఏం రుజువుకావాలి?

మా చర్చలన్నీ ఇలాగే నడిచాయి.

మొదట మేమూహించినంతకంటె, ఎక్కువమందే జెక్ పోలీసులు ఇక్కడికొచ్చారు. ఉన్న వాస్తవం ఇది: ప్రభుత్వానికి అంతకంటే గత్యంతరం లేకపోయింది. ప్రభుత్వం స్వరక్షణకు అవసరమైనంతమంది మనుష్యులే లభించలేదు.

ఫిబ్రవరి 11 వ తేదీన మొదటిసారి మాకు జెక్ పోలీసులు కన్పించారు.

మరునాటినుంచీ వాళ్ళతో పరిచయం చేసుకోవడం ప్రారంభించాం.

ఒక పోలీస్ వస్తాడు. బైట, మునికాళ్ళ మీాద నిలబడి గదిలోకి తొంగిచూస్తాడు. నేలమీాద పాకుతున్న పసిబిడ్డ ఉత్సాహం పట్టలేక ముందుకు దుమికినట్టు, ధైర్యంవచ్చి ఎగిరి పడతాడు.

"ఊ! — ఏమండీ! ఎలా గడుస్తోంది?"

మందహాసంతో జవాబిస్తాం. తనుకూడా చిరునవ్వు నవ్వు తాడు. వెంటనే, పట్టలేక :

"మామీద కోపం పెట్టుకోవద్దు, చూడండి! మీమీద కాప లాకాయడంకంటె, ఆ బైట రోడ్లమీద వెర్రెత్తి తిరగడం నయం. సరే కాపలాకాస్తున్నాం. బహుశా – బహుశా ఏదో ఒక మంచి జరగకపోతుందా ...

వాళ్లు పాంక్రాస్‌లో ప్రవేశించడాన్నిగురించి మేమేమనుకు న్నదీ, వాళ్ళనుగురించి మా అభిప్రాయాలూ చెపితే విని సంతోషిం చాడు. అలాగ, మొట్టమొదటి క్షణంనుంచీ మాకు స్నేహం కుదిరింది. అతనిపేరు విలెక్. సహృదయుడు. అమాయకుడు – ఆనాటి ఉదయం నాగదిదగ్గర మొదటిసారిగా తిరిగింది ఇతనే.

రెండవవాడు ట్యూమా. జెక్ తత్వానికి ఇతన్ని ఉదాహరణగా పేర్కొనవచ్చు. వృద్ధుడు. మొరటాగా హడావుడిగా బ్రతికే మనిషి. ఈ ఉద్యోగం అతనికే విచిత్రంగా కన్పించలేదు. అంతేకాదు. ఎక్కడ వున్నా అతను తన యింట్లోవున్నట్టే ప్రవర్తించేవాడు. తనే రూల్సును సక్రమంగా అమలుజరిపేవాడు, తనే మళ్లీ వాటిని భగ్నపరుస్తుండే వాడు. ఎప్పుడూ మోటుగా చెణుకులు విసురుతూండేవాడు. రొట్టెలూ, సిగరెట్లూ మొదలైనవి ఖైదీల కివ్వడానికి వచ్చి, ఎవరితోనైనా ఏ విష యమైనా పిచ్చాపాటీ వేస్తుండేవాడు – ఒక్క రాజకీయ పరిస్థితిని గురించి తప్ప. ఇదంతా అతి సహజంగానే, ఇదే తన ఉద్యోగధర్మం అనుకున్నట్టు నడుపుకొచ్చేవాడు. ఇలాంటి ప్రవర్తన చూసి, అధికా రులు మందలించగానే, అప్పటినుంచీ కొంత జాగ్రత్తగావున్నాడు, కాని అతని తత్వం మారలేదు. ఇదిగో, ఈ ముఖ్యమైన పని నవ్వు చేసిపెట్టాలీ అని అతన్ని అడిగి ప్రయోజనం లేదు, కాని, అతను దగ్గర వుంటే కొంత హాయిగా కాలంగడుస్తుంది.

మూడవ జెక్‌పోలీసు ఎవరినీ పలకరించకుండా, ఏమీ పట్టించు కోకుండా, తనలోతాను గొణుక్కుంటూ వరండాలో తిరిగేవాడు. అతనితో పరిచయం చేసుకోవాలని ఎవరెంత ప్రయత్నించినా సాధ్యం కాలేదు.

"వీడివల్ల వాళ్ళకేమాత్రం ప్రయోజనం లేదు" అన్నాడు తాత. అతనొక్క వారంరోజులు పరీక్షగా చూసి, "వాళ్ళందరిలోనూ వీడే తెలివితక్కువవాడు" అన్నాడు.

"బహుశా అందరికంటె తెలివిగలవాడేమో," అన్నాను వాదంకోసం. వాద ప్రతివాదాలలోపడి మరిచిపోకపోతే, ఇక్కడ మా జీవితం దుస్సహమౌతుంది.

రెండు వారాలతర్వాత, అతనేదో తనవుద్యోగనిర్వహణలో స్వల్పంగా నిర్లక్ష్యం చూపుతున్నట్లు అనుమానం తట్టింది. నేను కూడా వెంటనే గోప్యంగా సమాధానమిచ్చాను; అలాంటి సమాధానానికి జైలులో వెయ్యి అర్థాలు చెప్పవచ్చు కాని, నిష్ప్రయోజన మైంది. బహుశా నాదే పొరపాటేమో!

ఎలాగైతేనేం ఒక మాసం గడిచేటప్పటికే అంతా స్పష్టంగా తెలిసిపోయింది. గూడు పగిల్చి బైటకువచ్చే సీతాకోక చిలుకలాగా, అంతా బైటపడింది. ఊగుతూ, మూల్గుతూవుండే గూడు బద్దలుగా పగిలిపోయింది. జీవంతోవున్న సీతాకోకచిలుక బైటకెగిరి వచ్చింది. సీతాకోకచిలుక కాదుసుమా – మనిషి!

నా రచనల్లో అనేకమంది జీవితాలుచూసి, తాత "నీవు శిలా విగ్రహాలు పోతపోస్తున్నావు సుమా!" అన్నాడు.

నా అభిమతం కూడా అదే. బైటా లోపలా కూడా నిష్కల్మషంగా వీరోచితంగా పోరాడి మరణించిన కామ్రేడ్స్ జీవితస్మృతులకు శాశ్వతత్వం కలిగించాలనివుంది. అంతేకాదు. ఇక్కడ దుర్భరపరిస్థితులను లెక్కచెయ్యకుండా, మామీద అచంచల విశ్వాసంతో, ధైర్యంగా మాకు చేయూతనిచ్చి తోడ్పడినవారి జీవితాలన్నిటినీ చిత్రించాలనివుంది. ఈ జెక్ పోలీసునూ, కొలిన్‌స్కీనీ పిశాచాలు తాండవించే ఈ వరండాలోనుంచి బైటికి లాగి, విశాల మానవ జీవితంలో ప్రాణకాంతిలో నిలబెట్టాలనుకుంటాను. వాళ్ల ఔన్నత్యాన్ని అభినందించడానికి కాదుసుమా, వాళ్లను ఇతరులకు ఆదర్శంగా ఎత్తి చూపటానికి. ఎందుచేత నంటారా? మానవుల విధ్యుక్తధర్మం ఈ యుద్ధంతోనే అంతంకాదు! సాధారణ ప్రజలు మానవత్వశిఖరా

లను అందుకోనంతవరకూ, కొంతమంది వ్యక్తులైనా "మానవులు"గా సంచరించాలంటే ఎంతో ధైర్యం, ఆత్మశక్తి వుండాలి గనుక !

జరోస్లావ్ హోరా అనే పోలీసు జీవితకధనం చాలా చిన్నది. కాని, అందులోనే ఒక పరిపూర్ణ మానవజీవితం ద్యోతకమౌతుంది.

దేశంలో ఎక్కడో ఒకమూల రాడ్నికో అనే ప్రదేశంవుంది. ఆప్రదేశం ఎంత సుందరంగా వుంటుందో, జీవితం అంత నిస్సారంగా నిర్ధనంగా వుంటుంది. అతని తండ్రి గ్లాస్ తయారుచేసేవాడు. ఎంతో కాయకష్టంచేసి జీవించేవాడు. పని వున్నప్పుడు భరించలేనంత చాకిరి, పనిలేనప్పుడు పస్తులు. ఇటువంటి కష్టాల నెదుర్కొనే వ్యక్తి, అధైర్యంతో తల వేళ్ళాడేసుకునైనా వుంటాడు, తల ఎత్తి నవలోకాన్ని గురించి కలలైనాకంటాడు. ఒక కొత్తలోకం స్థాపించడం సాధ్యమౌతుందని విశ్వసిస్తూ, దానికోసం పోరాడాలనే కాంక్షతో అతని తండ్రి కమ్యూనిస్టుగా మారాడు.

యౌవనంలోవున్న హోరా, మే దినోత్సవ ప్రదర్శనాలలో తన సైకిలు రెండు చక్రాలకూ ఎర్రని రిబ్బన్లు అలంకరించి, సైకిళ్ళ పంక్తిలో వెళ్ళేవాడు. తను మొట్టమొదటిసారిగా పనిలో ప్రవేశించి స్కోడా యంత్రాగారంలో "లేత్" దగ్గర నిలబడినప్పుడు, తనా ఎర్రరిబ్బన్లను ఎక్కడో వదిలెయ్యలేదు. వాటిని తన జీవితంలోనే అంతర్భాగంగా మార్చుకొని, ఎక్కడో హృదయంలో దాచుకున్నాడు.

తర్వాత నిరుద్యోగం, సైన్యంలో ఉద్యోగం. ఇవన్నీ ముగిశాక పోలీస్‌పని దొరికింది. ఇంతకాలం, ఆ ఎర్ర రిబ్బన్లు అతని మనస్సులోనే ఏదో మూల ముడతలు పడివుంటాయి. వాటిని పూర్తిగా విస్మరించి కూడా వుంటాడు. తర్వాత పాంక్రాసుజైల్లో ఉద్యోగానికి పంపారు. అతను కొలిన్‌స్కీలాగ కావాలని ఇక్కడికి రాలేదు, కాని, మాగదుల్లోకి తొంగిచూచిన వెంటనే అతనిలో మళ్ళీ చైతన్యం రగులొకొన్నది. ఆ ఎర్రరిబ్బన్లు మళ్ళీ మనస్సులో విప్పారుకుని ధగధగ మెరిశాయి.

మొదట తన శక్తిసామర్థ్యాలను, బయటిపరిస్థితులను అంచనా

వేసుకున్నాడు. తన ధర్మాన్నెలా ఎక్కడ నిర్వర్తించాలో యోచించు కున్నాడు. అతను ఆరితేరిన రాజకీయవేత్త కాడు, పేద ప్రజలలో పుట్టి పెరిగిన సాధారణవ్యక్తి.

అతని మనస్సు సున్నితమైనది. నిష్కల్మషంగా, కొంచెం సిగ్గుతో, కాని ధైర్యంతో ప్రవర్తిస్తాడు. అవసరమైనప్పుడు అపారమైన శౌర్య సాహసాలు ప్రదర్శిస్తాడు. నిశ్శబ్దంగా హడావుడి లేకుండా పని చేస్తాడు. తన పనులన్నిటినీ అత్యంత సహజంగా, నిరాడంబరంగా పూర్తిచేస్తాడు. తను నేరవేర్చేది తన విధ్యుక్తధర్మాన్ని; అందుకు ఆందోళన, హడావుడి ఎందుకు?

ఇదీ అతని జీవితచిత్రం. అనేక ప్రాణాలను ఉరి కంబంనుంచి కాపాడిన గౌరవం అతనికి దక్కింది. ఇక్కడ ఒకానొకవ్యక్తి తన ధర్మాన్ని ఖచ్చితంగా నెరవేర్చబట్టే, బైట అనేకమంది వ్యక్తులు ప్రాణంతో మిగిలివున్నారు. కొలిన్‌స్కీ, అతను పరిచయమైనారు. ఇద్దరూ నిశ్శబ్దంగా తమపని చేసుకుంటూ పోతున్నారు.

వీరిద్దరినీ జ్ఞాపకం పెట్టుకోండి. మతిచెడకొట్టుకోకుండా, తమ హృదయాలు వేటిని ప్రేమించాలో, వేటిని ద్వేషించాలో స్పష్టంగా గ్రహించి, తమ మేధస్సులనూ, హృదయాలనూ సక్రమ మార్గాన వినియోగిస్తున్నారు.

స్కారెపా "తాత" :

వీరి ముగ్గురినీ ఒక్కసారేచూస్తే, సౌభ్రాతృత్వపు వివిధ కోణాలు విశదంగా కన్పిస్తాయి. ఐతే వీళ్ళు ముగ్గురూ ఒకేచోట సాధారణంగా నిలబడరు – ముగ్గురూ ఒకటే గనుక.

"నమ్మదగ్గ పరిచారకులు మాత్రమే, ఖైదీలతో ఎలాంటి సంబంధం పెట్టుకోని వాళ్ళుమాత్రమే" పరిచారకులుగా నియమించ బడాలని నాజీల శాసనం. వరండాలు పరిశుభ్రం చెయ్యడం, ఖైదీలకు తిండి తెచ్చిపెట్టడం మొదలైనవి "పరిచారకుల" పనులు, ఈ శాసనం నశించింది – పూర్తిగా నశించింది. అలాంటి పరిచారకులు ఎక్కడా లేరు – ఎప్పుడూలేరు. ఖైదీల సమిష్టి సంఘటన తరఫున బయటి జీవ జగత్తుతో సంబంధం కల్పించుకోడానికి, బైట ఏమేమి మార్పులు

రానున్నదీ వాసన పట్టడానికీ ఈ "పరిచారకులు" ఉపకరిస్తూంటారు. వార్తలు మోసుకుపోవడం, ఉత్తరాలు చేరవెయ్యడం మొదలైన రహస్యకార్యకలాపాల్లో వున్నప్పుడు ఎంతమంది "పరిచారకులు" పట్టుబడలేదు! ఎంతమంది ప్రాణ బలిదానం చెయ్యలేదు! కాని, తర్వాత వచ్చేవారు కూడా ఆ ప్రమాదాల నెదుర్కోడానికి సిద్ధపడి పని చెయ్యాలనేది ఖైదీల నిర్ణయం. ధైర్యంగా పనిచేసేవాళ్లయినా, పిరికిపందలైనాసరే, ఆ పనులుచేసి తీరవలసిందే. రహస్యోద్యమంలో, ధైర్యంతో పనిచేసేవాడికంటె భయపడేవాడే ఎక్కువ నష్టపడతాడు.

విరోధులను నిర్దాక్షిణ్యంగా మట్టుపెట్టే అధికారులకిందనే పని చేస్తూ, ఈ అతిప్రముఖమైన రహస్య కార్యక్రమం కొనసాగించాలి. నాజీ సైనికుల కళ్ళయెదుట, వాళ్లు నియమించిన విధులు నెరవేర్చుతూ, శత్రువుల భయంకర నియమాలకులోబడి ఇవన్నీ జరగాలి. రహస్యోద్యమ నిర్వహణలో బైట నేర్చుకున్న సూత్రాలు చాల వికృడ. అంతకంటె బుద్ధినైశిత్యమూ, ధైర్యమూ కావాలి.

ఇలాంటి కార్యకలాపాల్లో ఆరితేరినవాళ్ళు అనేకమంది వున్నారు, బైటా లోపలకూడా. ఇందులో స్కారెపా తాత ఘనుడు. నిశ్శబ్దంగా నిరాడంబరంగా, ఐతే చేపలాగ ఎక్కడికక్కడ జాగ్రత్తగా జారిపోతూ, తన పని తాను చేసేస్తాడు. అతను చాలా నమ్మకమైన మనిషనీ, తన పనితప్ప మరేమీ ఎరుగడనీ ఉద్దేశంతో నాజీ గార్డులతన్ని అభినందిస్తారు. ఇతరులందరికీ అతను ఆదర్శవ్యక్తి అంటారు.

ఔను. పరిచారిక మిత్రులారా! అతన్నే అనుసరించండి! పరిచారకులందరిలోనూ పట్టుదలా, బుద్ధికుశలతా మూర్తీభవించినవ్యక్తి.

అతనికి ఖైదీలందరి తత్వాలు తెలుసు. కొత్తగావచ్చిన ఖైదీల పూర్వాపరాలు క్షణకాలంలో గ్రహిస్తాడు. మరి ప్రతివాళ్ళనూ పరీక్షించి, ఎవరెలాంటివాళ్ళో గ్రహిస్తేతప్ప రహస్యోద్యమం ఎలా కొనసాగుతుంది?

అతను శత్రువు తత్వాన్నికూడా బాగా అంతుపట్టించుకున్నాడు. ప్రతి గార్డుయొక్క అలవాట్లనూ, లక్షణాలను తెలుసుకున్నాడు. ఎవరి కెలా మాసిక వెయ్యాలో తెలుసు. నాజీగార్డులను

గురించి నేనిందులో వ్రాసిన కొన్నిగుణాలు అతను చెప్పినవే. "తాత" వరండాల్లో నిరాటంకంగా తనపని నెరవేర్చుకోడానికి నాజీల గుణగణాలు గ్రహించడం అత్యవసరం.

అన్నిటికి మిన్నగా, స్కారెపా "తాత" తన ధర్మం తానెరిగినవాడు. కమ్యూనిస్టు అనేవాడు ప్రతిక్షణం కమ్యూనిస్టుగానే జీవించాలనీ "ఆ, ఆ పని దానంతటది కాకపోతుందటలే" అని నిర్లక్ష్యం చెయ్యరాదనీ అతను ముందే గ్రహించాడు. నాడుద్దేశంలో, ఇక్కడ వున్న ఈ భయంకర పరిస్థితుల్లో అధికారుల దుర్మార్గ ప్రదర్శన సమయంలో పనిచేయడానికి ఇతను బాగా తగినవాడు. ఇక్కడే ఇతను అభివృద్ధి పొందాడు కూడా.

రహస్యోద్యమ నిర్వహణలో ఒక్కొకరోజు, ఒక్కొకగంట ఒక కొత్త పరిస్థితిని సృష్టిస్తుంది. స్కారెపా "తాత" అవసరాన్నిబట్టి సాగుతాడు. కుంచించుకుంటాడు. ఒకక్షణంలో కొత్త పద్ధతులు కనిపెడతాడు. ఒక గదితలుపుమీద దెబ్బకొట్టి, తలుపుసందులోనుంచి వార్త విని, కంఠోపాఠంచేసుకుని, వరండాచివరవున్న గార్డు తిరిగి వచ్చేలోపల, తాను చివరిగదిలో ఆ వార్త అందించి నిశ్శబ్దంగా తిరిగి వస్తాడు. ఎంతో జాగ్రతగా మెలగుతాడు. అనేక వందల ఉత్తరాలు అతనిచేతిమీదుగా బైటికిదాటాయి – ఒక్కటీ పట్టుబడలేదు, అసలు అనుమానమైనా కలిగించలేదు.

ఎవరు కష్టంలోవున్నారో, ఎవరు ఆకలితో కాలిపోతున్నారో, ఎవరి నెలా సంరక్షించుకోవాలో అతనికి బాగా తెలుసు. ఎవరి అవసరం తీర్చడానికైనా ఎప్పుడూ సంసిద్ధంగావుంటాడు.

ఇతనే స్కారెపా "తాత". ధైర్యంతో, నిర్భయంగా పోరాడే సైనికుడు! నిజమైన మానవుడు!

ఏదోనాకరోజున ఈ పుస్తకం చదివేవారందరినీ నేను కోరేదొక్కటే: స్కారెపా "తాత"ను ఒక పరిపూర్ణమానవుడుగానేగాక, ఖైదీలనుంచి నియమించబడే "పరిచారకుల్లో" ఉత్తమోత్తముడుగా పరిగణించండి. ఖైదీలను తొక్కిపట్టడంకోసం ఫాసిస్టు లిచ్చిన వుద్యోగాన్ని, ఇతను, ఖైదీల సంరక్షణార్థం వినియోగించాడు. ఇతనొక్కడే

కాదు. ఇక్కడ ఇలాంటివా ళ్ళనేకమంది వున్నారు. పాంక్రాస్ జైలులోనూ, పెచెక్ "విచారణ" భవనంలోనూ వున్న ఇలాంటి వ్యక్తులందరి జీవితచిత్రాలు రచించాలని నా కెంతో ఆసక్తివుంది. కాని, మరికొన్నిగంటలే నాకు మిగిలిన వ్యవధి — "క్షణంసేపు పాడేపాట, కాలాంతం నిలిచేపాట" ఇది. నాకు వ్యవధిలేదు.

అందుకని, కొన్నిపేర్లుమాత్రమే ఉదహరిస్తాను. అనేకమంది ఉత్తములలో, కొద్దిమంది ఉదాహరణ. వీరిని జ్ఞాపకంపెట్టుకోవడం మన ధర్మం:

"రెనెక్" — అని మేము పిలిచే జోసెఫ్ టెరింగెల్. ఆదర్శంతో ధగధగలాడే వ్యక్తి. త్యాగపురుషుడు. పెచెక్ భవనం చరిత్రలో, మా నిరంతర పోరాటంలో మునిగితేలాడు — అతని ఆప్తమిత్రుడూ, సహృదయుడు ఐన జో బెర్వ్రిడూకూడా.

డాక్టర్ మైలాష్ నెద్వెద్. చక్కగా ఉదాత్తంగావున్న యువకుడు. ఖైదీలకు నిత్యం తోడ్పడినందుకు ఫలితంగా ఆస్విజింలో ప్రాణం బలియిచ్చాడు.

ఆర్నాస్ట్లోరెన్జ్. తన కామ్రేడ్స్‌కు ద్రోహం చెయ్యడానికి తిరస్కరించాడు. నాజీలు భార్యను ఉరితీసి పగతీర్చుకున్నారు. ఒక సంవత్సరం తర్వాత, తన స్నేహితులకు, పెచెక్ భవనంలోని పరిచారకులకు, ఖైదీల సమిష్టి సంఘటనకు చెందిన రహస్యాలు బయట పెట్టడనికి నిరాకరించి, తత్ఫలితంగా ఉరికంబం ఎక్కాడు.

వాషెక్ రెస్కూ. అతనిలో హాస్యం నాటికీ నేటికీ చావలేదు. అద్భుతమైన వ్యక్తి.

ఆనీ వికోవా. మౌనంగా, దేశభక్తితో ప్రజ్వలించే ఈవ్యక్తిని సైనికశాసనం బలితీసుకున్నది.

స్ప్రింగర్. తెలివిగా, సంతోషంగావుండే 'గ్రంథాలయోద్యోగి' తనపని తాను చెయ్యడానికి ఎన్ని కొత్తమార్గాలైనా కనిపెట్టగలడు.

బిలెక్ స్నిగ్ధహృదయుడు, పాపం...!

ఇవన్నీ ఉదాహరణలు, నమూనాలు. చిన్నా, పెద్దా అంతా. నిర్జీవపద చిత్రాలుకాదు. జీవంతో వెలిగిన మానవులు!

# VIII

## అంత్యదశ

జూన్ 9, 1943 :

నా గదిముందే ఒక బెల్లు వేళ్ళాడుతోంది. నాదే! అంటే ప్రయాణానికి సిద్ధంకావాలన్నమాట. ఎప్పుడో రాత్రివేళ హఠాత్తుగా విచారణకోసం జర్మనీకి లాక్కుపోతారు - తర్వాత వుండనేవుంది! నా జీవితంలో అంతిమ ఘడియల్ని, కాలం నిర్దయగా దిగమింగుతోంది. పాంక్రాసులో గడిపిన రోజులన్నీ నాల్గువందల పదకొండు! ఎంత త్వరగా జరిగిపోయినయ్! ఆశ్చర్యంవేస్తోంది. ఇంకా ఎన్నాళ్లుందో? ఎలా వుంటుందో? ఎక్కడ గడుపుతానో?

ఎక్కడున్నా సరే, ఇకముందు వ్రాయడానికి అవకాశమంటూ లేదు. అందుచేత ఇదే నా అంతిమ వాఙ్మూలం. ఇది చరిత్రలో ఒక దృశ్యం. దీనికి నేనుతప్ప బహుశా మరొక సాక్షి లేకపోవచ్చు. 1941 ఫిబ్రవరిలో జర్మను ఫాసిస్టులు జకోస్లోవేకియా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సభ్యులందరినీ అరెస్టుచేశారు. కేంద్రకమిటీ అరెస్టయితే నాయకత్వం వహించటానికి నిర్ణయించిన కమిటీ సభ్యులుకూడా అరెస్టయినారు. ఎన్నడూ కలలోకూడా అనుకోని ఇంత దారుణమైన దెబ్బ తగలడానికి కారణమేమిటో ఇప్పటికీ తెలియలేదు. బహుశా ఎప్పుడో ఒకరోజున గెస్టాపో అధికార్లను నిర్బంధించి మాట్లాడిస్తే బయటపడుతుందేమో! పెచెక్ భవనంలో వున్నప్పుడు ఈ రహస్యం తెలిసికోవాలని ఎంత ప్రయత్నించినా అసంభవమైంది. తప్పనిసరిగా శత్రువుల ఏజెంట్లు ఎవరో మాలో వున్నారన్నమాట.

ఇక మా అజాగ్రత చెప్పనవసరంలేదు. రెండేళ్ళు రహస్య కార్యక్రమం జయప్రదంగా నెరవేరటంవల్ల "భద్రత" అనేదాన్ని కామ్రేడ్సు విస్మరించారు. మా రహస్యోద్యమం సర్వత్రా వ్యాపించింది. క్రమేణా కొత్త సభ్యులు చేరారు. నాయకత్వం వహించే వారికి ఏదన్నా ప్రమాదంజరిగితే కార్యక్రమం కొనసాగించవలసిన వారు కూడా అందులో వున్నారు. పార్టీ సెల్లు నిర్మాణం ఖచ్చితంగా

అదుపులో పెట్టడానికి వీలులేనంత క్లిష్టంగా పరిణమించింది. కేంద్ర కమిటీపై దెబ్బతీయడానికి శత్రువు ఎంతోకాలం నుంచి జాగ్రత్తగా సిద్ధపడ్డారు. అందుకనే సోవియట్ యూనియన్‌పై యుద్ధం ప్రకటించబోతున్నప్పుడు మా మీద విరుచుకుపడ్డారు.

అప్పుడెంత మందిని అరెస్టుచేసిందీ మొట్టమొదట్లో నాకు తెలియలేదు. మాప్లాను ప్రకారం, మిగతా వాళ్ళు నాతో సంబంధం పెట్టుకుంటారుగదా అని ఎదురుచూశాను. కాని నిష్ప్రయోజనమైంది. నేనూహించిన దానికంటె పెద్దదెబ్బతగిలిందని, ఇక బయటివాళ్ళ కోసం నేను ఎదురుచూడగూడదని ఒక నెలరోజుల తర్వాతగాని తేలలేదు. కనుక లోపలనుంచే సంబంధాలకోసం వెతకటం ప్రారంభించాను.

నేను తెలిసికోగలిగిన మొట్టమొదటి సభ్యుడు సెంట్రల్ బొహీమియా నాయకుడు హొంజా వెన్‌కోచిల్. అతనికి అసమానమైన కార్యదీక్షవుంది. పార్టీ పత్రిక లేకుండా పోతుందేమోనని 'రెడ్ రైట్స్' (Red Rights) పత్రిక పునర్ముద్రించటానికి వ్యాసాలన్నీ తయారుచేశాను. దానికి సంపాదకీయం నేనే వ్రాశాను. అసంచికను మాత్రం రెడ్ రైట్స్ పేరుతోగాక మేదినోత్సవ పత్రికగా ప్రకటించాలని నిర్ణయించుకున్నాం. ఇతర పార్టీలుకూడా ఒక నిర్ణీతకాలానికి ప్రచురించకుండా అప్పుడప్పుడు మాత్రం సంచికలు ప్రకటించేవి.

తర్వాత నెలల్లో ప్రధానంగా శత్రునిర్మూలన కార్యక్రమానికి పూనుకున్నాం. తగిలిన దెబ్బ ఎంత పెద్దదయినా పార్టీని పూర్తిగా విచ్ఛిన్నం చేయలేకపోయింది. పడిపోయిన నాయకుల బాధ్యతలు నిర్వర్తించడానికి వందలకొలది కొత్తవర్కర్లు పూనుకున్నారు. వారిలో వుండే నూతనోత్సాహం, విశ్వాసం పార్టీ నిర్మాణం దెబ్బ తినకుండా, అధైర్యం సోమరితనం ప్రవేశించకుండా కాపాడాయి. కాని, కేంద్ర నాయకత్వం లేకపోవడంవల్ల ఎవరికివారు గ్రూపులుగావుండి చెదురుగా నడిచే కార్యక్రమాన్ని సంఘటిత పరచడానికి అవకాశం లేకపోవడం, శత్రువులు సోవియట్ రష్యాపైకి దండెత్తబోతున్న ఆ రోజుల్లో మహాప్రమాదంగా తయారైంది. ఎవరో ప్రకటించిన 'రెడ్ రైట్సు' పత్రికలో వున్న కొన్ని వ్యాసాలు, దాని వెనుక ఎవరో గొప్పనాయకుడున్నాడని

స్పష్టంచేశాయి. మాపత్రికమాత్రం అంత జయప్రదం కాలేదు. కాని మా తోడ్పాటు లభిస్తుందని మాత్రం అవతలివాళ్లు తెలుసుకున్నారు. కనుక రెండు గ్రూపులుగావున్న మేము, ఒకరికోస మొకరు వెతకటం ప్రారంభించాం.

ఒక దట్టమైన అడివిలో మనిషికోసం వెతకటం ఎలాంటిదో అలాగే ఇదికూడా. ఎక్కడో ఒక కంఠం వినబడుతుంది! అటువైపు వెతకటం ప్రారంభిస్తాం. ఇంతలో మరోవైపునుంచి మనం ఎంతో కాలంనుంచి ఎదురుచూస్తున్న మరొకకంఠం నెమ్మదిగా వినిపిస్తుంది! మొదట్లో అపారంగా నష్టపడడంవల్ల పార్టీలో ప్రతివారూ ఎక్కడ ఏ బోనులో పడతామోనని అతిజాగ్రతగా భద్రంగా వుండేవారు. కేంద్రకమిటీలోవున్న ఇద్దరు సభ్యులే ఒకరినొకరు కలుసుకునేముందు వాళ్ల అనుచరుల పరీక్షలకు అడ్డంకులకు తట్టుకొని వారిద్దరిలో ఎవరూ ద్రోహులుగా తయారుకాలేదని గట్టిగా రుజువయినతర్వాతనే కలుసుకోగలిగారు. అందుచేత నే నెవరికోసం వెతుకుతున్నానో నాకు తెలియదు — అవతలివ్యక్తికూడా అంతే.

చిట్టచివరికి మా యిద్దరికీ తెలిసిన నమ్మకస్తుడు ఒకతన్ని పట్టుకున్నాం! డాక్టరు మైవాష్ నెద్వద్ అనే హుషారైన యువకుడుమా మొదటి కొరియర్. అతనుకూడ నాకు తలవనితలంపుగా దొరికాడు. జూన్ (1941) మధ్యకాలంలో నేను జబ్బుపడి 'లిడా' అనే ఆమె ద్వారా నా 'డెన్'లోనుంచి కబురంపాను. వెంటనే వచ్చాడు. బహు జాగ్రతగా మాట్లాడుతూ మీ పత్రికలో ఎవరు సంపాదకీయం వ్రాశారో తెలిసికోవాలనుకున్నారని అడిగాడు. నేనేనని అతనికి తెలియదు. అవతలివాళ్ళంతా అప్పటికే నేను అరెస్టయివుంటానని, బహుశా వురి తీసివుంటారని గట్టిగా నమ్మారు.

1941 జూన్ 22వ తేదీన హిట్లరు రష్యాపై దండెత్తాడు. ఆ సాయంత్రమే హొంజా వెస్కోచిల్, నేనూ కలిసి ఈ దండయాత్ర వల్ల జకోస్లొవేకియాకు ఎంత వుపద్రవంవుందో తెలియజేయడానికి ఒక కరపత్రం ప్రకటించాం. జూన్ 30వ తేదీన నేనన్నాళ్ళనుంచీ ఎదురు చూస్తున్న వ్యక్తిని కలిసికొన్నాను. ఎవరిని కలిసికోబోతున్నాడో అది అతనికి ముందే తెలుసు. కనుక, నేను కబురంపిన చిరునామాకే సరాసరి

వచ్చేశాడు. కాని అతనెవరో నాకు తెలియదు. అది ఒక వేసవిరాత్రి. అకేసియాచెట్ల పరిమళం గాలినిండా వ్యాపిస్తోంది. ప్రేయసీప్రియుల విహారానికి అనువైనరాత్రి. నేను దీపం వెలిగించాను. ఇద్దరం కౌగలించుకున్నాం. అతనిపేరు హాంజాచిక్.

ఫిబ్రవరి (1941) వరకు కేంద్రకమిటీ పూర్తిగా అరెస్టుకాలేదు. ఒక సభ్యుడుమాత్రం బయట తిరుగుతున్నాడు. అతను జీకా. అతను నా కెంతో కాలంనుంచి తెలుసు. అతనిమీద నాకు గాఢమైన అభిమానం. కాని, తర్వాత మే మిద్దరంకలిసి కృషిచేస్తున్నప్పుడు ఒకరినొకరు ఇంకా బాగా అర్థంచేసుకోగలిగాం. అతను పొట్టిగా, గుండ్రంగా ఎప్పుడూ నవ్వుతూనేవుండేవాడు - కాని శ్రద్ధాభక్తులతో అచంచల కార్యదీక్షతో పార్టీ కార్యక్రమం సాగించేవాడు. చేయాలని నిర్ణయించిన పనితప్ప మరేమీ అతనికి తెలియదు. తెలిసికోవాలనే కుతూహలంకూడా లేదు. తన విధిని సక్రమంగా నిర్వర్తించటానికి ఏది అడ్డువచ్చినాసరే నిర్లక్ష్యంగా త్రోసిపుచ్చేవాడు. మనుష్యులంటే అతని కిష్టం. అందరికీ అతనంటే ప్రేమ. ఎప్పుడూ ఎవ్వరినిగానీ లోపాలు చూపెట్టి లొంగదీయాలని ప్రయత్నించిన వాడు కాదు.

ఇద్దరమూ కొద్ది నిమిషాలలోనే ఏకాభిప్రాయానికి వచ్చాం. తర్వాత కొద్దిరోజులలోనే కొత్త నాయకత్వంలో తయారైన మూడో సభ్యుడు హాంజా చర్నీతో పరిచయ మయింది. ఇతను ప్రజల్ని విచిత్రంగా ఆకర్షించగలడు. స్పెయిను స్వాతంత్ర్యసమరంలో పాల్గొని ఊపిరితిత్తులలో పెద్దగాయం అయినప్పటికీ, లెక్కచేయకుండా యుద్ధం ప్రారంభమైన తర్వాత రహస్యంగా నాజీ జర్మనీగుండా యిక్కడికి చేరుకున్నాడు. ఎప్పుడూ అతనిలో సైనిక లక్షణాలు కనపడుతూనే వుంటాయి. రహస్య కార్యక్రమంలో అతని అనుభవం, కార్యసాధనపట్ల అతను చూపే శక్తిసామర్థ్యాలు అపారమైనవి. మేం ముగ్గురం బాధ్యతలు విభజించుకున్నాం. కాని, అందరం కలిసి పనిచేసే వాళ్ళం.

ఫిబ్రవరిలో పార్టీకి తగిలిన దెబ్బ సంబంధాలన్నిటినీ పూర్తిగా తెంచేసింది. వాటిని పునర్నిర్మించటమనేది అసాధ్యమైపోయింది. నిర్మాణంలో కొన్నిభాగాలు పూర్తిగా ధ్వంసమయ్యాయి. కొన్నిటిని పున

రుద్ధరించాము. కాని అన్నిటినీ సక్రమంగా నిలబెట్టడం దుస్సాధ్య మైంది. మేము కేంద్రాన్ని స్థాపించి నడిపే పత్రికని, పనిచేస్తున్న వాళ్ళంతా అనుసరిస్తున్నారని మాత్రమే ఆశించగలిగాం. వుండటానికి చోటుకూడా లేనప్పుడు పనిచేయడం ఎంతకష్టం! శత్రువులు నిత్యమూ కాపలా కాస్తున్నారనే సందేహంతో అంతకుముందు ఉపయోగించే ప్రదేశాలను విడిచిపెట్టాం. డబ్బులేదు. రేషను కార్డులు లేకపోతే తిండి పెట్టరు. రేషను కార్డులు చూపితే మే మెవరో బయటపడి పోతాం. ఒక మహత్తర ఉద్యమాన్ని నిర్వహించటానికి సిద్ధపడవలసిన సమయంలో, యుద్ధంలో సర్వశక్తులూ వొడ్డి పాల్గొనవలసిన సమయంలో, సోవియట్ యూనియన్‌మీద దాడి ప్రారంభమైనప్పుడే ఈ ఆటంకాలన్నీ మమ్మెదుర్కొన్నాయి.

శత్రువుల దురాక్రమణ నెదుర్కొని, దినదినమూ పెచ్చు పెరుగుతున్న నాజీ క్రౌర్యానికి ప్రతీకారం చేయటమే ప్రస్తుతం మా కార్యక్రమం. దీనికి మా స్వశక్తే కాదు, జె దేశంలో వున్న శక్తి సాహసాలన్నిటినీ కూడగట్టాం. ప్రతిఘటనోద్యమానికి సిద్ధపడుతున్న కాలమంతా (1939-41) పార్టీరహస్యనిర్మాణం జర్మను పోలీసులకే కాదు, మా దేశానికి కూడ కనపడలేదు. హింసాకాండ నానాటికీ దారుణంగా హెచ్చుతున్నా పార్టీనిర్మాణాన్ని దృఢతరంచేయడం, జెక్ జాతి గౌరవవిశ్వాసాలను పొందడం ఆరోజుల్లో మా కర్తవ్యం. అంటే ఏపార్టీకి చెందని వాళ్ళతోను, స్వేచ్ఛకోసం పోరాడాలని ఉద్రేకం లూగుతున్న పౌరులతోను, సందేహభయాలతో ఊగిస లాడుతున్న వ్యక్తులతోను సంబంధాలు పెట్టుకోవలిసివచ్చేది.

1941 సెప్టెంబరునాటికే పార్టీకార్యకలాపాలు ప్రజల నాక ర్షించసాగాయి. శత్రుస్థావరాలపై విధ్వంస కార్యక్రమం ఆరంభమైంది. ఏ ఫ్యాక్టరీలో చూసినా సమ్మెలే. సెప్టెంబరు ఆఖరికే హెడ్రిచ్‌ని మా వెంట తరిమింది జర్మను ప్రభుత్వం.

దినదినమూ బలపడుతున్న ప్రతిఘటనోద్యమాన్ని మార్షల్‌లా ఛేదించలేకపోయింది. దానివల్ల కార్యక్రమానికి కొంత జాగు కలిగింది. పార్టీకి కొన్ని కొత్తగాయాలు తగిలాయి. అన్నిటికంటె భయంకరమైన దెబ్బలు ప్రేగ్‌జిల్లాకు, యువజనసంఘానికి తగిలాయి. పార్టీప్రధాన

మైన నాయకులు కొందరు నేలకు వాలారు - జాన్ క్రేచీ, సతాల్, మైలాష్, క్రాస్నీ, మొదలయిన వాళ్ళు.

దెబ్బ తింటున్నకొద్దీ పార్టీకి అజేయమైన ధైర్యం వచ్చింది. ఒక వ్యక్తి పడిపోతే అతని స్థానంలో ఇద్దరు ముగ్గురు తయారయే వారు. కొత్త సంవత్సరంలో అడుగుపెట్టే సమయానికి పార్టీ నిర్మాణం వుక్కు చట్రంలా తయారయింది. ఎంత భయంకరమైన పోరాటానికైనా సంసిద్ధంగా నిలబడింది. ఈ కృషిలో మా అందరికీ భాగంవున్నా ప్రధానంగా హోంజా జీకానే చెప్పుకోవాలి.

మా కరపత్రాలు ఏ కుటీరంలో చూసినా, ఏగూటిలో వెతికినా కనపడేవి. క్రామేడ్సు జాగ్రత్తగా దాచుకున్న ఫైళ్ళనిండా అవే. ఆ విషయాన్నిగురించి ఇంతకంటె ప్రస్తావించటం అనవసరం.

మా పత్రికలు సభ్యులలోనేకాదు, దేశమంతటా విస్తారంగా ప్రచారంలోకి వచ్చాయి. విడివిడిగా పనిచేసే అనేక 'టెక్నికల్ సెంటర్లు' (రహస్య కేంద్రాల) లో ముద్రింపబడేవి. ఈ కేంద్రాలలో ఒక దానికొకటి సంబంధంలేదు. వీటన్నిటికీ వ్యాసాలెక్కడనుంచి వచ్చేవో ఎవరికీ తెలిదు. అవసరాన్నిబట్టి వీలైనంత వేగంగా పనిచేసేవి. ఉదాహరణకు ఫిబ్రవరి 23 వ తేదీన (1942) కామేడ్ స్టాలిన్ ఎర్రసైన్యానికి పంపిన ఆర్డర్‌ను 24 సాయంత్రానికే జెక్ భాషలో పాఠకుల కందించ గలిగాం. ఇతరులకు ప్రమాదం కలగకుండా వుండాలని ఇందులో అనేక పత్రికలకు నేనే వ్రాసేవాణ్ణి. నేను పట్టుబడితే నాస్థానాన్ని భర్తీచేసే వ్యక్తి సిద్ధంగానే వున్నాడు. నేనరెస్టయిన వెంటనే తనందుకున్నాడు. ఇంకా అక్కడే వున్నాడు.

ఒకవేళ ప్రమాదం తటస్థిస్తే వీలైనంత తక్కువమందికే దెబ్బ తగిలేలాగ మా యూనిట్ నిర్మాణాన్ని కట్టుదిట్టంచేశాం. పూర్వంలాగ అంచెలమీద వార్తలందించే పద్ధతి మానివేశాం. అది ఫిబ్రవరి (1941) లో కేంద్రకమిటీని రక్షించకపోగా ద్రోహులకే తోడ్పడింది. ఇప్పుడనుసరించిన పద్ధతివల్ల వ్యక్తులు బయటపడే ప్రమాదం ఎక్కువయినా నిర్మాణం భద్రంగా ఉండటానికి వీలయింది.

అందుచేతనే కేంద్రకమిటీ కార్యక్రమం నేను అరెస్టయిన తర్వాత కూడ నిరాటంకంగా సాగింది. మే 27 వ (1942) తేదీ రాత్రి

హోంజాజీకా అరెస్టయినాడు. అదికూడా అనుకోకుండానే జరిగింది. జెక్ ప్రజలను దుస్సహమైన బాధలకు గురిచేసిన హెడ్రిచ్‌ని హత్య చేశారు. ఫాసిస్టు బలగమంతా పగబట్టి ప్రేగ్ నగరంపై దాడులు ప్రారంభించింది. జీకా రహస్యంగావుండే గదిలోకి నాజీలు సరాసరి వెళ్ళిపోయారు. అతని రచనలన్నీ మారుపేరుతోనే వున్నాయి. వూరికే వుంటే అతన్ని పసిపట్టే వాళ్ళేకాదు. కాని ఎంతో ప్రేమతో తనకు రక్షణ ఇచ్చిన మిత్రుల కుటుంబానికి ముప్పు కలిగించటం ఇష్టంలేక మేడ రెండో అంతస్థు కిటికీలో నుంచి పారిపోవ ప్రయత్నించాడు. పడిపోయాడు. వెన్నెముక పూర్తిగా విరిగి పోయింది. అప్పుడు పట్టుకొని జైలు ఆసుపత్రికి మోసుకు పోయారు. అత నెవరో వాళ్ళకు తెలియదు. ఫైళ్ళు, ఫొటోగ్రాఫులు తెగవెతికి, పద్దెనిమిదిరోజుల తర్వాత తెలుసుకున్నారు. చావుకు సిద్ధమైవున్నా హింసిస్తే రహస్యాలు చెపుతాడేమో నని పెచెక్ భవనానికి ఈడ్చుకు పోయారు. అతన్ని చూడటానికి నన్నుకూడ లాక్కుపోతే అక్కడ కడసారి కలుసుకున్నాం: కరస్పర్శ చేసుకున్నాం. అమాయికంగా జాలిగా నవ్వుతూ " జూలో! జాగ్రత్త సుమా! " అన్నాడు.

నాజీలు వినగలిగిన రహస్యంకూడ ఇదే. అంతకంటే ఒక ముక్క అతని నోటివెంట రాలేదు. ముఖంమీద కొట్టారు. స్పృహ తప్పింది. మరి రెండు గంటల్లో మరణించాడు

1942 వేసవిలో హోంజాచెర్నీ దొరికిపోయాడు. అతనితో ప్రత్యక్ష సంబంధం పెట్టుకున్న జాన్ పొకోర్నీ పార్టీ నియమాలకు (డిసిప్లిన్) వ్యతిరేకంగా శుద్ధ తెలివితక్కువగా ప్రవర్తించటమే దీనికి కారణం. అతడు ఏమాత్రం బాధ్యత వున్నట్లుగా ప్రవర్తించలేదు. కొన్ని గంటలు హింసించిన తర్వాత - అమానుషమైన చిత్రహింసలకు గురిచేశారు. నిజమే. కాని చేయరని ఎవరనుకున్నారు ?-ఆ హింసాకాండకు బెదిరిపోయి తాను చెర్నీని ఎక్కడ కలుసుకున్నాడో చెప్పేశాడు. అక్కడనుంచి వాళ్ళు హోంజాను ఆరాతీశారు తర్వాత కొద్ది రోజుల్లోనే పట్టుకున్నారు.

అతన్ని తీసుకురాగానే గుర్తుపట్టేందుకు నన్నుకూడ లాక్కుపోయారు.

"ఇతనెరుగుదువా ?"

"ఉహు. నాకు తెలియదు."

అతను కూడా నేనెరగనన్నాడు. ఇక ప్రశ్నలకు జవాబే ఇవ్వలేదు. అతనికి ఎంతో కాలంగావున్న ఒక గాయం అతనిని చిత్రహింస నుంచి కాపాడింది. త్వరలోనే స్పృహతప్పిపడిపోయాడు. రెండోసారి హింసించటానికి తీసుకుపోయేముందు పరిస్థితినంతా స్పష్టంగా తెలియజెప్పాం. దాని ననుసరించే అతను ప్రవర్తించాడు.

అతనితో వాళ్ళకేమీ ప్రయోజనం లేకపోయింది. ఎప్పుడో ఒకప్పుడు సాక్ష్యం దొరక్కపోతుందా, అతని మౌనాన్ని భగ్నం చేయలేకపోతామా అనే ఆశతో అతన్ని చాలాకాలం బ్రతకనిచ్చారు. కాని, హోంజాచెర్నీ చిట్టచివరివరకూ చలించలేదు.

ఖైదులోవున్నా అతనిలో రవంతకూడ మార్పురాలేదు. ఎప్పుడూ ధైర్యంగా, ఉత్సాహంగా, సంతోషంగా వుంటూ, తన భవిష్యత్తు మరణానికి దారితీస్తున్నప్పటికీ ఇతరులకు భవిష్యత్తుపై ఆశ కల్గించేవాడు.

ఏప్రిల్ నెలాఖరులో అతన్ని పాంక్రాస్ జైలునుంచి హఠాత్తుగా తీసుకుపోయారు. ఎక్కడికో? ఇక్కడనుంచి ఎవరైనా అకస్మాత్తుగా అదృశ్యమైతే ఏదో ఉపద్రవం ఎదురుచూసిందన్నమాటే! నాది పొరపాటు కావచ్చు. కాని హోంజాచెర్నీని చూస్తాననే ఆశమాత్రం లేదు!

మేము నిత్యం మృత్యువుతో చెలగాటలాడుతున్నాం. నాజీల చేతుల్లో పడితే మృత్యువు తప్పదని మాకు స్పష్టంగా తెలుసు. అలాగే మా అంతరాత్మలతోను, ఆత్మీయులతోనూ, పట్టుబడినతర్వాత కూడా ప్రవర్తించేవాళ్ళం.

నా జీవిత నాటకం సమాప్తం కాబోతున్నది. నాటకాంతాన్ని మాత్రం నేను చిత్రించలేను. ఈ నాటకమెలా అంతమౌతుందో తెలియదు. ఇప్పుడు ఇక యిది నాటకం కాదు. జీవితం! ప్రత్యక్షజీవితంలో ప్రేక్షకులంటూ వుండరు. మీరంతా ఇందులో పాల్గొనేవాళ్ళే.

చరమాంకం ప్రారంభమవుతున్నది!

నిరంతరం మిమ్మే ప్రేమిస్తున్నా!

స్నేహితులారా! తస్మాత్ జాగ్రత!



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA129B116 |
| పుస్తకం పేరు | రక్తాక్షరాలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | SOWMYA |
| పేజీలు విడదీసినది | SOWMYA |
| స్కాన్ చేసినది | ROHITH |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |